తెలుగు జాతిరత్నాలు



బుర్రకథ పితామహ

# పద్మశ్రీ షేక్ నాజర్



డా॥ కందిమళ్ల సాంబశివరావు

'బుర్రకథ పితామహ'

# పద్మశ్రీ షేక్ నాజర్



**డా॥ కందిమళ్ల సాంబశివరావు**




**సి.పి. బ్రౌన్ అకాడమీ**

104, నిర్మల్ టవర్స్, మెగాసిటీ నెం. 200. ద్వారకాపురి కాలనీ,

పంజాగుట్ట, హైదరాబాద్-500 082. ఫోన్ : 040-23423188

వెబ్‌సైట్ : www.cpbrownacademy.org ఇ-మెయిల్ : info@cpbrownacademy.org

**Padmasri Saikh Nasser**

Author : **Dr. Kandimalla Sambasiva Rao**

First Edition : 2009



Chief Visualizer : A Bangaru Babu

Cover Design : Ganesh Ramoju

Typesetting : V Aruna Devi, T Rajendra Prasad

Published by



**CP Brown Academy,**

104, Nirmal Towers, Mega City No. 200, Dwarakapuri Colony,

Panjagutta, Hyderabad - 500 082, India.

Website : www.cpbrownacademy.org, e-mail : info@cpbrownacademy.org

Phone : 040-23423188, Fax : 040-23423118

Price : **Rs. 90**    US $ : **4**

*Printed at :*

M/s. ICIT Software Centre Private Ltd.,

Plot No. 165 & 166(P), Phase-V, IDA,

Jeedimetla, Hyderabad - 500055, India.

## సి.పి. బ్రౌన్ అకాడమీ

తెలుగుభాష మరియు సంస్కృతీ వికాసాన్ని ప్రోత్సహించాలనే సంకల్పంతో సి.పి. బ్రౌన్ అకాడమీ అనే ప్రజాహిత సంస్థను హైదరాబాద్‌కు చెందిన ఆల్ఫా ఫౌండేషన్ అనే రిజిస్టర్డ్ ఛారిటబుల్ సంస్థ వారు 2007లో స్థాపించారు.

అకాడమీ ముఖ్య కార్యక్రమాలు:

- తెలుగువారి పిల్లలకు తమ భాషా, సాహిత్య సాంస్కృతిక వారసత్వ వైభవాన్ని తెలియజెప్పి, వారు తెలుగు భాషాజ్ఞానం పెంచుకొనేందుకు సులభమయిన సరళమయిన బోధనా ప్రణాళికలు ఏర్పరచడం.
- తెలుగులో మంచి సాహిత్యాన్ని అందించగల రచయితలను ప్రోత్సహించటం.
- తెలుగు భాషలో ఉన్న పుస్తకాలను, పత్రికలనూ, పరిశోధన గ్రంథాలనూ సేకరించి 'డిజిటైజ్' చేయటం, ఒక బృహద్గ్రంథాలయం ఏర్పరచి, తెలుగు వారందరికీ అందుబాటులోకి తేవటం.
- ప్రతి సంవత్సరం తెలుగు సాహిత్యం లేక భాషకు తమ జీవిత కాలంలో ఎనలేని సేవ చేసిన ప్రముఖులను "తెలుగు భారతి" పురస్కారం (రెండున్నర లక్షల రూపాయల నగదు బహుమతి మరియు సన్మాన పత్రం) తో సత్కరించడం.

అకాడమీ ఆశయ సాధనలో సహకరించేందుకు, ప్రముఖ సాహితీవేత్తలు సభ్యులుగా ఒక సలహా మండలి కూడా ఏర్పరచటమయినది.

# విషయ సూచిక

# మా మాట

ఓ చేత్తో తంబుర వాయిస్తూ, మరో చేత్తో అందెలు మోగిస్తూ, కాళ్ళతో ఆడుతూ, ఎగురుతూ "వినరా భారత వీరకుమారా విజయము మనదేరా" అంటూ తన గళంతో 'మైమరపిస్తూ' వీరరసం అందిస్తూంటే, ఉద్రేకం అవధులు లేని చైతన్యంలాగా ప్రవహిస్తూంటే నాజర్ బుర్రకథతో శ్రోతల రక్తం ఉడుకెత్తి ఉరకలు వేసేది.

జానపదకళారూపమైన బుర్రకథ మాధ్యమం ద్వారా తను నమ్మిన సిద్ధాంతాలకు సమకాలీన ప్రజా సమస్యలను జోడించి ప్రజల భాషలో ఓ కష్టజీవి, ఓ పల్నాటి యుద్ధం, ఓ సీతారామరాజు కథల్లాంటి బుర్రకథలను ఊరూరా చెబుతూ ప్రజలను, ముఖ్యముగా అట్టడుగు వర్గాల వారిని, జ్ఞానవంతులుగాను, చైతన్యవంతులుగాను, ఉద్యమాలు నడుపగల కార్యకర్తలుగాను జాగృతం చేయాలనే పట్టుదలతో నిర్విరామ కృషి చేశారు.

తెనాలిలోని బాలరత్న నాటక సమాజంతో మొదలిడిన తన సాంస్కృతీ యాత్రలో, దాదాపు నాలుగు దశాబ్దాల పాటు తెలుగు ప్రజానీకాన్ని తన బుర్రకథతో ఉర్రూతలూగించినట్టి నాజర్, అప్పటి కమ్యూనిస్టు పార్టీ ఏర్పరచిన పదహారు రూపాయల నెలసరి జీవనభృతితో బుర్రకథకుడిగా, రచయితగా ఎదిగి, తను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి పార్టీకి దూరమై బుర్రకథ పితామహుడుగా మరియు సాంస్కృతికయోధుడుగా గుర్తింపబడి, పద్మశ్రీ పురస్కారముచే గౌరవింపబడిన నాజర్ జీవితం మనందరికీ ఆదర్శం. ఇష్టపడిన పని చేయడానికి ఎటువంటి కష్టాలు అడ్డురావని చాటిచెప్పే వారి జీవితచరిత్ర చదవటం అవశ్యకం, అందుకే ఈ పుస్తకం.

సిపి బ్రౌన్ ఎకాడమీ వారు అడిగినదే తడవుగా, అట్టి పద్మశ్రీ నాజర్‌గారి జీవనయాత్రను స్ఫూర్తిదాయకంగా మనముందుంచిన డా॥ కందిమళ్ల సాంబశివరావు గారికి కృతజ్ఞతలు.

జిఆర్‌కె మూర్తి
సి.పి. బ్రౌన్ అకాడమీ

# కృతజ్ఞతా మందారం

అహోబిలం దేవస్థానంలోకి అడుగుపెట్టబోతున్న సమయంలో డాక్టర్ ఆవుల మంజులత గారి నుండి ఫోన్ వచ్చింది. కందిమళ్ల వారూ సి.పి. బ్రౌన్ అకాడమీ పక్షాన బుర్రకథ నాజర్ గారి మీద ఓ పుస్తకం వ్రాయాలి దుగ్గిరాల సోమేశ్వరరావు గారు మీ పేరు సూచించారు వ్రాయగలరా అన్నారు. వెంటనే మారుమాట లేకుండా తప్పకుండా మేడమ్ అన్నాను. కారణం నాజర్ గారితో నాకు ప్రత్యక్ష పరిచయం ఉంది. నాజర్ గారి బుర్రకథ ఎప్పుడో చిన్నప్పుడు విన్నాను. రేడియోలో రెండు మూడుసార్లు విన్నాను. కాకతీయ కళాపరిషత్ (నాగభైరువారిపాలెం)లో ఘనంగా సన్మానించాం. నాలుగైదు సభలకు నేనే స్వయంగా వెళ్లి నాజర్ గారిని తీసుకొచ్చా. ఇంటికి వెళ్లినప్పుడల్లా ఆప్యాయంగా పలుకరించేవారు. బుర్రకథ అనగానే నాజర్ పేరు.. నాజర్ అనగానే బుర్రకథ గుర్తుకు వస్తాయ్. ఒక తరాన్ని ఉర్రూతలూగించిన నాజర్ గారి గురించి ఎన్నో విషయాలు పరిశోధించి వ్రాయడానికి నా కలం ఉవ్విళ్లూరింది. డాక్టర్ చింతపల్లి సత్యనారాయణ నాజర్ గారి బుర్రకథలు, ఇది నాకథ అని నాజర్ స్నేహ హస్తాలతో వ్రాసిన సుదీర్ఘమైన వ్యాసం ఇచ్చారు.

నా తరువాత మా గురువుగారు గంగప్ప దగ్గర నాజర్ గారి మీద పరిశోధన చేసిన డాక్టర్ రమణమూర్తి వ్రాసిన **పింజారి** పుస్తకం ఎంతో దోహదపడింది. ఓ రోజు గుంటూరు అమరావతి రోడ్‌లోని నాజర్ గారింటికి వెళ్లా. నాజర్ గారి చిన్నబ్బాయి బాబూజీతో కాస్త పరిచయం కూడా ఉంది. ఎంతో మంచి విలువైన సమాచారాన్ని, అరుదైన ఫొటోలను ఇచ్చారు. ఎప్పుడు ఏ సందేహం వచ్చినా ఫోన్ చేస్తే నివృత్తి చేసేవారు.

ఈ పుస్తక రచనలో ఎంతో సహకరించిన డాక్టర్ వి. సింగారావు, డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ, శ్రీమతి గింజుపల్లి సుశీల, డాక్టర్ గుమ్మా సాంబశివరావు, డాక్టర్ రమణమూర్తి గారికి ధన్యవాదాలు.

పుస్తకరచన, ప్రూఫ్ రీడింగ్‌కు ఆయువుగా నిలిచి అనుక్షణం సహకరించిన చుండి వెంకన్నారావుకు ప్రత్యేక కృతజ్ఞతలు.

సమాచార సేకరణలో సహకరించిన చిలుకూరి శ్రీనివాసరావు, కొత్తపల్లి రవిబాబు గారికి అభివందనలు.

నాజర్ గారి పాత ఫొటోలను కంప్యూటర్‌లో కొత్తగా తీర్చిదిద్దిన కొంగర వీరేంద్ర, డి.టి.పి. చేసిన అంబలపాటి శ్రీనివాస్‌కు కృతజ్ఞతలు.

సి.పి. బ్రౌన్ అకాడమీ నిర్వాహకులు శ్రీ దినకరరావు గారికి, శ్రీ సుబ్బారావు గారికి అభినందన చందనాలు.

విషయ వర్గీకరణలో విలువైన సూచనలిచ్చిన గురుదేవులు ఆచార్య గంగప్పగారికి, ఈ గ్రంథ మూలకారకులు శ్రీ దుగ్గిరాల సోమేశ్వరరావు గారికి శిరసా నమామి.

నాజర్ సమకాలీకులు, సహ కళాకారులైన శ్రీ మిక్కిలినేని, శ్రీ మాచినేని, శ్రీ కర్నాటి గారికి కళాభివందనాలు.

నాటక రచన, నిర్వహణ, నాటక రంగ పరిశోధన దిశగా సాగుతున్న నా ప్రస్థానంలో నాజర్ కళారంగ చరిత్రపై గ్రంథరచన చేయడం సరికొత్త మార్పుకు వాకిళ్లు తెరిచింది. జానపదాన్ని పుక్కిట పట్టి ఆ పాటలను శక్తిమంతంగా ప్రయోగించిన జానపద వాగ్గేయకారుడు నాజర్ సాహిత్యాన్ని లోలోతులకు వెళ్లి శోధించాను. బుర్రకథ రగడల పట్టుచిక్కింది. సమాంతరంగా నేను రచిస్తున్న నాటకంలో బుర్రకథను అంతర్భాగంగా చేయడానికి గొప్ప స్ఫూర్తి లభించింది.

నాజర్ బుర్రకథలు గొప్ప ప్రభంజనాన్ని సృష్టించాయి. ఆ సాహిత్యాన్ని ఈ తరానికి పరిచయం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అదేవిధంగా పాటలను కూడా. అందుకే ఆ పాటలను బుర్రకథల్లోని రగడలు, పాటలను యథాతథంగా అందించాను.

నాటకంతో నడుస్తున్న నన్ను ప్రదర్శనా కళా రూపమైన బుర్రకథను శోధించి మథించడానికి అవకాశం ఇచ్చిన సి.పి.బ్రౌన్ అకాడమీ వారికి సర్వతా కృతజ్ఞతలు.

డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు
ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్. తెలుగు రీడర్,
డి.ఆర్.యన్.యస్.సి.వి.యస్.కళాశాల,
చిలకలూరిపేట - 522616, గుంటూరు జిల్లా.
సెల్ : 98483 51517

# 1

## బుర్రకథ పితామహ

# పద్మశ్రీ షేక్ నాజర్ కళాప్రస్థానం



కథనానికి సిద్ధమౌతున్న నాజర్

"ఎన్నాళ్లీ కాపురాలు.. ఏచెరో సురోబడి సేద్దామన్నా... కాపురమంత కరువుల సంత.. జీవితమంతా చిరుగుల బొంత.. గాలి కొంపలూ.. ఖాళీ కుండలూ.. చాలీ చాలని కూలి గింజలు" అంటూ పాలేరు హృదయ విదారక వ్యధార్త యదార్ధ గాథలను

గుండె కరిగేలా వినిపించిన ప్రజాకవి..' **"ఏరన్నా రాకముందే ఏరువాక వచ్చేరన్నా.. ఎవరింటా ఉండువన్నా ఓరన్నా జీతగాడా పొద్దున్నే సద్దికూడు.. మద్దేల నీలకూడు.. కొద్దిగా జీతమాయె పొద్దాకా తోముడాయె"** అంటూ కూలీ నాలీ జనం గుండె చప్పుళ్లను అత్యద్భుతంగా కవిత్వంలో ప్రతిధ్వనించి జానపదుల జ్ఞానపథాలను జాతికి పంచిపెట్టిన అసలు సిసలైన జనకవి బుర్రకథా పితామహుడు పద్మశ్రీ షేక్ నాజర్. నాజర్ ఒక లేజర్ కిరణం. జానపదాలు నాజర్‌ను సృష్టిస్తే నాజర్ జానపదాలను సృష్టించాడు. తెలుగు మెదళ్లకు జ్ఞాపకశక్తి ఉన్నంతకాలం.. తెలుగు పుటలకు చెదలు పట్టనంతకాలం బుర్రకథకు ప్రత్యామ్నాయం.. పర్యాయపదం నాజరే..

తెలుగునాట బుర్రకథ కళారూపానికి ఒక గుర్తింపును, గౌరవాన్ని తెచ్చిన స్రష్ట. ద్రష్ట.. నాజర్. ఆయన చండం చండం తీవ్ర తీవ్రంగా కథను చెబుతున్నంతసేపు ప్రేక్షకులు దానిలో లీనం కావడాన్ని చూస్తే కళకు ప్రజకూ మధ్య తెరలు తొలిగి పోయినట్లు స్పష్టంగా తెలుస్తుంది. కళలు అంత:పురాల జిలుగు పరదాలను చీల్చుకొని ప్రజలకు అంకితమైన స్థితికి అద్దం పడుతుంది. జనం మెచ్చిన.. నచ్చిన కవుల కలానికీ, గాయకుల గళానికీ మరణం లేదు. ప్రజల చేత.. ప్రజల వలన.. ప్రజల కొరకు కవిత చెప్పేవారు.. గళం విప్పేవారు అజరామరులు. ఈ నమ్మిక.. నిబద్ధతతోనే నాజర్ కలం పట్టి.. గళం విప్పిన నాటి నుండి కన్నుమూసే వరకు బుర్ర కథలు వ్రాశారు... పాడారు.. ఆడారు.

నాజర్ కథ చెబుతుంటే శృంగారం రసరంజకంగా గిలిగింతలు పెడుతుంది. హాస్యం నవ్వుల పువ్వులను పూయిస్తుంది. వీరం మహోద్రేకంగా పరవళ్లు తొక్కుతుంది. కరుణం కన్నీళ్లను ధారగా కురిపిస్తుంది. రౌద్రం మహోద్రేకంగా తాండవిస్తుంది. అద్భుతం అద్భుతాల లోకంలో విహరింపజేస్తుంది. భీభత్సం రోతను చిప్పిల్లుతుంది.. భయానకం గుండెల్లో భయ ప్రకంపనాల గుబులు పుట్టిస్తుంది. శాంతం శుభం పూల పరిమళాలను విరజిమ్ముతుంది. అందుకే నాజర్ కథంటే ఒక స్ఫూర్తి.. ఒక చైతన్యం.. ఒక స్పందనం.. ఒక కెరటం.. ఒక ఉద్యమం.. ఒక విప్లవం.. **"శ్రీగల భారత వీరుల్లారా"** అంటూ ప్రారంభమైన నాజర్ గళం గాలి కెరటాలలో మంద్ర మంద్రంగా సాగుతూ ఝుంఝూ మారుత ప్రభంజనంలా.. హోరెత్తే ప్రళయ కాల ఘోషలా మారుతుంది.

నాజర్ చెప్పే కథ పురాణమైనా.. కాల్పనికమైనదైనా అందులో అసహాయుల ఆక్రందనలు.. తరతరాల దోపిడీ మతలబులు, మధ్య తరగతి విఫల మంద హాసాలూ.. వినిపిస్తాయి.. కనిపిస్తాయి. కథ ప్రారంభమైన కొద్ది నిముషాలలోనే ప్రేక్షకులను కట్టివేస్తుంది. కథన ఝరిలో ముంచెత్తుతుంది. ఒక అవ్యక్తమైన ఆనందాన్నో.. ఆవేశాన్నో కలిగిస్తుంది. కథ ముగిసినప్పటికీ ఆ కథా కథన కౌశలం కొన్ని తరాల పాటు చెవుల్లో గింగురు మంటుంది. మస్తిష్కాలలో బలమైన శాశ్వత ముద్రను వేస్తుంది. నాజర్ కథ జానపద ప్రదర్శనా కళలకే వన్నె చిన్నెలు దిద్దింది.

## పడిలేచిన నాజర్ జీవన తరంగం

ఆకలి పేగులు రుద్రవీణను మీటితే.. పస్తుల ఆస్తులు వంశపారంపర్యంగా సంక్రమిస్తే.. బాధల సుడిగుండాలలో ఉక్కిరి బిక్కిరైపోతే జీవిత పాఠశాలలో అనుభవాలే ఉపాధ్యాయులుగా, అంతులేని దు:ఖం సహాధ్యాయిగా బ్రతికిన నాజర్ కటిక దారిద్ర్యం నుండి అత్యున్నత పద్మశ్రీ పురస్కార స్థాయికి ఎదిగారు. చూపుడు వేలుతో తంబూరా తీగను మీటితే ఆ ప్రకంపనల సుశ్రావ్యతకు తెలుగు ప్రేక్షకలోకం మంత్ర ముగ్ధమైపోయేది. ఆయన బ్రతుకు బాటలో అరికాళ్లను చీల్చివేసే బాధల కోసురాళ్లే. కష్టాల హాలాహలాన్ని కడుపులో దాచిపెట్టి ఆకలిబాధను మునిపంట నొక్కిపెట్టి తన గానామృతంతో, అభినయ చాతుర్యంతో జాతిని ఉర్రూతలూగించారు. అందుకే ఆయన ఆకలి చెక్కిన కళాతపస్వి.. అనుభవం తీర్చిన మహామనిషి. తాను నొచ్చుకొన్నా ఎవ్వరినీ నొప్పించని మధుర మనస్వి. ఈతిబాధల శూలాలు వంటి నిండా గుచ్చుకొని, శరీరాన్ని, మనస్సునూ కకావికలం చేస్తున్నా కథతోనే ఆయన నడిచారు. కథలోనే ఆయన బతికారు. కళాకారుడి కడుపులో ఆకలి కాష్ఠంలో కట్టెలా కాలుతున్నా కీర్తి కిరీటాల ధగధగలు అంబరాన్ని తాకుతాయనే నానుడికి నాజర్ బ్రతుకు పుస్తకమే ఒక నికషోపలం. ఆ బ్రతుకు పుస్తకంలోని కథను.. వ్యధను.. సుధను ఒక్కసారి అవలోకిస్తే....

అది సిరులు పొంగే జీవగడ్డ.. పురులు పొంగే ధాన్యరాసులతో అలరారే నల్లరేగడిగడ్డ. గుంటూరుకు సమీపంలోని పొన్నెకల్లు గ్రామం.. తూర్పు వీధిలో దూదేకుల సాయిబులు ఒక్క గుట్టగా ఉన్న చోట పందిరి గుంజ కూడా అరున్నొక్క రాగంతో కమనీయంగా పాడుతుందనే ప్రతీతి. చెక్కభజనలో ఆ ప్రాంతంలో గొప్ప కళాకారునిగా

పేరు పొందిన షేక్ మస్తాన్ నౌబత్ మేళగాడు. ఆయన అర్ధాంగి బీబాబీ.. షేక్ మస్తాన్ అన్న షేక్ నాజర్ గొప్ప షహనాయి విద్వాంసుడు. మస్తాన్, బీబాబీ గర్భ శుక్తి ముక్తా ఫలంగా సిద్ధార్థినామ సంవత్సరం ఫిబ్రవరి ఐదు రాత్రి ఎనిమిది గంటల సమయంలో మఖ నక్షత్రంలో నాజర్ జన్మించాడు. పుట్టిన బిడ్డ ఏడ్పులోనే ఒక సుస్వరం.. ఒక సుస్వనం ఉంది. ఆ ఏడుపు కమనీయమైన షహనాయి వాద్యం లాగా విన్పించడంతో మా అన్న నాజర్ మళ్లీ నా బిడ్డగా జన్మించాడని మస్తాన్ సంబరపడి పోయాడు. బీబాబీ తండ్రి పుట్టిన పిల్లాడికి అజీజ్ అనే పేరు పెట్టాడు. కానీ మస్తాన్‌కు ఆ పేరు ఎందుకో సుతరామూ నచ్చలేదు. ఆయనకు గొప్ప కళాకారుడైన తన అన్న నాజర్ పేరు పెట్టాలని, బిడ్డ తన అన్నలాగే గొప్ప కళాకారుడు కావాలని ఆశ. ఈ వాదులాట పంచాయితీ నేపథ్యంలో రోజుల పిల్లాడు పాలుకూడా తాగకుండా గుక్కపట్టి ఏడుస్తున్నాడు. బీబాబీ అక్క ఫాతిమాబీ ఇల్లు అలికి తలారా స్నానం చేసి సాంబ్రాణీ వేసి నాజరయ్యా! పిల్లాడు పాలు తాగితే నీ పేరే పెట్టుకొంటామని మొక్కుకుంది. వెంటనే ఆ పిల్లవాడు పాలుతాగి బోసి నవ్వులను కురిపించాడు. గారపాడుకు చెందిన అమ్మమ్మ, తాత బంధువులంతా అబ్దుల్ అజీజ్ అనీ, పొన్నెకల్లుకు చెందిన మస్తాన్ బంధువులంతా నాజర్ అని పిలవడం ప్రారంభించారు.

నోటిలో అక్షరాలు నానుతున్న నాటి నుండి వచ్చీ రానీ మాటలతో అందరినీ ఆనందింపచేసే నాజర్ నాలుగేళ్ల వయస్సులోనే "హా అదిగో లేడి.. పరుగెడుతుందీ.. లేడి బోయెరా.. హా బాణమేయరా.." అంటూ ఎగిరిగంతులు వేస్తూ పాడేవాడు. ఏడెనిమిదేళ్ల వయస్సులో గ్రామంలో వేసిన బ్రహ్మంగారి నాటకం చూసి గేదె వెంట్రుకలను పీకి గడ్డాలు మీసాలుగా తుమ్మ జిగురుతో అంటించుకొని "నేనే బ్రహ్మమురా.. పామరులారా.. నేనే బ్రహ్మమురా" అంటూ రాగాలు తీసేవాడు. పొద్దు పొడిచింది మొదలు పొద్దు గూకే దాకా గొడ్డు చాకిరి చేసినా ఇంట్లోని వారందరికీ నాలుగు వేళ్లూ లోపలకి వెళ్లని కటిక దరిద్రం తాండవించే ఇల్లు అది. కన్నతల్లి బీబాబీ అయితే నాజర్‌ను పెంచిన తల్లి ఆమె సోదరీ, వితంతువు లాలూబీ. చిన్నతనం నుండీ నాజర్ ఆమెను పెంచినమ్మా అని పిలుస్తూ ఆమె కొంగు పట్టుకొని తిరిగేవాడు. దరిద్రం కాల్చుకు తింటున్నా బిడ్డ నాజర్‌ను చూస్తే వీడు చాలా గొప్ప వాడౌతాడనే నమ్మకం తండ్రికి బలంగా నాటుకు పోయింది. పొన్నెకల్లు వీధి బడిలో చేర్పించాడు. ఊళ్లో

విన్న పద్యాలూ.. పాటలను నాజర్ కూని రాగాలతో పాడేవాడు. పంతులు గారికి ముచ్చటేసి పలక మీద ఒకవైపు ఎక్కాలు, రెండవ వైపు శతక పద్యాన్ని వ్రాసి ఇచ్చేవారు. ఆ పద్యాలను చదువుకొంటూ ఇంటికి వస్తే అన్నం లేదంటూ అమ్మ ముంతెడు మజ్జిగ ఇస్తే "సజ్జజొన్నలు లేవుగానీ చల్ల తాగీ చదువుకోరా" అంటూ పాడుకొంటూ వీధిలోకి ఆడుకోవడానికి పరుగెత్తేవాడు.

అప్పుడే ఆ ఊళ్లోకి మహానటుడు కపిలవాయి రామనాథ శాస్త్రి రికార్డులు వచ్చాయి. **స్థిరమైన నడవడి, జనులందరికీ వలయు** అనే పద్యాలు, **"కోరి భజింతు గోవిందు నామది"** అనే పాట నాజర్ నోటికి పట్టాయి. ఒక రోజు కచ్చేరి దగ్గర నాజర్ ఆ పద్యాలూ పాటలూ పాడుతుంటే జనం అంతా చుట్టూ మూగారు. గుడిలో మేళం వాయించడానికి వచ్చిన తండ్రి మస్తాన్‌తో "మీ వాడు బాగా పాడుతున్నాడు. మీ అన్న పేరు నిలబెడతాడు" అనడంతో ఆయన పొంగిపోయాడు.

పొన్నెకల్లులో పీర్ల పండుగ హడావుడి అంతా ఇంతా కాదు. మస్తాన్‌తో పాటు ఆ కులస్తులందరూ వేషాలు వేసుకొని ఇంటింటికీ వెళ్లేవారు. ఆ ఏడు నాజర్‌కు రేకుతో కిరీటం, భుజ కీర్తులూ తగిలించి తండ్రి వెంటబెట్టుకొని వెళితే ఆ ముద్దు మాటలకు.. బుడతడి పాటలకు మెచ్చిన జనం ఎక్కువ గింజలు ఇచ్చారు. అందె కోటదాసు ఆ రోజుల్లో పేరుపొందిన వీధి భాగవతం కళాకారుడు. ఆ బృందంలోని జంగా సుబ్బారావు, యాదవ దాసు, చిన్న సుబ్బమ్మ, చింతపూవు మాణిక్యమ్మ, తారాబాయి, పద్మాబాయి ఒకరిని మించిన వారొకరు. కోటదాసు పాటలు నాజర్‌ను చిన్నతనంలోనే అమితంగా ఆకర్షించాయి. నాజర్ జ్ఞాపకశక్తి చాలా గొప్పది. మనసుపెట్టి ఒక్కసారి వింటే ఆ పాటను వెంటనే రాగంతో సహా పాడి వినిపించేవారు. ఖాదర్‌సాహెబ్ అనే హార్మోనియం విద్వాంసుడు నాజర్‌ను నరసరావుపేట లోని సంగీత విద్వాంసుడు మురుగుళ్ల సీతారామయ్య వద్దకు తీసుకెళ్లి సంగీతం నేర్పమని కోరాడు. నెలకు మూడు రూపాయిలిస్తే సంగీతం నేర్పించి భోజనం కూడా పెడతానని సీతారామయ్య చెప్పారు. నాజర్ తండ్రి మస్తాన్ మూడు నెలల డబ్బులు పంపాడు. ఓ రోజు వచ్చి పూట గడవటం కూడా మాకు కష్టంగా ఉంది వీడి సంగతి మీరే చూడాలని కళ్లనీళ్లు పెట్టుకొన్నాడు. వీడి విషయం నాకు వదిలి వెయ్యమని సీతారామయ్య భరోసా ఇచ్చారు. సీతారామయ్య శిష్యరికంలో నాజర్ సంగీతంలో సంగతులతో పాటు హార్మోనియం కూడా నేర్చుకొన్నాడు.

నాజర్ చెల్లెలు పెళ్లికి లాంఛనాలు చెల్లించడానికి బహుమతిగా వచ్చిన వెండి, బంగారు మెడల్స్‌ను అమ్మివేశాడు. అటూ ఇటూ తిరిగిన నాజర్ చివరకు స్వంత ఊరికి చేరారు. పొట్ట నింపుకోవడానికి కూలిపనికి వెళ్లడం ప్రారంభించాడు.

ముట్లూరు కోటి వీరయ్య భాగవతార్ పేరుమోసిన హరికథకులు. పొన్నెకల్లులో హరికథలు చెప్పే సమయంలో నాజర్ వారి పక్కనే ఉండేవాడు. ఓ రోజు గ్రామస్తులంతా విరామ సమయంలో నాజర్ చేత పాడించాలని కోరారు. శాస్త్రీయ సంగీతంలో నాజర్ పట్టును గుర్తించిన హరికథా భాగవతార్ తనతోపాటు నాజర్‌ను తీసుకొని వెళ్లాడు. కొన్నాళ్లు ఆయన శిష్యరికం చేసి శంకరాభరణం, కాంభోజిరాగాలను నేర్చుకొన్నాడు. ఈలోగా తండ్రి కాలధర్మం చెందడంతో నాజర్ మళ్లీ స్వగ్రామానికి చేరాడు. తండ్రి వారసత్వంగా గుడిమేళం వాయించడానికి సన్నాయిని నేర్చుకొన్నాడు. పగలంతా కూలిపని, రాత్రి గుడి మేళంతో రోజులు గడుస్తున్నాయి. ఈ లోగా కుట్టుమిషన్ నేర్చుకొన్నాడు. సంక్రాంతి గింజలు అడుక్కోవడానికి ఇంటింటికీ తిరిగినప్పుడు పొగడ్తలు, ఛీత్కారాలను సమంగా స్వీకరించేవాడు. కొన్నాళ్లు పొగాకు కంపెనీలో ముఠా కూలీగా పనిచేశాడు. అక్కడ మేస్త్రీతో సరిపడక మానివేశాడు. దినదినగండంగా రోజులు మారడంతో ఒక దున్నను అమ్మి కుట్టుమిషన్‌ను కొనుగోలు చేశాడు. ఊళ్లో నాజర్‌కు ఉన్న గుర్తింపు మూలంగా ఇబ్బడిముబ్బడిగా పనివచ్చేది. రాబడి పెరిగింది. కొత్త కొత్త సావాసాలు కుదిరాయి. కొంతమంది స్నేహితులు మూలంగా సిగరెట్లు, పేకాట, తాగుడు, అబద్ధాలు చెప్పడం వంటి దురలవాట్లు అబ్బాయి. ఒకరోజు ఒళ్లు తెలియకుండా తాగి స్పృహ తప్పితే ఇంట్లో వాళ్లు తిడతారనే భయంతో గుంటూరుకు పారిపోయాడు. మూడు రోజుల తర్వాత పిల్లిలా ఇంటికి చేరాడు. ఇంతలో ఆర్యసమాజం గ్రామాలకు కూడా పాకింది. ఆర్యసమాజంలో చేరి దురలవాట్లకు స్వస్తి చెప్పాడు. త్రిపురనేని రామస్వామి చౌదరి హేతువాద సాహిత్యం, కమ్యూనిస్టుపార్టీ రహస్య పత్రికలూ, మాక్సిమ్‌గోర్కీ గారి 'అమ్మ' నవల వంటి సాహిత్యాన్ని విస్తృతంగా చదివాడు.

పొన్నెకల్లులో కొమ్మినేని బసవయ్య, వల్లూరి రామయ్య తమ పిల్లలకు సంగీతం నేర్పమని కోరారు. సంగీత దర్శకునిగా సినీ సామ్రాజ్యాన్ని దశాబ్ది కాలం శాసించిన చక్రవర్తి నాజర్ వద్ద సంగీతంలో శిక్షణ పొందినవారిలో ఒకరు. ఇదే సమయంలో దామర్లపల్లి ఫణిదం గ్రామాలకు ప్రతిరోజూ కాలినడకన వెళ్ళి సంగీత పాఠాలను

నేర్పారు. కోంద్రుపాడు గ్రామ యువజనులకు కృష్ణ లీల కనకతార నాటకాలను నేర్పారు.

తుళ్ళూరులో కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో జరిగిన పాటల పోటీలు నాజర్ గమ్యాన్ని అనూహ్యమైన మలుపును తిప్పాయి. ఆ పోటీలలో నాజర్‌కు ప్రథమ బహుమతి వచ్చింది. కమ్యూనిస్టు పార్టీ నాయకులు కొండపనేని బలరామ్, వేములపల్లి శ్రీకృష్ణ పొన్నెకల్లులో గ్రామ కమ్యూనిస్టు పార్టీ శాఖను ఏర్పాటు చేశారు. నాజర్‌ను గుంటూరు కమ్యూనిస్టు కార్యాలయానికి రప్పించి తుళ్ళూరుకు చెందిన రామకోటి, తెనాలికి చెందిన ముక్కామల పురుషోత్తంతో కలసి బుర్రకథ దళాన్ని తయారు చేశారు. మొదట రామకోటి కథకుడు, నాజర్ హాస్యం, పురుషోత్తం రాజకీయ వంతలుగా ఈమనిలో కథ చెప్పారు. కథ విజయవంతమైనా ఈ కాంబినేషన్ ఎందుకో రామకోటికి నచ్చలేదు. నాజర్‌ను ప్రధాన కథకునిగా చేసి రామకోటి హాస్యవంతగానిగా మారాడు. అప్పటికే బుర్రకథను చెబుతున్న చింతల సూర్యనారాయణ, వెంకట సుబ్బయ్య, కాకుమాను సుబ్బారావు బుర్రకథలో ఎన్నో కిటుకులను నేర్పారు. కాకుమాను సుబ్బారావు వ్రాసిన **"వీరనారి టాన్యా"** అనే బుర్రకథను తొలిసారిగా నాజర్ దళం తాడికొండలో చెప్పారు. అప్పటికే బుర్రకథకునిగా ఆ ప్రాంతంలో పేరున్న దొడ్డవరపు వెంకటస్వామిని మరిపించావని ప్రజలు నాజర్‌ను పొగిడారు. ముక్కామల పురుషోత్తం నాజర్‌కు ప్రతిరోజూ పత్రికలను చదివి వినిపించేవారు. జిల్లా కమ్యూనిస్టు కార్యాలయంలోనే నివాసముంటున్న నాజర్ దళ సభ్యులకు మోటూరి హనుమంతరావు,ఆయన భార్య, ఉదయం పులుపుల వెంకట శివయ్య వంటి వారు ప్రతిరోజూ కమ్యూనిస్టు సిద్ధాంత గ్రంథాలను పాఠాలుగా చెప్పేవారు. శ్రుతి తంబూరా అవసరమని రామకోటి సతాయించడంతో చింతల సూర్యనారాయణ దావులూరులో ఉన్న సీనియర్ బుర్రకథకుడు దొడ్డవరపు వెంకటస్వామి వద్దకు తీసుకువెళ్ళాడు. వెంకటస్వామి నాజర్‌ను ఆశీర్వదించి తన తొలిరోజుల్లో ఉపయోగించిన తంబూరాను బహూకరించారు. రామకోటి తంబూరాను శ్రుతిచేయడం, మీటటాన్ని నేర్పారు.

విజయవాడలో జరిగిన రైతు మహాసభలో నాజర్ బృందం టాన్యా బుర్రకథను చెప్పారు. కథను బాగా చెప్పినా వస్తువు జాతీయం కానందున నాజర్ బృందానికి న్యాయనిర్ణేతలు ద్వితీయ బహుమతిని ప్రకటించారు. గుంటూరు జిల్లా ప్రజానాట్య

మండలి దళాన్ని ఏర్పాటుచేశారు. ఈ దళంలో నాజర్‌తో పాటు రామకోటి, బి.గోపాలం, కాకుమాను సుబ్బారావు, పురుషోత్తం, కె.బలరామయ్య, మోటూరి ఉదయం, పూర్ణచంద్రరావు, లక్ష్మీకాంతమోహన్, చింతల కోటేశ్వరమ్మ, విమల వంటి వారు సభ్యులుగా ఉన్నారు. భార్యాభర్తలు ఉంటే 30 రూపాయిలు, ఒక్కరైతే పదహారు రూపాయలు జీవనభృతిగా పార్టీ ఇచ్చేది. బుర్రకథ బృందం నాట్యాలు, కోలాటం, పగటి వేషాలు, పిట్టల దొర వంటి కళారూపాలను దళం జిల్లా వ్యాప్తంగా ప్రదర్శించేది.

బుర్రకథకునిగా, నటునిగా గుర్తింపును పొందిన నాజర్‌కు పెదపూడిలో జరిగిన చారిత్రక విజ్ఞాన రాజకీయ పాఠశాలలో విద్యార్థిగా చేరడం ఒక కొత్త జీవితాన్ని ఇచ్చింది. మహామహులుగా గుర్తింపు పొందిన కొడవటిగంటి కుటుంబరావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నిడదవోలు వెంకట్రావు, శ్రీశ్రీ వంటి వారు చెప్పిన పాఠాలతో నాజర్‌లో అప్పటి వరకు అజ్ఞాతంగా దాగి ఉన్న కవి కన్ను విప్పాడు. ఛందస్సు, అలంకారాలను గూర్చి తెలుసుకొన్న నాజర్ పాటలతో పాటు గీత పద్యాలు, సీస పద్యాలను వ్రాయడం మొదలుపెట్టాడు.

పేద ప్రజలను సాయుధ పోరాటానికి పురిగొల్పుతుందనే సాకుతో 1948 జూన్‌లో ప్రభుత్వం ప్రజానాట్యమండలిపై నిషేధాన్ని విధించింది. దీనితో కమ్యూనిస్టు పార్టీ నాయకులంతా అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు. ప్రజానాట్యమండలి కళాకారులు ఎవరి దారి వారు చూసుకోవాలని పార్టీ ఆదేశించింది. ప్రజానాట్యమండలిని రద్దు చేస్తూ పార్టీ ప్రాంతీయ కమిటీలలో ఆసక్తి ఉన్న వారు చేరి పనిచేయాలని కూడా పార్టీ సూచించింది. నాజర్ మకాం మళ్లీ పొన్నెకల్లుకు చేరింది. చుట్టుపక్కల ఉన్న పల్లెల్లో కూలి, పాలేళ్లు, రైతు, వైజ్ఞానిక సంఘాలను ఏర్పాటు చేయడంలో నాజర్ కీలక పాత్ర పోషించారు. పొన్నెకల్లుకు సమీపంలోని గుడిపూడి, మోతడక, నిడుముక్కల, లేమల్లె, కర్లపూడి గ్రామాలలో యువజనులకు పాటలు, నాటకాలను నేర్పారు. పొగాకు వలుపు, బేరన్‌లలో కాల్పుడు పనులకు వెళుతూ అక్కడ కూలీనాలీ జనాల బాధలను స్వయంగా చూచి స్పందించి ఆశువుగా పాటలు వ్రాసేవారు.

తాడికొండ పోలీసులపై రాళ్లు వేశారని నాజర్‌పై నేరం మోపి అరెస్టు చేసి పదిహేను రోజులు రిమాండ్ విధించారు. తుళ్లూరు భూస్వామిపై దాడి హత్య, కేసులో నాజర్‌ను ముద్దాయిగా చేర్చడంతో అజ్ఞాతవాసానికి వెళ్ళిపోయాడు. నిడుముక్కల,

మోతడక కొండలలో రహస్యంగా తలదాచుకొన్నాడు. ఈలోగా నాజర్ ఇంటిపై పోలీసులు దాడిచేసి చిందరవందర చేశారు. స్టేషన్‌కు వచ్చి లొంగిపోకపోతే కుక్కను కాల్చినట్లు కాల్చివేస్తాం అంటూ బెదిరించి ఆడవాళ్లను భయపెట్టారు. నాజర్‌ను పట్టించినవారికి నగదు బహుమతిని ఇస్తామని పోలీసు శాఖ ప్రకటించింది. దీనితో మోతడక కొండ గుహలకు మకాం మార్చాడు. గొడ్డకాడి బుడ్డోళ్లు తట్టల్లో తెచ్చుకునే అన్నం తినేవాడు. పిల్లలతో కాగితాలు, పెన్సిళ్లు తెప్పించుకొని పాటలు వ్రాసి వాళ్లతోనే గ్రామాలలో ఉన్న పార్టీ సభ్యులకు చేరవేసేవాడు. నాజర్ మోతడక పరిసర ప్రాంతాలలో ఉన్నట్లు వార్త తెలియడంతో ఒకవైపు పోలీసులు, మరొక వైపు కాంగ్రెస్ వాలంటీర్లు వేట మొదలు పెట్టారు. అర్ధరాత్రి కొండలను దాటుకొంటూ గారపాడులోని బంధువుల ఇంటికి చేరాడు. ఒకరోజు అర్ధరాత్రి కాంగ్రెస్ వాలంటీర్లు ఆ ఇంటిపై దాడి చేయటంతో నాజర్ తృటిలో తప్పించుకొని రామకోటి స్వగ్రామమైన తుళ్లూరుకు చేరాడు. రామకోటిని తోడు తీసుకొని సత్తెనపల్లి తాటితోపుకు చేరాడు. అదే సమయంలో అచ్చంపేట పోలీస్‌స్టేషన్‌పై జరిగిన దాడిలో సబ్‌ఇన్స్‌పెక్టర్ భార్య మరణించటంతో మిలటరీ రంగప్రవేశం చేసింది. దేవులపల్లి వెంకటేశ్వరరావుతో కలసి తిరిగి మోతడక కొండ గుహ వద్దకు చేరాడు. దేవులపల్లి తనదారిన తాను వెళ్లిపోయాడు. తాను గుహలో ఉన్న విషయాన్ని అన్నకు రహస్యంగా కబురు చేశాడు. నిన్ను పోలీసులు ఏమి చేయకుండా రామిరెడ్డితో మాట్లాడుతానని అన్న చెప్పాడు. నాజర్ గ్రామంలోకి వెళ్లడంతో యస్.ఐ. అదుపులోనికి తీసుకొన్నాడు. మంగళగిరి నుండి వచ్చిన మిలటరీ వ్యానులో నాజర్‌ను తరలించారు. రాయనపూడి, అచ్చంపేట దాడిలో ఎవరెవరు పాల్గొన్నారో చెప్పమని పోలీసులు నాలుగు రోజులు చితకబాదారు. దళాల దాడులతో తనకు సంబంధం లేదని మొత్తుకొన్నా మిలటరీ పట్టించుకోలేదు. క్యాంపుకు వచ్చిన జిల్లా కలెక్టరు కళ్యాణరావుతో బుర్రకథలే నా జీవనాధారం అని మొరపెట్టుకొన్నాడు. క్యాంపులో ఉన్న కుర్ర పోలీసులు రాత్రి వేళల్లో నాజరు చేత పాటలు పాడించుకొనేవారు. క్రమంగా నాజర్‌ను కొట్టకుండా చూశారు. ఒకరోజు అర్ధరాత్రి నాజర్‌తో పాటు మరో ముగ్గుర్ని పోలీసులు వ్యానులో ఎక్కించారు. మంగళగిరి వద్ద రైలు గేటు పడటంతో వ్యాను ఆగిపోయింది. ఎదురుగా వచ్చిన మరొక ప్రభుత్వ కారును చూచిన పోలీసులు వారివద్దకు వెళ్ళి మాట్లాడి వచ్చారు. వ్యానులోకి వచ్చిన పోలీసులు మీ పెళ్లాల తాళ్లు గట్టివి.. బ్రతికిపోయారు అంటూ గుంటూరు సబ్‌జైలుకు తీసుకెళ్లారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తిరుగుబాటు దారులను

కాల్చిచంపడాన్ని నిషేధిస్తూ ఆ రోజు మధ్యాహ్నమే నిర్ణయం తీసుకోవడం వల్లనే మీరు బ్రతికి బట్టగట్టారని దారిలో పోలీసులు చెప్పారు. నెల రోజుల మంగళగిరి మిలటరీ క్యాంపు నిర్బంధం నుండి తిరిగి గుంటూరు సబ్‌జైలులో పదిహేను రోజుల రిమాండ్ విధించారు. బంధువులతో కలసి భార్య నాజర్‌ను చూడటానికి వచ్చింది.

నాజర్ జైలు నుండి విడుదలయ్యాక తెలంగాణ సాయుధ పోరాటం ముగిసింది. పార్టీలో కార్మిక, గ్రామీణ వ్యవసాయ కూలీ నాయకత్వ నిష్పత్తి తక్కువైనందున ప్రొలిటేరియన్ లీడర్‌షిప్‌ను పెంచాలని రాజేశ్వరరావు పేరుతో సర్క్యులర్ విడుదల అయింది. పార్టీ పునర్నిర్మాణం విధానం ఆ సర్క్యులర్‌కు పూర్తి విరుద్ధంగా ఆచరణలో కన్పించడంలో నాజర్ క్రమంగా పార్టీకి దూరమయ్యారు. కానీ పార్టీ సాహిత్యాన్ని మాత్రం విడిచిపెట్టకుండా చదివేవారు.

## సంసారంలో సరిగమలు

1942లో మేనమామ కూతురు ఖాశింబీతో నాజర్ వివాహం జరిగింది. పెళ్లి జరిగిన కొన్నాళ్లకు ఖాశింబీకి చిన్ననాటి జబ్బు తిరగబెట్టింది. ఆమె కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లా మారిపోయాయి. కళ్లకు వేడి తగలకూడదని, సంసార సుఖానికి దూరంగా ఉండాలని వైద్యులు చెప్పారు. విధిలేని పరిస్థితిలో నాజర్ ఆమెను గారపాడు పుట్టింట్లో వదిలి వచ్చాడు. నాజర్ రెండవ పెళ్లి చేసుకోవడానికి పార్టీ వారిని అభ్యర్థించారు. నీ భార్య అంగీకరిస్తే పార్టీ ఆధ్వర్యంలో పెళ్లి జరిపించగలమని పుచ్చలపల్లి సుందరయ్య చెప్పారు. ఈ విషయం చెబితే భార్య, అత్తమామలు సుతరామూ అంగీకరించలేదు. నాజర్ ఇంట్లో చెప్పకుండా గుంటూరు పట్టణం కొరిటపాడుకు చెందిన విడాకులు తీసుకొన్న యువతిని రహస్యంగా పెళ్లి చేసుకొన్నాడు. పొన్నెకల్లులో నాజర్ దంపతులు కూలీ, నాలీ పనులు చేసుకొంటూ బ్రతుకును భారంగా గడుపుతున్న రోజుల్లో అత్యంత నాటకీయమైన సంఘటన జరిగింది. తాడికొండ పోలీస్‌స్టేషన్ పై మారణాయుధాలతో దాడికి వచ్చారనే అభియోగంతో నాజర్‌ను పదిహేను రోజుల రిమాండ్‌కు పంపారు. తరువాత కోర్టుల చుట్టూ తిరుగుతూ రహస్యంగా ఉంటున్న సమయంలో నాజర్ భార్య నిండు గర్భవతి. నేలబావిలో నీళ్లు తోడుతూ తాగాడి పైనుండి కాలుజారటంతో బావిలో పడిపోయింది. ఆ ప్రమాదంలో తీవ్ర గాయాలు పాలైన ఆమెను గుంటూరు ఆసుపత్రికి తరలించారు. అక్కడ నుండి ఆమె అన్న కొరిటపాడులోని తన ఇంటికి తీసుకొని



**నాజర్ సతీమణి ఆదంబీ**

వెళ్లాడు. ఈ విషయం తెలిసిన నాజర్ అర్ధరాత్రి రహస్యంగా బావమరిది యింటికి వెళ్లి భార్య దుస్థితిని చూచి బావురుమని ఏడ్చాడు. అత్తవారింటికి సమీపంలో ఉన్న నారింజ తోటల్లో పగలు రహస్యంగా ఉంటూ రాత్రి కాగానే భార్యకు సపర్యలు చేసేవాడు. కానీ ఆమె కన్ను మూసింది. మిత్రుల సహాయంతో ఆమెకు అంత్యక్రియలు నిర్వహించాడు.

ఒంటరి తనంతో పుట్టెడు దిగులుతో పొన్నెకల్లులో ఉంటున్న నాజర్‌ను ఇంటి పేరు లేకుండా పోతుందని తల్లి పోరుతూ ఉండేది. మళ్లీ పెళ్లి చేసుకోకూడదని మనసులో నాజర్ నిర్ణయం తీసుకొన్నాడు. గారపాడులో ఉన్న మేనమామ కూతురు ఆదంబీ పెళ్లికి ఎదిగిందనే కబురు వచ్చింది. అమ్మ, పెంచినమ్మల పోరు పడలేక గారపాడు వెళ్లాడు. మొదట పిల్లను ఇచ్చేది లేదని మేనమామ కసిరి కొట్టాడు. పదిమంది నచ్చచెప్పినా వినలేదు. ఈలోగా నాజర్ పెంచినమ్మ కూడా వచ్చి తమ్ముణ్ణి బ్రతిమిలాడింది. ఆయన అంగీకరించాడు. మొదటి భార్య ఖాశింబిని కూడా తీసుకొని వెళ్ళి ఆమె పోషణ బాధ్యతను కూడా స్వీకరిస్తానని మేనమామతో చెప్పాడు. 1942లో మొదటి పెళ్లి, 1946లో రెండవ పెళ్లి జరిగింది. 1948లో ముప్పావలా ఖర్చుతో నాజర్ మూడవ

పెళ్లి జరిగింది. సరిగ్గా పెళ్లి జరిగిన పదమూడవ రోజున తుళ్లూరు భూస్వామి హత్య జరిగింది. పోలీసులు నాజర్ కోసం వేట ప్రారంభించటంతో తిరిగి అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు. నాజర్‌ను మంగళగిరి క్యాంపు నుండి గుంటూరు సబ్‌జైలుకు మార్చారు. జైలులో ఉన్న నాజర్‌ను చూడడానికి బంధువులతో వచ్చిన భార్య ఆదంబీ కటకటాల ఊసలు పట్టుకొని "నిన్ను విడిచి పెడతారంటగా" అని చిన్నగా పలికింది. పెళ్లి జరిగిన తరువాత ఆదంబీ అత్తవారింటికి వెళుతుంటే ఇంట్లో వారందరూ వెక్కివెక్కి ఏడ్చారు. కానీ ఆదంబీ మాత్రం మౌనంగా ఉంది. అందుకే చనిపోయే వరకు భార్యతో **"ఏడవకుండా కాపురానికి వచ్చావే.. ఆదంబీ అదే నాకు జయం"** అని నాజర్ అనేవాడు.

ఆదంబీతో పాటు మొదటి భార్య ఖాశింబీని కూడా నాజర్ పొన్నెకల్లు తీసుకువచ్చాడు. కొంతకాలానికి నివాసాన్ని గుంటూరుకు మార్చాడు. కానీ మొదటి భార్య ఖాశింబీ పొన్నెకల్లులో ఉన్న కొద్దిపాటి పొలంలో వ్యవసాయం చేసుకుంటూ అక్కడే ఉండేది. ఎప్పుడైనా డబ్బు కావాలంటే మాత్రం గుంటూరుకు వచ్చేది. చెల్లెలు పిల్లల్ని ఖాశింబీ కడుపున పుట్టిన పిల్లల్లా సాకింది. తరువాత ఆమెకూడా గుంటూరుకు వచ్చింది. అక్కచెల్లెళ్లు ఎప్పుడైనా గిల్లికజ్జాలు పెట్టుకుంటే మాత్రం నాజర్ కర్ర తీసుకొని గుడ్లు ఉరిమేవాడు. నాజర్ అనారోగ్యంతో ఉన్నప్పుడు మలమూత్రాలతో ఉన్న బట్టలను ఖాశింబి శుభ్రం చేసేది. వంతలు ఒకరి తరువాత ఒకరు వెళ్లిపోతుంటే చిన్న భార్య ఆదంబీకి తర్ఫీదు ఇచ్చి ఒక వంతగా ప్రదర్శనలిచ్చాడు.

## సంతాన సౌభాగ్యం

నాజర్‌కు ఏడుగురు సంతానం. ఐదుగురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. అలీనా, శివాజీ బేగం, బంగారుపాప, బాబీ, సితారా బేగం కుమార్తెలు కాగా షేక్ సయ్యద్ సాయిబాబు, షేక్ బాబూజీ కుమారులు. పెద్దల్లుడు షేక్ కబీర్. నన్ను నాజర్ గారి అల్లుడంటే చాలు అంటూ పైసా కట్నం లేకుండా అలీనాను వివాహమాడాడు. రెండవ అల్లుడు బాపూజీ న్యాయవాది. బంగారుపాప, బాబీని దగ్గర బంధువులకే ఇచ్చి వివాహం చేశాడు. సితారా బేగం భర్త పేరు నబీ. పెద్ద కోడలు సైరాబాను, రెండవ కోడలు బాజి. నాజర్ ఇంటి విషయాలు మీద ఏమాత్రం ఆసక్తి చూపేవాడు కాదు. కథచెప్పి ఇంటికి రాగానే జేబులో ఉన్న డబ్బును భార్య ఆదంబీకి ఇచ్చేవాడు. ఆమె



**పద్మశ్రీ నాజర్ తాను అందుకున్న బహుమతులతో...**

పిల్లల ఆలనాపాలనా చూసేది. నాజర్ దూదేకుల కులానికి చెందినవాడు. మహమ్మదీయ పండుగలతో పాటు హిందువుల పండుగలైన వినాయకచవితి, కార్తీక పౌర్ణమి వంటి పండుగలను కూడా నియమ నిష్ఠలతో జరుపుకొనే వారు.

## సన్మానశ్రీ గంధాలు

వీరరక్తపు ధార పోసిన అలనాటి రాజుల శౌర్య పరాక్రమాలను జనం గుండె చప్పుళ్లల్లో కలిపి జనం భాషలో పల్లీయులకు వినిపించిన బుర్రకథలు ఆ ప్రజలకు ఒక ఊపును, ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని నింపాయి. బుర్రకథలు విన్న జనమంతా నాజర్‌కు జయహోలు పలికారు. బొబ్బిలి కోటలో బుర్రకథను చెప్పిన సందర్భంలో పెట్టెల నరసింహారావు బంగారు సింహ తలాటాన్ని బహూకరించారు. కిర్లంపూడి రాజావారు

తుని మహారాజు వెండి కప్పులను బహూకరించారు. కాకినాడ పురప్రముఖులు సింహ తలాటాన్ని సమర్పించగా భీమవరంలో గన్నాబత్తుల రంగారాయ సోదరులు కనకాభిషేకంతో పాటు గండపెండేరాన్ని బహూకరించారు. ఈ వేడుకకు స్థానికంగా ఉన్న ఒక మంత్రి వర్యుని ముఖ్య అతిథిగా ఆహ్వానించారు. కమ్యూనిస్టు నాజర్ సభకు వెళ్లి మనం సన్మానించటం ఏమిటిని ప్రశ్నించారట. కళకు కులాలు, పార్టీలు ఉండవు. అంతరించి పోతున్న జానపద కళారూపమైన బుర్ర కథకు ప్రాణం పోసి పదికాలాలు బ్రతికించేలా చేసిన ఆ మహా కళాకారునికి సన్మానం చేసే అదృష్టం మనకు లభించటం గర్వకారణమని స్థానిక వదాన్యులు, కళా పోషకులు జవ్వాజి శ్రీరంగనాయకులు మంత్రి గారికి వివరించారు. కాకినాడ పట్టణంలో పూలరథానికి 70 జతల ఎడ్లు కట్టి కళాకారులు పుర వీధులలో ఘనంగా ఊరేగించారు. గండపెండేరాన్ని తొడగవలసింది చేతికా? కాలికా? అనే చర్చ జరుగుతున్న నేపథ్యంలో ఆ సభకు వచ్చిన సంగీత విరాట్ మహావాది వెంకటప్పయ్యశాస్త్రి, మృదంగ విద్వాంసులు రామానుజం నాజర్‌ను పక్కకు పిలిచారు. సాధారణంగా సభలో సన్మానితులు అర్హత లేకున్నా ఈ సన్మానం నాకు చేస్తున్నారని వినయంతో అంటారు. కానీ నీవు అలా చెప్పవద్దు. బుర్రకథ చెప్పడంలో నాకు నేనేసాటి. కాలు బల్లపై పెట్టి ఈ మాట చెప్పు అని సలహా ఇచ్చారు. నాజర్‌కు అదే పద్ధతిలో గండపెండేరం తొడిగారు. ఈ సందర్భంగా మల్లంపల్లి సోమశేఖరశర్మ, నిడదవోలు వెంకట్రావు, నార్ల వెంకటేశ్వరరావు, అయ్యల సోమయాజులు వంటి మహామహులు రచించిన వ్యాసాలతో ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. సుప్రసిద్ధ సినీ దర్శకులు తాతినేని ప్రకాశరావు తన గృహానికి ఆహ్వానించి వెండిపళ్లెంతోపాటు వెయ్యి నూట పదహార్లు నగదుతో సత్కరించారు. సినీ నటి, నిర్మాత లక్ష్మీరాజ్యం మద్రాసులో నాజర్ బుర్రకథను ఏర్పాటు చేసి ఆ సభలో సినీ గాయకులు ఘంటసాలను ముఖ్యఅతిథిగా ఆహ్వానించారు. నాజర్ కథను చెప్పిన తరువాత బుర్రకథ ఉద్ధరణకు పుట్టిన ఈ మహానుభావుని సంగీత జ్ఞానమంతా స్వంతంగా నేర్చుకొన్నది అని ప్రశంసించి వెయ్యినూట పదహార్లు నగదును బహూకరించారు. లాంఫారమ్, గుంటూరు, దుగ్గిరాల, విజయనగరం వంటి చోట్ల నాజర్‌కు ఘన సన్మానాలు జరిగాయి. ఢిల్లీ ఆంధ్ర సంఘం ఆహ్వానంపై ఢిల్లీలో పలుచోట్ల బుర్రకథలు చెప్పారు. కేంద్ర మంత్రులు, కె.యల్.రావు, కొత్త రఘురామయ్య వంటి వారిచే ఘన సన్మానాలు



పూల రథంలో నాజర్‌ను ఊరేగిస్తున్న సన్నివేశం



నాజర్‌కు గండపెండేర ధారణ

పొందారు. బొంబాయి, అహ్మదాబాద్, కలకత్తా, టాటానగర్‌లో కూడా బుర్రకథలను చెప్పిన సందర్భంగా ఘన సన్మానాలు జరిగాయి. తంజావూరు, తిరుచునాపల్లిలో ఘన సత్కారాలు పొందాడు. ఆంధ్ర రాష్ట్ర అవతరణ సందర్భంగా రాష్ట్ర ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి నాజర్‌ను సన్మానించారు. ప్రపంచ తెలుగు మహాసభలలో నాజర్ కథకు అవకాశం లభించలేదు. సన్మానాన్ని స్వీకరించాలని ఆనాటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు ఆహ్వానించినా తిరస్కరించాడు. 1978లో రంగస్థల వృత్తి కళాకారుల మహాసభలో సినీనటి జమున ఆధ్వర్యంలో నాజర్‌కు సన్మానం జరిగింది. 1979లో ఆనాటి ముఖ్యమంత్రి మర్రి చెన్నారెడ్డి వెనుకబడిన తరగతుల మహాసభలో సన్మానించారు. 1981లో ఉగాది పురస్కారాన్ని స్వీకరించాలని రాష్ట్ర ముఖ్యమంత్రి టంగుటూరి అంజయ్య లేఖను వ్రాశారు. **పూజనీయ, బాధల నెరిగిన ముఖ్యమంత్రికి కళాభివందనాలు. మహాశయా! మొదటిసారి ప్రభుత్వం వేదిక మీదకు ఆహ్వానించి శ్రీకాసు ఆధ్వర్యంలో సన్మానించి ఓచిన్న కానుక ఇచ్చారు. అదే మొమెంటో అట. నేను లోనికి రాగానే పేరు రాసిస్తామని పట్టుకెళ్లారు. మళ్లీ ఇచ్చిన పాపాన పోలేదు. ఆ తరువాత జలగం చాటంత రేకిచ్చారు. అది తామ్ర పత్రమట. ఆ తరువాత మర్రి మారేడు చెక్క ఇచ్చారు. అది మొమెంటో అట. అయ్యా! దేశంలో కడుపు నిండకనే కీర్తి చాలా పోగైంది. నాకు అరవైఒక్క సంవత్సరాలు వచ్చినా ఇంకా నెలకు రెండు మూడు కథలు చెబితే తప్ప ఇల్లు గడవదు.**

**నాకు ఐదుగురు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు. కమ్యూనిస్టుగా రహస్య జీవితం అనుభవించి బైటపడిన తరువాత పుట్టారు. అందరూ తినేవాళ్లే. సంపాదించే వారు లేరు. ముగ్గురికి పెళ్లి చేశాను. సంవత్సరాది పండుగ రోజున గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారి సన్మాన సభ బళ్లారి సభలో జరగనుంది. అక్కడ కథ చెప్పేందుకు అంగీకరించి అడ్వాన్స్ తీసుకొన్నాను. తమకు తెలియనిది లేదు. నాజర్ కథంటే వేలాది మంది ప్రజలు వస్తారు. నేను కథలకు వెళ్లక పోతే నాకు, నా కథ పెట్టించిన వారికి శాపనార్థాలు తప్పవు. కనుక నాకు అవకాశం వచ్చినప్పుడు వస్తాను. నన్ను క్షమించండి.** అంటూ ఉత్తరం వ్రాశాడు. 1981లో సినీనటి జమున "గురువుగారు నేను ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమి అధ్యక్షురాలినయ్యాను. తమరు అకాడమీ సభ్యత్వం తీసుకొని తమ అమూల్యమైన అనుభవాలనందివ్వాలని కోరుతున్నాను." అంటూ లేఖ



**నాటక అకాడమీ సభలో పాల్గొన్న నాజర్**

వ్రాసింది. **అమ్మా నీ సిన్సియారిటీ మంచితనంతో నన్ను ఆహ్వానిస్తున్నావు. కానీ నాకు దానిమీద ఏ మాత్రం ఆసక్తి లేదు. నేను సభ్యత్వం తీసుకోను.** అంటూ నాజర్ తిరుగు ఉత్తరం వ్రాశాడు.

1981 మార్చి పదిహేడున సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీభాట్టం శ్రీరామమూర్తి "నాజర్ గారూ మిమ్మల్ని అకాడమీ సభ్యులుగా నేను సూచించాను. అందుకని మీరు సభలో పాల్గొనాలి." అని కోరారు. 1982లో కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షురాలు కమలాదేవి ఛటోపాధ్యాయ అతిథిగా పాల్గొన్న సభలో నాజర్‌ను ఘనంగా సన్మానించారు. 1983లో ముఖ్యమంత్రి అంజయ్య నెలకు 150 రూపాయలు వృద్ధాప్య జీవనభృతిని కల్పిస్తూ ఉత్తర్వులు జారీచేశారు. 1992లో దీనిని నిలిపివేశారు. సాంస్కృతిక శాఖ ఆధ్వర్యంలో గుంటూరు నాజర్ స్వగృహంలోనే ఆరు దళాలకు శిక్షణ ఇచ్చారు. ఈ సందర్భంగా ఆ దళాల వారి సాంస్కృతిక శాఖ ఆధ్వర్యంలో మైకుసెట్లు, దుస్తులను మంజూరు చేయించారు. డాక్టర్ చెలికాని స్టాలిన్ ఆధ్వర్యంలో రామచంద్రాపురంలో పీతాని వీరభద్రరావు ఆధ్వర్యంలో ఆర్యావటంలో, లాలుగు అప్పాజీ ఆధ్వర్యంలో రాజమండ్రిలో జరిగిన ఘన సన్మానాలు నాజర్ జీవితంలో చిరస్మరణీయమైనవి. 1986లో ఉపరాష్ట్రపతి శ్రీ. ఆర్. వెంకట్రామన్ చేతులమీదుగా కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారాన్ని అందుకొన్నారు. 1987లో నాటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావు వ్యక్తిగతంగా రూ. ఐదువేల నగదును ఇచ్చి సత్కరించారు. ఒంగోలులో

డాక్టర్ గరికపాటిరాజారావు పురస్కారాన్ని, గుంటూరు జిల్లా నాగభైరువారిపాలెం కాకతీయ కళాపరిషత్ ఆధ్వర్యంలో 'జాతిరత్న' పురస్కారాన్ని పొందాడు.

## ప్రజాకళకు పద్మశ్రీ పురస్కారం

1985లో ఒకరోజు గుంటూరు రెవిన్యూ డివిజనల్ అధికారి, పోలీసు అధికారులు నాజర్ ఇంటిని వెతుకుతూ వచ్చారు. నాజర్ హరిహరమహల్ సినిమాకు వెళ్లారని ఆదంబీ చెప్పింది. సినిమా పూర్తయ్యాక వస్తుంటే ఆర్.డి.ఓ. జవాను నాజర్‌ను జనంలో గుర్తించి అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నారని థియేటర్ ఆఫీసురూమ్ లోనికి తీసుకువెళ్లాడు. అక్కడ కూర్చొన్న జిల్లా కలెక్టర్ నాజర్ గారికి కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ పురస్కారం ఇవ్వడానికి నిర్ణయించిందని చెప్పారు. 1986లో రిపబ్లిక్ డే రోజున భారత ప్రధాని రాజీవ్ గాంధీ, కేంద్ర మంత్రి పి.వి.నరసింహారావు సమక్షంలో రాష్ట్రపతి భవన్‌లో రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్ పద్మశ్రీ పురస్కారాన్ని బహూకరించారు. పద్మశ్రీ పురస్కారం లభించిన సమయంలో వావిలాల గోపాలకృష్ణయ్య నాజర్‌ను అభినందించారు. "ఇది మీ నలభై సంవత్సరాల అమూల్య ఆశీర్వచన ఫలితము. మీరిచ్చిన రాజకీయ పరిజ్ఞానానికి గుర్తుగా భావిస్తున్నాను. నా రాజకీయ గురువులలో ఒకరైన మీ ఆశీర్వచనం నాకు ఆనందాన్ని కలిగించిందని" నాజర్ వినమ్రంగా పలికారు. పద్మశ్రీ పురస్కారాన్ని అందుకోవడానికి ఢిల్లీకి నాజర్ కుటుంబ సభ్యులతో పాటు వంతలు పదమూడుమంది వెళ్లారు. నాజర్ భార్యా బిడ్డలకు మాత్రమే వసతి ఏర్పాటు చేశారు. మిగిలిన వారు ఎక్కడ ఉండాలో తెలియని స్థితిలో నాజర్ ఢిల్లీ నుండి ముఖ్యమంత్రి యన్.టి.రామారావు గారికి ఫోన్ చేసి పరిస్థితిని వివరించారు. యన్.టి.ఆర్. ప్రత్యేక శ్రద్ధ తీసుకొని మిగతావారికి కూడా వసతి ఏర్పాట్లు చేయించారు.

## కళారవి అస్తమయం

హైదరాబాద్ ప్రజానాట్యమండలి సభలో, తదుపరి నిజాం కళాశాల ఆడిటోరియంలో కథలు చెప్పి గుంటూరు చేరిన నాజర్ అస్వస్థతకు గురయ్యారు. మూత్ర విసర్జన నిలిచి పోవడంతో గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో పరీక్షలు చేయించుకొన్నాడు. ఆపరేషన్‌కు రూ. ముప్పై వేలు అవుతుందని చెప్పారు. నాజర్ గారి కుటుంబ వైద్యులు డాక్టర్ కాసరనేని సదాశివరావు. శాసనసభ్యులుగా ఉన్న






शेक नाज़र

मैं, भारत का राष्ट्रपति, जैल सिंह, व्यक्तिगत गुणों के लिए, आपके सम्मानार्थ, पद्म श्री प्रदान करता हूं।

नई दिल्ली

राष्ट्रपति

**1986లో భారత రాష్ట్రపతి శ్రీ జ్ఞానీ జైల్‌సింగ్ నుంచి పద్మశ్రీ పురస్కారాన్ని అందుకున్న నాజర్. చిత్రంలో అప్పటి భారత ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధి, కేంద్ర మంత్రి శ్రీ పి.వి. నరసింహారావు ప్రభృతులు ఆశీనులై వున్నారు.**

---

సదాశివరావు వద్దకు వెళ్లి నాజర్ జరిగిన విషయాన్ని చెప్పారు. అంత డబ్బు నీదగ్గర ఎక్కడుందయ్యా అంటూ డాక్టర్ గారు నవ్వారు. నాలుగు రోజుల్లో అసెంబ్లీ సమావేశాలు ముగిసిన తరువాత నేను ఆపరేషన్ చేస్తానని భరోసా యిచ్చారు. 1986 డిసెంబర్

పన్నెండున ఆపరేషన్ జరిగింది. రెండు నెలలు డాక్టర్ గారి ఆసుపత్రిలోనే ఉండి తిరిగి ఇంటికి వచ్చారు. తిరిగి చలిజ్వరం రావడంతో డాక్టర్ గారి దగ్గరికే వెళ్లారు. మరో నెల రోజులు హాస్పటల్‌లోనే ఉండి ఇంటికి రాబోతూ డాక్టర్ గారిని కలిశారు. డాక్టర్ గారు బిల్లు వేయలేదు. అయినా ఐదు వందలు టేబుల్ మీద పెడితే ఎందుకది మిమ్మల్ని డబ్బులు ఎవరు అడిగారు. అంటూ డాక్టర్ గారు మందలించారు. ఇది మీ ఫీజుకాదు మంచానికి అద్దె అంటూ నాజర్ ఆగకుండా వెనుదిరిగారు.

1997 ఫిబ్రవరి 11న అస్వస్థతకు గురయ్యారు. అప్పటికే తాను వ్రాసిన జాతిజీవిత-కళాపరిణామం అనే పుస్తకం ముద్రణలో భాగంగా ప్రూఫులను చూస్తున్నారు. అంత అనారోగ్యంలో కూడా మంచంలో ఉండి కళ్లు కనిపించకపోయినా తప్పులను దిద్దేవారు. ఆ పుస్తకంలోని బొమ్మలను నాజర్ చిన్న కుమారుడు బాబూజీ వేశారు. ఫిబ్రవరీ ఇరవయ్యవ తేదీ మధ్యాహ్నం పన్నెండు గంటలకు మంచంలోనే కూర్చొని ప్రూఫులను ఏకబిగిన రాత్రి ఏడు గంటల వరకు దిద్దారు. తప్పులను ఎవరైనా దిద్దారా అని భార్య ప్రశ్నిస్తే నా పుస్తకంలో తప్పులు, ఒప్పులు నాకే బాగా తెలుస్తాయని కసిరారు. ఆ రోజు ఆయన బాగా అలసిపోయారు. ఇరవైఒకటవ తేదీ ఉదయం ఫిట్స్ వచ్చాయి. అదేరోజు జానపద కళలకు పట్టం కట్టి ప్రజాకళను అక్షరజ్ఞానం లేని వారి నాలుకల మీద కూడా లాస్యం చేయించిన తంబూరా తీగ తెగిపోయింది. గుమ్మెటుల నాదం అనంత వాయువుల్లో కలసిపోయింది. ఒక తరాన్ని ఊపేసిన నాజర్ గళం మూగబోయింది.

## ఆగిపోని పాట - మోగుతున్న తంబుర

నాజర్ కళా ప్రస్థానాన్ని ఆయన కుమారులైన షేక్ సయ్యద్ సాయిబాబా, షేక్ బాబూజీ కొనసాగిస్తున్నారు. నాజర్ కుమార్తెలు అలీనా, శివాజీ బేగం, బంగారుపాప, బాబీ, సితారాలు కూడా గాయనీమణులు కావడం గమనార్హం. చిన్న కుమారుడైన బాబూజీ పెళ్లి చూపులకు వెళ్లిన సమయంలో బాజీమా సంగీతాన్ని విన్న తరువాత నాజర్ మారుమాట లేకుండా తన కుమారునికి చేసుకోవడానికి అంగీకరించారు. బాబూజీ పిల్లలు నాజర్‌బాబు, సాజన్‌బాబు, అహనాద్‌బీ కూడా చిన్నతనం నుండి సంగీతాన్ని అభ్యసించారు. నాజర్ కుటుంబంలో గానకళ శాఖోప శాఖలుగా విస్తరించింది.





కదం తొక్కుతూ, పదం పాడుతూ శ్రోతలను అలరిస్తున్న దృశ్యాలు

# షేక్ సయ్యద్ సాయిబాబు

నాజర్ పెద్దకుమారుడైన సయ్యద్ సాయిబాబా బుర్రకథ, నాటక, గాన కళలలో విద్వాంసునిగా పేరు పొందాడు. కోట్ల విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో సినీ నటుడు నాగభూషణం పర్యవేక్షణలో కాంగ్రెస్ పార్టీ ఆశయాలను ప్రచారం చేయడానికి **కుమ్మరిమొల్ల** అనే బుర్రకథను రచించి పలు దళాలకు శిక్షణ నిచ్చాడు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో విద్యార్థులతో కలసి బుర్రకథలను చెప్పి ప్రశంసలు పొందాడు. 1972 అమృత ఫిలిమ్స్ సంస్థ చెల్లెలికాపురం చిత్రంలోని "చరణ కింకిణులు ఘల్లుఘల్లు మన" అనే పాటకు రాష్ట్రస్థాయిలో నిర్వహించిన పాటల పోటీలలో సాయిబాబు ప్రథమ బహుమతిని పొందాడు. సమాచార పౌరసంబంధాల శాఖ ద్వారా సోదరుడైన బాబూజీతో కలసి వందలాది బుర్రకథలను చెప్పాడు. సుప్రసిద్ధ రంగస్థల నటి, గాయని యం.ఆర్.తిలకం నాటక సమాజం ద్వారా 'తారాశశాంకం' నాటకంలో చంద్రుని పాత్రను పోషించాడు. సత్యహరిశ్చంద్ర, చింతామణి, బాలనాగమ్మ నాటకాలలో పలుపాత్రలను పోషించాడు. ఎయిడ్స్ వ్యాధి వ్యతిరేక ప్రచారోద్యమంలో భాగంగా సాంఘీక, పౌరాణికితివృత్తాలు కలగలపి రచించిన అమృతం మాకొద్దు అనే నాటకంలో యమధర్మరాజు, సామాన్యుడు పాత్రలను పోషించాడు. పలుపాఠశాలలో సంగీత ఉపాధ్యాయునిగా విద్యార్థులకు వందలాది పాటలను నేర్పించాడు. ప్రస్తుతం అర్కెస్ట్రాలో కీబోర్డును వాయిస్తూ పాటలు పాడుతున్నాడు.

# షేక్ బాబూజీ

నాజర్ రెండవ కుమారుడైన బాబూజీ 1982లో ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ తన తండ్రి ఆధ్వర్యంలో నిర్వహించిన రాష్ట్రస్థాయి బుర్రకథ శిక్షణా శిబిరంలో శిక్షణ పొందారు. 1989లో ప్రకాశం జిల్లాలో నెదర్లాండ్స్ ప్రాజెక్ట్ ప్రచారం కోసం వందలాది బుర్రకథ ప్రదర్శనలిచ్చాడు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో జానపద కళాకారునిగా ఎంపికయ్యాడు. 1994లో కేంద్ర ప్రభుత్వ సాంగ్ అండ్ డ్రామా విభాగం కళాకారునిగా నియమితులయ్యారు. కోట్ల విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో కవయిత్రి మొల్ల కథతో పాటు కాంగ్రెస్ పార్టీ విధానాల ప్రచారాంశాన్ని బుర్రకథగా మలచి రాష్ట్రస్థాయిలో అన్ని జిల్లా దళాలకు శిక్షణ నిచ్చాడు. 1995 లో నాటి ముఖ్యమంత్రి యన్.టి.రామారావు జీవిత విశేషాలను బుర్రకథగా తయారు చేసి ప్రదర్శనలిచ్చాడు.

పల్నాటియుద్ధం, వీరాభిమన్యు బుర్రకథలను ఆడియో క్యాసెట్లను తన స్వీయ గానంతో రికార్డు చేశాడు. 2000 సంవత్సరంలో తనతండ్రి శిష్యురాలైన జమున ఆధ్వర్యంలో నాజర్ బుర్రకథ విద్యాలయాన్ని గుంటూరులో స్థాపించాడు. 2001లో గుంటూరు విశ్వశాంతి అకాడమీ వారిచే యక్షగాన విశారద బిరుదును పొందాడు. 'స్వర్ణ సంరక్షణ' అనే పౌరాణిక నాటకాన్ని, **ధర్మ ప్రబోధిని** అనే చారిత్రక నాటకాన్ని, **దీర్ఘాయుష్మాన్‌భవ, సంస్కృతి మరిస్తే, మ్యూజిక్ పార్క్, విశ్వామిత్ర** వంటి సాంఘిక నాటికలను రచించారు. తన తండ్రి దళంలో రాజకీయ వంతగా ఐదు సంవత్సరాలు కథలు చెప్పారు. తండ్రి రచించిన జాతి జీవితం - కళా పరిణామం అనే గ్రంథానికి అరవైకి పైగా చిత్రాలను గీశారు. కళా విలువలు, కళారూప నిర్మాణం, కళా ధర్మాలను గురించి తండ్రి శిష్యరికంలో ఎంతో నేర్చుకొన్నారు. పదవతరగతి పరీక్షల కోసం అర్ధరాత్రి వరకు చదువుతున్న తనతో **"చదువేదైనా ఒక గమ్యానికి చెందినదై ఉండాలి. కానీ ఈ పెట్టుబడి విధానంలో ఉన్న ఈ చదువులపై అంత శ్రద్ధ అనవసరం.ప్రస్తుత విద్య మనిషి మెదడును కరుడుగట్టిస్తుంది. అధికార మనస్తత్వాన్ని పోత పోస్తుంది."** అని తండ్రి చెప్పిన మాటలు బాల్యంలో తనకు అర్థం కాక పోయినా వర్తమానంలో పూర్తిగా బోధపడిందని బాబ్జీ చెబుతారు.

**అక్షరభారతి, సుఖజీవనం, సంజీవని, మధురక్షణం, రేపటి సూర్యులు, తొలిపొద్దు, నీరేజీవాధారం, మేలుకొలుపు, క్రాంతికిరణం, దూబగుంట సమరం, స్వరాజ్య సమరం, ఛత్రపతి శివాజీ, కన్నెగంటి హనుమంతు, వీరాధివీర కాటమరాజు** వంటి బుర్రకథలను రచించి రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శనలిచ్చారు. వీనిలో ఎక్కువభాగం ఆకాశవాణి ద్వారా ప్రసారమయ్యాయి. ఇప్పటి వరకూ రాష్ట్రంలోని పలు ప్రాంతాలతో పాటు ఢిల్లీ, కలకత్తా వంటి రాష్ట్రేతర ప్రాంతాలలో రెండు వేలకు పైగా బుర్రకథలను చెప్పారు. కళను మనం బ్రతికిస్తే కళ మనలను బ్రతికిస్తుంది. ఏ కళలోనైనా జీవితం ఉంటే ఆ కళ కలకాలం బ్రతుకుతుంది. కళ ద్వారా నిజాన్ని, సత్యాన్ని నిర్భయంగా చెప్పగలిగినప్పుడు కళాకారుడు ప్రజల గౌరవాన్ని పొందగలుగుతాడనీ తండ్రి ఆశయాలే తనకు ఆచరణ మార్గాన్ని నిర్దేశించాయని బాబ్జీ అభిభాషణం. ఔత్సాహిక రచయితలు రచించిన బుర్రకథలను నాజర్ బుర్రకథ విద్యాలయం ద్వారా ఉచితంగా ముద్రించి సహకరిస్తున్నారు.

# 2

## ఝుంఝా మారుత ప్రభంజనం

# షేక్ నాజర్ బుర్రకథ ప్రస్థానం

హరికథ అనగానే ఆదిభట్ల నారాయణ దాసు, జముకుల కథ అనగానే సుబ్బారావు పాణిగ్రాహి, బుర్రకథ అనగానే షేక్ నాజర్ గుర్తుకు వస్తారు. ఎన్నుకొన్న ప్రక్రియకు ప్రాణ ప్రతిష్ఠ చేసి అనుభవసారాన్ని రంగరించి.. జనం గాథలను.. బాధలను గుండెలు కదిలించేలా.. ఆడి.. పాడిన నాజర్ బుర్రకథా పితామహునిగా ప్రజల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయారు. పల్లెపట్టులోని కష్టజీవులు ఆదరించి పెంచి పోషించిన పదహారణాల ప్రజా కళగా బుర్రకథను మామూలు మనుషుల మనసులకు హత్తుకునేలా సంధించారు. జనజాగృతం చేసే శక్తి ఉన్న బుర్రకథలో నవరసాలను మిళితం చేసి ప్రేక్షకులను ఉర్రూతలూగించారు. పురాణ కథలు, రాజవంశ కథలు రాజ్యమేలుతున్న రోజుల్లో మధ్య తరగతి, అట్టడుగు ప్రజల కష్ట సుఖాలను హృద్యంగా వినిపించారు. సమకాలీన జీవన విధానాలను, సమస్యల మూలస్వరూపాలను ధ్వనిస్తూ సామాజిక చేతనను అడుగడుగునా ప్రతిబింబించాడు. ప్రజా కళల అర్థాన్నీ, పరమార్థాన్నీ ఆచరణలో నిరూపించి బుర్రకథను శక్తివంతమైన ఆయుధంగా చేశాడు. బుర్రకథా గానానికి, అభినయానికి తరతరాల చిరునామాగా నిలిచిన నాజర్ ఆ కథ ఉన్నంత కాలం అజరామరుడు. బుర్రకథ ప్రక్రియకు జనాన్నీ.. జీవాన్నీ.. అర్థాన్నీ.. పరమార్థాన్నీ కలిగించిన నాజర్ బుర్రకథా వైభవాన్ని సందర్శించ బోయేముందు జానపద శిల్ప కళా సంపదలో సంగీతం, నాట్యం, అభినయం సమ్మిళతమైన బుర్రకథ పుట్టు పూర్వోత్తరాలను అవగతం చేసుకోవడం ఆవశ్యకం.



**బుర్రకథ పితామహ పద్మశ్రీ షేక్ నాజర్**

బుర్రకథ అనే పేరు వింటేనే శరీరం పులకరించి పోతుంది. నెత్తురు ఉడుకెత్తుతుంది. ముగ్గురు కథకులు మూడు గంటల సుదీర్ఘ కాలం ఏకబిగిన ప్రేక్షకులను ఉర్రూత లూగిస్తారు. తెలుగు జనుల జీవితాలలో ఒక అంతర్భాగంగా మమేకమైపోయిన అద్భుత ప్రక్రియ నాటకం. అది సర్వ కళల సమాహారరూపం, బుర్రకథ సంగీతం, నృత్యం, అభినయాలతో కూడిన రూపకం, మనోతంత్రులను మీటే ఆహ్లాదకరమైన సంగీతం, కంటికి ఇంపైన నృత్యం, అభినయం, మనసును మురిపించే చమత్కారం. అడుగడుగునా నిండి ఉన్న బుర్రకథ పామరులనే కాకుండా పండితులను కూడా రంజింప చేస్తుంది. వినోదం.. సందేశాల జోడు గుర్రాలపై నడిచే బుర్రకథ శతాబ్దాల కాలం నుండీ క్రమపరిణామం పొంది ఆధునికతను సంతరించుకొని ఒక పరిపూర్ణ

కళారూపంగా అవతరించింది. కథకుడు చేతియందు సొర బుర్రతోనో, గుమ్మడి బుర్రతోనో చేసిన తంబూరాను, శారద వంటి వాద్యములను ధరించి వాని ధ్వనుల నేపథ్యంలో మేళవించిన గానముతో కథలను పాడుటచే వీటికి బుర్రకథలు అనే పేరు వచ్చింది. బుర్రకథలనే పేరు సర్కారు ప్రాంతాలలో ఎక్కువగా వాడుకలో ఉంది.

శతాబ్దాలకు పూర్వం జంగం కథలు విశేష ప్రచారంలో ఉన్నాయి. జంగం శబ్దం కుల సంబంధి కాదు. బసవేశ్వరుడు స్థాపించిన వీరశైవ మతానుయాయులను జంగాలు అని పిలుస్తారు. వీరశైవ మతప్రచారానికి వీరు శివభక్తుల కథలను వినిపించేవారు. జంగాలు చెప్పే కథలు గనుక జంగం కథలుగా ప్రసిద్ధి చెందాయి. ఆ జంగాలను వారు వినియోగించే బుడిగెను ఆధారంగా చేసుకొని బుడిగె జంగాలని అంటారు. ప్రాంతాలను బట్టి బుర్రకథ, జంగం కథ, తందాన కథ, తంబూర కథ అని పిలుస్తున్నారు. బుర్రకథ అత్యంత ప్రాచీన కళారూపం. కానీ ప్రస్తుతం వ్యవహారంలో ఉన్న విధానం మాత్రం ఆధునికమైనది. **"పారశీక భాషలోని భళా పదానికి మరాఠీ భాషా పదం ఛాంగ్ చేరి ఛాంగుభళారే, ఛాంగు భలాగా మారిందని, భాయీ అనే పదానికి తెలుగులోని తమ్ముడా అనే పదాన్ని చేర్చి భాయిభళానోయ్ తమ్ముడా"** అని ప్రయోగిస్తున్నారని రాంభట్ల కృష్ణమూర్తి పేర్కొన్నారు. బుర్రకథ లక్షణాన్ని, స్వరూపాన్ని ఆచార్య నాయని కృష్ణకుమారి **"కథకుడు కాలికి గజ్జెకట్టి చేత వాద్యములు ధరించి వంత పాటగాండ్రు సహాయమున ఆవేశ పూరితుడై చాలనము, పద విన్యాసమున లయ బద్ధముగా ప్రజా సమూహము నెదుట గానము చేయును"** అని వివరించారు. యక్షగానాల పరిణత రూపమే బుర్రకథ అని నాజర్, శ్రీనివాస చక్రవర్తి, నదీరా అభిప్రాయపడ్డారు. సంప్రదాయ వీరగాధలకు అనుకరణ రూపమే బుర్రకథ అని ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు అభిప్రాయపడ్డారు.

1942 ఆగష్టు విప్లవం స్వాతంత్ర్య సమరచరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించింది. ప్రజలను ఉద్యమంలో అంతర్భాగం చేయవలసిన ఆవశ్యకత కూడా ఏర్పడింది. ఫలితంగా జంగం కథ బుర్రకథగా అవతారమెత్తింది. బొబ్బిలి వరుస కథలో కీర్తనలు, దరువులు, పద్యాలు ప్రవేశించి జంగం కథ ఏర్పడగా, జంగం కథలో రాజకీయ ప్రబోధం ప్రవేశించి బుర్రకథగా రూపాంతరం చెందింది. జంగం కథలలాగానే బుర్రకథలు కూడా గుంటూరు మండలంలోనే ఆవిర్భవించాయి.

1929 ప్రాంతంలో దొడ్డవరపు వెంకటస్వామి, ధేనువకొండ వెంకయ్య రచించిన ఉత్తర గోగ్రహణం అనే జంగం కథను చెప్పేవాడు. దేవగాంధారి రాగాన్ని ప్రచారం చేసిన వెంకటస్వామి బుర్రకథ అవతరణకు స్ఫూర్తిగా నిలిచారు. 1942 ప్రాంతంలో గుంటూరు జిల్లా బాపట్ల ప్రాంతంలో కాకుమాను సుబ్బారావు జంగం కథను, బొబ్బిలి వరుస కథలను అనుసరిస్తూ బాబూరావు బుర్రకథను రచించారు. ఈ బుర్రకథను సుబ్బారావు స్వయంగా చెప్పేవారు. తెలుగులో వెలువడిన మొట్టమొదటి బుర్రకథ ఇదే. కృష్ణాజిల్లా దివి తాలూకాలో పెండ్యాల వెంకటేశ్వరరావు, పరుచూరి రామకోటయ్య దేశభక్తిని ప్రబోధిస్తూ యువజన సభల్లో బుర్రకథను చెప్పడం ప్రారంభించారు. సిరివిశెట్టి సుబ్బారావు కథకునిగా కోసూరి పున్నయ్య హాస్యం, గోవర్ధన్ రాజకీయ వంతలుగా బుర్రకథలను చెప్పేవారు. గుంటూరు జిల్లాలో దావులూరు గ్రామానికి చెందిన చింతల సూర్యనారాయణ, కాకుమాను సుబ్బారావు రష్యన్ వీరనారి టాన్యా, ఝాన్సీ లక్ష్మీబాయి వంటి వీరవనితల కథలను చెప్పేవారు. రెంటాల గుడ్డి జంగం వీరరసోద్రేకంగా కథలు చెప్పడంలో సాటిలేని మేటిగా పేరుపొందారు. 1944లో కొత్తపల్లి రంగారావు కూడా వీరనారి టాన్యా కథను బుర్రకథగా రచించారు.

1943లో ఫాసిస్ట్ వ్యతిరేక శిబిరం ఆధ్వర్యంలో రూపొందించిన జానపద కథారూపాలను బొంబాయి కమ్యూనిస్టు మహాసభల్లో ప్రదర్శించి బహుమతులను పొందారు. ఈ స్ఫూర్తితో కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరి పున్నయ్య వంటి వారు నాలుగు బుర్రకథ దళాలను తయారుచేశారు. కోగంటి, కోసూరి, సిరివిశెట్టి ఒక దళం, మిక్కిలినేని, మాచినేని, దావులూరి నారాయణ ఒక దళం, పెరుమాళ్లు, చదలవాడ కుటుంబరావు, తుమ్మల కేశవరావు ఒక దళం, పురుషోత్తం, వెంకటేశ్వరరావుతో దివితాలూకా బుర్రకథ దళాలు తయారయ్యాయి. గుంటూరు జిల్లాలో మోటూరి ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి లక్ష్మితో రూపొందించిన దళం టాన్యా కథలను హృద్యంగా చెప్పారు. కె.పి.రాజు (హైమా), కృష్ణదళం (రామచంద్రాపురం) షేక్ బాబూజీ (గుంటూరు), జంగం వెంకటేశ్వరరావు (గుంటూరు) వర్తమానంలో బుర్రకథకులుగా గుర్తింపును పొందారు.

1945 అక్టోబర్ పదిహేడున సుందర సత్యనారాయణ **రైతు విజయం** బుర్రకథను రచించారు. 1945 నవంబర్ ముప్పైన అబ్బరాజు శర్మ **స్వతంత్ర పోరాటం**

బుర్రకథను రచించి ప్రదర్శించారు. 1946లో బ్రాహ్మణ కోడూరు యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు **రైతు విజయం** అనే బుర్రకథను రచించి ప్రచురించారు. అట్లూరి అయోధ్య రామయ్య వరంగల్లులో **"హైదరాబాద్ సంస్థాన రాజ్యాంగ సంస్కరణలు"** అనే బుర్రకథను రచించారు. 1947లో వారణాసి సత్యనారాయణ **'నేతాజీ'**, 1948లో జంపన చంద్రశేఖరరావు **"నేతాజీ జీవిత చరిత్ర"**, బద్దిరెడ్డి కోటేశ్వరరావు **"నైజాం రజాకార్ల దురంతాలు"** అనే బుర్రకథలను రచించారు. ఇదే ఇతివృత్తంలో తిరునగరి రామాంజనేయులు **"తెలంగాణ వీరులు"** అనే బుర్రకథను రచించారు. వీరితోపాటు ద్వారం ప్రతాపరెడ్డి, మూర్తిశ్రీ, ఓగేటి శివరామకృష్ణశాస్త్రి, నేదునూరి గంగాధరం, లక్ష్మీకాంత మోహన్, నదీర ప్రభృతులు పలు బుర్రకథలను రచించారు.

నిడదవోలు అచ్యుతరామయ్య, విజయనగరంలో కుమ్మరి మాష్టారు, హైదరాబాద్‌లో బెనర్జీ, కడప కమ్మ సోదరులు, దళాలు బుర్ర కథకులుగా రాణించారు. కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి దళంలో కొండెపూడి రాధ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని, దళం సుంకర రచించిన అల్లూరి సీతారామరాజు బుర్రకథను రసవత్తరంగా చెప్పారు.

బుర్రకథలు ప్రబోధాత్మకాలు, రాజకీయ ఇతివృత్తాలు, ప్రచార కథలు, చారిత్రకాలు, పౌరాణికాలు, పతివ్రత కథలు మత ప్రబోధకాలుగా బుర్రకథలను వర్గీకరించవచ్చు. వారణాసి సత్యనారాయణ శాస్త్రి రచించిన **కట్నంలేని కమలమ్మ** పెళ్లి, సుంకర **కష్టజీవి**, చిన వెంకటరెడ్డి **లంచగొండులు**, బుర్రకథలు ప్రబోధాత్మక ఇతి వృత్తాలు. నేదునూరి గంగాధరం **చైనా దురాక్రమణ**, ద్వారంపూడి ప్రతాపరెడ్డి **బాపూజీ** రాజకీయ నేపథ్యాలు, శాంతిశ్రీ **ఇందిరాగాంధీ ఇరవై సూత్రాలు**, నదీర **హరిజన ప్రగతి** ప్రచార కథా నేపథ్యాలు, బూరెల సత్యనారాయణ రచించిన **అల్లూరి సీతారామరాజు**, దంటు కృష్ణమూర్తి **ఝాన్సీ లక్ష్మీబాయి**, చారిత్రకాలు, నదీర **రామాయణం, ఏసుకథలు**, దంటు కృష్ణమూర్తి **ఉత్తర గోగ్రహణం**, శాంతిశ్రీ **భగవద్గీత**, శాంతిశ్రీ **భాగవతం**, కేశవ తీర్థస్వామి **ప్రహ్లాద విజయం, శ్రీ ధ్రువ విజయం**, వాగ్దేవు శేషగిరిరావు **సత్యహరిశ్చంద్ర** కథలు పౌరాణిక వృత్తాలు. మూర్తిశ్రీ **బాలనాగమ్మ** పతివ్రత కథలు, నాగశ్రీ **శ్రీ శ్రీనివాస కళ్యాణం**, కోట్ల లింగమూర్తి **శ్రీ శివలీల**, ఎలీషా **క్రైస్తవ మతం**, పలుకూరి సత్యానందం **పది ఆజ్ఞలు**, జొన్నకూటి ప్రకాశం **యోహాను శిరచ్ఛేదము** మత సంబంధాలు.

ఐదు దశాబ్దాల సుదీర్ఘకాలం బుర్రకథ కళారూపానికి అర్థ తాత్పర్యాలు చెప్పి ఆ కళకు ఊరూరా బ్రహ్మరథం పట్టి బుర్రకథ సమ్రాట్‌గా కోట్లాది జనులచే జేజేలు అందుకొన్న షేక్ నాజర్ బుర్రకథ రచనా వైవిధ్యం, ప్రదర్శనా వైశిష్ట్యం అపూర్వం, వెయ్యి మైళ్ల ప్రయాణం ఒక్క అడుగుతోనే ప్రారంభం. ఒక పక్క నాటకాలు, మరో పక్క సంగీత సాధనలో తలమునకలై ఉన్నప్పుడు తుళ్లూరులో జరిగిన పాటల పోటీలలో విజేత కావడంతో అనూహ్యంగా బుర్రకథ వైపు నడక మళ్లింది. నాజర్‌లో అజ్ఞాతంగా దాగి ఉన్న కళా వైభవాన్ని గుర్తించిన కొండపల్లి బలరామ్, వేములపల్లి శ్రీకృష్ణ గుంటూరులోని పార్టీ కార్యాలయానికి తీసుకొనివచ్చారు. అక్కడ రామకోటితో పరిచయం నాజర్ జీవన ప్రస్థానంలో అద్భుతమైన మలుపునకు నాంది పలికింది. రామకోటి అనే పేరు వినగానే నాజర్ కథ విన్న వారు నాజర్‌తోపాటు గుర్తుంచుకొనే కళాకారుడు. ఆయన మాటల్లో హాస్యం, కదలికలో హాస్యం, మాట విరుపులో హాస్యం, చివరకు చూపులో కూడా హాస్యం భళ్లున బద్దలౌతుంది. నాజర్ బుర్రకథకునిగా రంగ ప్రవేశం చేసిన సమయంలో ప్రధాన కథకుడు రామకోటి నాజర్ హస్యవంతగాడు. తుళ్లూరులో ఆ కథ చెప్పినప్పుడు ప్రజలు బాగానే ఆనందించినా రామకోటికి ఆ కలయిక ఎందుకో సుతరామూ నచ్చలేదు. రామకోటి నాజర్‌ను ప్రధాన కథకునిగా మార్చి తాను హాస్య వంతదారునిగా మారాడు. నాజర్ ప్రతి అడుగులో రామకోటి ఉంటాడు. నాజర్ విషయంలో ప్రధాన భూమికగా మారాడు. జనం నాజర్‌ను మెచ్చుకొంటే తాను చప్పట్లు కొడుతూ సంబరపడిపోయేవాడు. కష్టం..సుఖం అన్నింటిని నాజర్‌తో సమానంగా పంచుకొనేవాడు. అందుకే తన జీవిత పథాన్ని పూలబాటగా చేసిన రామకోటి తనకు అత్యంత ఇష్టునిగా, ఆత్మ బంధువుగా నాజర్ భావించేవాడు. తన చుట్టూ సమాజంలో ఉన్న ప్రతి విషయాన్ని నిశితంగా పరిశీలించే రామకోటి సందర్భానుసారంగా కథలో వాటిని చెణుకులుగా పేల్చేవాడు. రామకోటి అనగానే చలనచిత్ర ప్రేక్షకులకు చిరస్మరణీయంగా గుర్తుండి పోయేనటుడు. చాలా చిన్న పాత్ర ధరించినా ఐదు దశాబ్దాల కాలం గడిచినా ఆ పాత్ర, నటుడు ప్రేక్షకుల మస్తిష్కాలలో ముద్రించుకు పోవటం అంటే రామకోటి ఎంతటి ప్రతిభావంతుడో తేటతెల్లమవుతుంది. ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'కులగోత్రాలు' చిత్రంలో పేకాట ప్రహసనం సన్నివేశం గుర్తుకు వచ్చినప్పుడల్లా తెరలుతెరలుగా నవ్వు వచ్చి కడుపుచెక్క లౌతుంది. ఆ సన్నివేశంలో ఒకప్పుడు జూద క్రీడాకారునిగా పేరుపొంది అంతా ఊడ్చుకు పోగా ఆ అనుభవాన్ని వర్తమాన

క్రీడాకారులకు ప్రైవేట్ చేస్తూ అందించే పాత్రలో రామకోటి నటన అవధులు దాటింది. ఆటలో తాదాత్మ్యం చెందుతూ ఒక వ్యక్తి వెనుక చేరి ఆ ముక్క కొట్టు అంటూ చెప్పే రెండు మూడు సన్నివేశాలలో రామకోటి జీవించాడు. ఆ సినిమా విడుదల తరువాత గ్రామాలలో పేకాట దగ్గర ప్రైవేట్ చేసేవారిని రామకోటిగాడు అని పిలవడం జరిగేది. రామకోటి తదుపరి అగ్గిరాముడు, నర్తనశాల వంటి చిత్రాలలో చిన్నచిన్న పాత్రలను పోషించారు.

రెండవ కథకే రామకోటి నాజర్‌ను కథకునిగా మార్చి అంతటితో ఊరుకోలేదు. తంబూరా, కాళ్లకు గజ్జలు లేనిదే కథ చెప్పడం కష్టమని పార్టీ పెద్దలను సతాయించాడు. పార్టీ పెద్దలను దావులూరిలోని దొడ్డవరపు వెంకటస్వామి వద్దకు తీసుకొని వెళ్లి తంబూరా, గజ్జెలను నాజర్‌కు ఇప్పించాడు. బుర్రకథకునిగా నాజర్‌కు తొలిగురువు రామకోటి. తుళ్లూరులో నాజర్ ప్రధాన కథకునిగా కథ చెప్పేవేళ దారిలో కొన్ని అడుగులు నేర్పారు. తంబూరాకు తానే కొత్త తీగలు అమర్చి మీటటం కూడా నేర్పారు. మొదటి ప్రదర్శనలో తంబూరాను మీటటం అనుగుణంగా అడుగులు వేయడంలో నాజర్ గందరగోళ పడితే రామకోటి ధైర్యం చెప్పి ప్రోత్సహించాడు.

బుర్రకథా రచనలో, ప్రదర్శనలో నాజర్‌కు అత్యంత స్ఫూర్తినిచ్చిన గొప్ప కళాకారుడు రెంటపాళ్ల గుడ్డి జంగంగా పిలువబడే కోటివీరయ్య. సరైన ప్రచారం లేక మరుగున పడిన జానపద ప్రదర్శనా కళారత్నం. ఆయన వీరరస పోషణలో అంతటి గొప్ప కళాకారుడు మరొకడు లేడంటే అతిశయోక్తి కాదు. తుళ్లూరులో కథ చెప్పిన మరునాడే పొన్నెకల్లులో కోటివీరయ్య కథ చెప్పారు. నాజర్, రామకోటి, నారాయణ ఆ కథను ఆసాంతం ఆసక్తిగా పరిశీలించారు. సముద్ర మథన ఘట్టంలో "**గిరగిర కవ్వము త్రిప్పుచు కేకలు వేయుచు, జరజర సాగుచుండెను.. తరువండి తరిచినను పటపట పండ్లు కొరుకుచు ఎటుతిరిగెదవేగ**" అంటూ కోటి వీరయ్య పాడిన రగడలు.. చేసిన అభినయం నాజర్‌ను ఎంతగానో ఆకర్షించాయి. అదే ఘట్టంలో "**అచ్చమైన బ్రహ్మాతాపం వచ్చునా మేనారజేసి ఇచ్చగించి తోకబట్టి మా నారాయణా. ఇది మీసమా మంజారపు వాసమా నారాయణా**" అనే రగడలను యథాతదంగానూ, ఆ స్ఫూర్తితో ఇదే నడకతో రగడలు రచించి తదుపరి కాలంలో కథలను చెప్పారు.

బుర్రకథలను చెబుతున్న నాజర్ ప్రస్థానం రచనవైపు మళ్లింది. రచయితగా కన్నువిప్పిన నాజర్ కథారచనకు లోతైన పరిశీలన, పరిశోధన చేశారు. స్థానికంతో

పాటు దేశంలో ప్రఖ్యాతి చెందిన సంగీత విద్వాంసుల శాస్త్రీయ సంగీతాన్ని అధ్యయనం చేశారు. జానపద కళా ప్రక్రియల సాహిత్యాన్ని, బాణీలను అవగతం చేసుకొన్నారు. దొడ్డవరపు వెంకటస్వామి కథా ప్రారంభంలో ఆలపించే కీర్తన **"శ్రీధేనువ గిరిధామ యదుకుల క్షీరాంబుధి సోమా.. శ్రీగోపాలా రాధాలోలా శ్రితజన మందారా"** అనేదానిలోని రాగాన్ని, సాహిత్యాన్ని స్ఫూర్తిగా తీసుకొని కొన్ని మార్పులను తన గళానికి అనుగుణంగా మార్చుకొన్నారు. ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ ఆలపించిన "కంరే బాంద్" అనే కీర్తనలోని మలుపులు, మెలికలను స్వీకరించారు. ఖాన్ రాగాలకు మన జానపద బాణీలను జతచేసి రాగపుష్టిని కలిగించారు. తెలుగునాట విశేష ప్రచారంలో ఉన్న భజన పాటలు, కోలాటం, వీధి భాగవతుల బాణీలు, ఎరుకలసాని సోది బాణీలను, మహమ్మదీయుల వివాహ సమయాలలో ఉపయోగించే చిన్న షహనాయి వరుసలు, మసీదుల్లో నమాజు బాణీలు, కృష్ణ చెంచులు జంటగా గంట వాయిస్తూ పాడే పాటల బాణీలు, దీన చెంచులు వీరణ వాయిద్యం వాయిస్తూ వీరతాళ్లు మోగిస్తూ పాడే పాటల బాణీలు, బిచ్చగాళ్ల పాటల బాణీలు, బవినీలు, పంబలు, జక్కుల బాణీలను పరిశీలించి ఆయా శైలులతో పాటలు పద్యాలతో పాడుతూ అభినయిం చేశారు.

వీధి భాగవతులైన అందెకోటదాసు, బందారు గూడెందాసులు, చిన్న సుబ్బన్న, పెద సుబ్బన్న, చింతపువ్వు మాణిక్యం, తారాబాయి వంటి వారి పాటల్లో ఉండే సహజత్వం, జీవగుణం తన గానంలో లేని విషయాన్ని నాజర్ గుర్తించారు. కథలు చెప్పకుండా ఖాళీగా ఉన్న రోజుల్లో వీధిభాగవతుల వద్దకు వెళ్లి కీర్తనలు పాడించుకొని వినేవారు. వారుపాడే అనురాగ, విరాగ, సరాగ, బాణీలను ఆకర్షణీయంగా మరింత రంజకంగా నేర్పమని వారిని ప్రాథేయపడేవారు. గుడిపాడు గ్రామంలో భక్త ప్రహ్లాద వీధినాటకాన్ని ప్రదర్శిస్తున్న జంగా సుబ్బదాసు వద్దకు వెళ్లి వీధి భాగవతంలోని కొన్ని పాటల బాణీలను నేర్పుమని కోరారు. సుబ్బదాసు కోరికపై **"సూపరే సుందర బ్రాహ్మణ సుందార వతులారా" "ఎంత మాటడిగితివమ్మా రాజకాంతలకిది మంచి ఘనమౌనమ్మా"** అనే సైరంధ్రి వేషంలో అందె కోటదాసు పాడిన కీర్తనలను బందారు గూడెం దాసులు చంద్రదాసు వేషంలో పాడిన **"మూలా నక్షత్రాన చతురోత్తర గండాన నాలుగో పాదాన నే జననమైతి"** అనే కీర్తనలు పాడి వినిపించారు. ఆ పాటలు వింటూ గత స్మృతులలోకి వెళ్లిన సుబ్బదాసు కన్నీళ్ల పర్యంతమై "బాబూ నేను కోటదాసు పక్కన రాజువేషం వేశాను. ఆ మహానుభావుని గాత్ర సౌలభ్యం, శ్రుతిపక్వత అందుకోవడానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాను. ఆ

మహానుభావుని సాయలు మళ్లీ ఇన్నాళ్లకు విన్నానని" నాజర్‌ను మెచ్చుకొన్నారు. కాకినాడలో బుర్రకథ చెప్పడానికి వెళ్లినప్పుడు బాలగంధర్వ బాణీల ఆలాపనలో నిష్ణాతులు, గొప్ప హార్మోనిస్ట్‌గా పేరు పొందిన ఆకుల నరసింహారావును కలసి బుర్రకథ రగడలకు, కీర్తనలకు సంబంధించిన వీధి భాగవత బాణీలను వినిపించి వీటిని మరింత పరిపక్వం చేసే మార్గాన్ని చూపుమని ప్రాథేయపడ్డారు. ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ బాణీలు, బిస్మిల్లాఖాన్ షహనాయి, బాలగంధర్వ టంకారనాథ్, ఠాగూర్‌ల గ్రామ్ ఫోన్ రికార్డులను తెప్పించుకొని విను. తప్పనిసరిగా నీకు దారి దొరుకుతుందని నరసింహారావు సలహా ఇచ్చారు. ఆంధ్ర సంఘ ఆహ్వానంపై కలకత్తా వెళ్లిన నాజర్ ఈ రికార్డులను తెచ్చి నెలల తరబడి వింటూ తన గానానికి మెరుగులు దిద్దుకొన్నారు. తల్లి పాడే మంగళహారతుల బాణీలను యథాతథంగా స్వీకరించారు. తల్లి కలుపు తీస్తూ, గడ్డి కోస్తూ, "నా నా నా నా నా" అంటూ జాలిగా పాడే ఆలాపనలను బుర్ర కథ చెప్పే సమయంలో హమ్మింగ్‌గా ఉపయోగించేవారు. ఆకలి ప్లస్ అనుభవం ఇంటూ తపస్సు ఈజ్ ఈక్వల్ టు నాజర్‌గా నిలిచారు. నిరంతర పరిశీలన, అధ్యయనం, కొత్తదనం కోసం ఆరాటం చెక్కిన మహనీయ ప్రజా కళా శిల్పం నాజర్.



# 3

# బెంగాల్ కరువు

1944లో బెంగాల్‌ను వరదలు, ఆ వెంటనే కరువు పట్టి కుదిపివేశాయి. వరద గ్రామాలను తుడిచిపెట్టింది. తరువాత వచ్చిన కరువు ప్రజలను పీల్చి పిప్పి చేసింది. ఆకలిబాధను తట్టుకోలేక గ్రామాల నుండి ప్రజలు పట్టణాలకు పుట్టలు పగిలినట్లుగా వచ్చారు. కలకత్తా వీధుల్లో ఎంగిలి విస్తళ్ల కోసం పందులు, కుక్కలు, మనుషులు కొట్టుకున్నారు. ఆకలి కోరల్లో చిక్కిన పిల్లలు, వృద్ధులు ఎక్కడ చూసినా శవాల గుట్టలుగా కన్పిస్తున్నారనే వార్తలు పత్రికల్లో వచ్చాయి. పత్రికల్లో బెంగాల్ కరువును కళ్లకు కడుతూ వచ్చిన గేయం నాజర్ గుండెలను కెలికింది.

**వెళ్లిపోదామా మామా వెళ్లిపోదామా**
**వెళ్లిపోదామా పట్నవాసపు కుళ్లు వీధుల్లో పడి**
**ఈన మోపై ఉన్న పైరుల ఏటి మలుపుల పాలుజేసి**
**పొట్టచేత పట్టుకొని పట్టెడు కూటికై ఊరేగవలెనా**
**వెళ్లిపోదామా మామా వెళ్లిపోదామా**
**ఒడలు పెంచిన గడ్డమీదే ఒరిగిపోయే రాత లేదే**
**ఊరుగానీ ఊరులో చితిపేర్చుకోమని నొసటివ్రాలు**
**వెళ్లిపోదామా మామా వెళ్లి పోదామా**

ఈ పాటను చదువుతున్నప్పుడు చిన్ననాటి సంఘటన ఒకటి గుర్తుకు వచ్చింది. పొట్ట పోసుకోవడానికి అద్దరోడ్డు సెంటర్‌లో ఒక పొగాకు కంపెనీలో ముఠా కూలీగా చేరాడు. బట్వాడా రోజున మేస్త్రీకి నాజర్‌కు చేసిన పని లెక్కలో తేడా వచ్చింది. మేస్త్రీని నిలదీసినందుకు పని నుండి తీసివేశారు. ఇంట్లో ఉన్న పెద్ద ఇత్తడి కాగు

తాకట్టు పెట్టి వచ్చిన డబ్బుతో కృష్ణానది దాటి గొల్లపూడి పొగాకు బ్యారన్ పనికి తల్లిని తీసుకొని వెళ్లాడు. అక్కడ పని దొరక్కపోవడంతో తిరిగి నదిని దాటుతున్న సమయంలో తల్లి "ఇంట్లో ఉన్న ఒక్క ఇత్తడి కాగు కుదువపెట్టి ఖర్చు చేశాము. ఉట్టి చేతులతో ఇంటికి వెళ్లి మనం ఎట్లా బతుకుతాం అయ్యా మమ్మల్ని ఏ గంగలో నెడతావు కొడుకా" అంటూ భోరున ఏడ్చింది. ఆ సంఘటన గుర్తుకు రావడంతో నాజర్‌కు గుండెల్లో చేయి పెట్టి దేవినట్లు అయింది. కళ్లవెంట నీళ్లు రావడంతో పేపర్లో అక్షరాలు అలుక్కు పోయినట్లుగా కన్పించాయి. వెంటనే ఆ స్ఫూర్తితో బెంగాల్ కరువు బుర్రకథను వ్రాశారు. విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో జరిగిన అభ్యుదయ రచయిత సంఘం సభలో ఈ కథను తొలిసారి చెప్పారు.

అభ్యుదయ పత్రిక ముఖచిత్రంగా నాజర్ బొమ్మను వేశారు. బెంగాల్ కరువు కథను విన్న సినీ నటులు డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు "నాజర్ మాజిల్లా వాడు. గుంటూరు గోంగూర దెబ్బ" అంటూ పొగిడారు. బాపట్ల హైస్కూలు ఆవరణలో జరుగుతున్న యువజన మహాసభలో బెంగాల్ బుర్రకథను చెబుతున్న సమయంలో అధ్యక్ష స్థానంలో ఉన్న బళ్లారి రాఘవ కరువు ఘట్టాన్ని వింటూ దు:ఖం ఆపుకోలేక వేదిక పైకి వచ్చి నాజర్‌ను కౌగిలించుకొని విలపించారు. రాఘవ తన తల్లి సంస్మరణ దినం రోజున బళ్లారిలో నాజర్ బుర్రకథను ఏర్పాటు చేయించారు. ఈ బుర్రకథ చెప్పాక సభలో ఉన్న వారి నుండి డబ్బును, బట్టలను సేకరించి కమ్యూనిస్టు కరువు కమిటీ ద్వారా బెంగాల్‌కు పంపారు. బెంగాల్ కరువు కథను బందరులో చెప్పినప్పుడు పినపాల నాగభూషణం, నందం నాగభూషణం అనే హస్త కళాకారునిచే పనస కర్రతో తయారు చేయించిన కొత్త తంబూరాను నాజర్‌కు బహూకరించారు.



# 4

# పల్నాటి యుద్ధం

**మ**ద్రాసు నుండి నాజర్‌కు రామకోటి ఉత్తరం వ్రాశాడు. "ప్రియమైన నాజర్‌కు **పార్టీ మనకిచ్చిన కార్యక్రమం నుండి తప్పుకొంటున్నాను. వేలాది ప్రజలకు ఆర్థిక, సామాజిక రాజకీయ నడవడికలను, సాంస్కృతిక చరిత్రలను కథలుగా హావభావ నటన గానాలతో ముగ్ధులను చేసి కార్యోన్ముఖులను చేసే మనలను విడదీసి ప్రాంతీయ కమిటీలతో పనిచేయమనడం తప్పు. కనుక నాజర్ దళం పేరుతో కథలు చెప్పుకొందాం. త్వరలో పొన్నెకల్లు వస్తాను**" అని వ్రాశారు. కొత్తకథ వ్రాయడానికి నాజర్ అన్వేషణ మొదలు పెట్టారు. తెలుగు వేదాలు, ఉపనిషత్తులు, మను, వసు చరిత్రల వంటి ప్రబంధాలు, వాత్సాయన కామసూత్రాలు, నాట్యశాస్త్రం, అభినయదర్పణం, భాస నాటకాలు, రస ప్రకరణం వంటి కావ్యాలు, శాస్త్ర గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. ఈ కావ్యాలలో ప్రేమ, శృంగారం, రాజుల వైభోగాలు, తప్ప సామాన్య ప్రజల కష్ట నిష్ఠూరాలు కన్పించలేదు. మద్రాసులో బెంగాల్ కరువు కథ చెప్పిన సమయంలో సినీ నిర్మాత, దర్శకులు గూడవల్లి రామబ్రహ్మం తన కార్యాలయానికి నాజర్‌ను తీసుకొని వెళ్లి పల్నాటి చరిత్రను కథగా చెప్పమని తాను సేకరించిన చరిత్ర గ్రంథాలను, తయారు చేసిన సినిమా స్క్రిప్ట్‌ను ఇచ్చిన విషయం గుర్తుకు వచ్చింది. ఆ స్క్రిప్ట్‌ను నిశితంగా పరిశీలించారు. బ్రహ్మనాయుని చాపకూటి సిద్ధాంతం, వర్ణ ధర్మశాలలో ఉన్న తరతరాల తెలుగు జాతిని తగువుల పేరుతో వేరు చేస్తున్న విధానం, కుల, మత వ్యతిరేకత వంటి అంశాలు నాజర్‌ను ఎంతగానో ఆకర్షించాయి. బెంగాల్ కరువు వ్రాసినంత సులభంగా పల్నాటి యుద్ధం వ్రాయలేనని నాజర్ భయపడ్డాడు. ప్రయాగ కోదండరామ శాస్త్రి గారి శిష్యరికం చేశారు. శాస్త్రిగారి ప్రోద్బలంతో దేవులపల్లి కృష్ణశాస్త్రి,

గురజాడ, శ్రీశ్రీ వంటి వారి సాహిత్యాన్ని బట్టీయం పట్టారు. చలం, కొడవటిగంటి కుటుంబరావు, గోపిచంద్ మొదలైన వారి సాహిత్యాన్ని కూడా క్షుణ్ణంగా చదివారు. శాస్త్రి గారి ప్రోత్సాహంతో పెదపూడి పాఠశాల అనుభవంతో పల్నాటి యుద్ధం బుర్రకథను రచించారు. రామకోటి నాజర్ కలిసి లోతైన చర్చలు చేసి మార్పులు చేర్పులు చేశారు. శృంగారలహరి కృతిని ప్రార్ధనా గీతంగా నాజర్ ఎంపిక చేసుకొన్నారు. పల్నాటి యుద్ధంలో రాజకీయవంతగా పాత సహచరుడైన పురుషోత్తం కోసం ఆయన గ్రామానికి వెళితే ఆయన సంసార బాధలతో మతి చలించి ఎటో వెళ్లి పోయాడని చెప్పి కుటుంబ సభ్యులు విలపించారు.

పల్నాటి యుద్ధం బుర్రకథను 1945 ప్రాంతంలో రచించారు. ఈ కథను రాష్ట్రంలోని మారుమూల గ్రామాలలో వేలసార్లు చెప్పారు. నాజర్ బుర్రకథంటే ప్రజలు తండోపతండాలుగా బళ్లు కట్టుకొని వచ్చేస్థాయికి తెచ్చారు. బుర్రకథా ప్రక్రియ ద్వారా కథకు సమకాలీన రాజకీయాన్ని జోడించి ప్రజలలో చైతన్యానికి ఎంతగానో కృషి చేశారు. కథను చెప్పడంలోనే కాదు రచనలో కూడా అందెవేసిన చేయి అని నిరూపించుకొన్నారు. ఈ బుర్రకథను తన అభివృద్ధికి తోడ్పడిన ముఖ్యులలో ముఖ్యుడైన పురుషోత్తమానికి అంకితమిచ్చారు.



# 5

# ఇతివృత్త వైవిధ్యం

గుంటూరు జిల్లాలో వెలలేని మాగాణీ భూముల పురిటిగడ్డ. ధైర్య పరాక్రమాలకు పోతుగడ్డ.. పగ, ప్రతీకారాలతో పొగిలిపోయే రోషాగ్నుల నెత్తుటి గడ్డ పలనాడు. కృష్ణవేణమ్మ నీటిధారలతో తడిసి పునీతమైన రేగడి గడ్డ పలనాడు. దాయాదుల మధ్య జరిగిన పోరులో అంతా శ్మశానంగా మారిన పలనాటి కథను ఆధునిక మహాభారత కథగా అభివర్ణిస్తారు. వీరరక్తపు ధారవార పోసిన సీమ అది. బ్రహ్మనాయునిధీమంతం, కన్నమదాసు వీరత్వం, బాలచంద్రుని ధీరత్వం, నాయకురాలు నాగమ్మ మంత్రిత్వం యుగయుగాలకు స్ఫూర్తి దాయకంగా నిలుస్తుంది. "బాలచంద్రుని కత్తి మెరుపులను చూచి శ్రీనాథ కవిరాజు చంద్రవంకకు చెప్ప ఎదకరిగి ప్రవహించెరా.. పలనాటి ఎత్తిపోతల దూకెరా" అంటూ కవులు వీరరస కథాగానం చేశారు. పలనాటి చరిత్ర యుద్ధం వంటి అంశాలపై ఎన్నో కట్టు కథలు, పుక్కిటి పురాణాలు వినికిడిలో ఉన్నాయి. వాస్తవమైన చరిత్రను వివరించే స్పష్టమైన చారిత్రకాధారాలు లేవు. కేవలం శ్రీనాథ మహాకవి పలనాటి వీరచరిత్ర, స్థానిక గాథలు మాత్రమే కొంత చరిత్రకు దర్పణం పడుతున్నాయి.

ఆ ఆధారాలను పరిశీలిస్తే వెలనాటి చోడుల సామంత వంశం హైహయులలో అంత:కలహాలు పొడచూపాయి. ఇదే పల్నాటి యుద్ధంగా రూపుదిద్దుకొంది. దీనికి శాసనాల సాక్ష్యం లేదు. పల్నాడును పరిపాలిస్తున్న అనుగురాజుకి వెలనాటి రెండవ గొంకని కుమార్తె మైలమ ద్వారా నలగాముడు, ఇతర భార్యల ద్వారా మలిదేవాదులు జన్మించారు. వెలనాటి ప్రభుత్వ ప్రతినిధిగా గురజాలలో ఉన్న బ్రహ్మనాయుడు అవిధేయతను నలగామరాజు మంత్రిణి రెడ్డినాగమ్మ వ్యతిరేకించడంతో పల్నాటి రాజ్యం రెండుగా చీలిపోయింది. మలిదేవుడు ప్రభువుగా మాచర్లలో బ్రహ్మనాయుడు మంత్రిత్వం

చేశాడు. బ్రహ్మనాయుడు వైష్ణవ మతాభిమాని. నాగమ్మ శైవమతాభిమాని. ఈ మత ద్వేషాలే అంత:కలహాలకు మూలకారణమయ్యాయి. దీనికి తోడు ఇతర రాజుల జోక్యం పర్యవసానంగా పల్నాటి యుద్ధం జరిగింది. కారంపూడి వద్ద జరిగిన యుద్ధంలో నలగాముని పక్షాన కాకతీయులు, హైహయసాలులు, వెలనాటి సామంతులైన కోట పాలకులు కూడా యుద్ధంలో పాల్గొన్నారు. మలిదేవుడు కాలచర్యుల మద్దతు పొందాడు. నలగాముని పక్షం విజయం సాధించింది. అయితే తమ బంధువులు, సామంతులైన హైహయ కుటుంబ కలహాలను వెలనాటి చోడులు పరిష్కరించలేక పోయారు. దీనితో పరరాజుల దండయాత్రలతో హైహయ వంశం అంతరించి పోయింది.

జానపద కళాకారులు వివిధ ప్రక్రియల ద్వారా ఈ కథను రసవత్తరంగా చెప్పే సమయంలో అనేక కల్పనలు చోటుచేసుకొన్నాయి. తండ్రి మరణానికి కారకుడైన బ్రహ్మనాయునిపై పగ సాధించడానికి నాగమ్మ నలగాముని పక్షం చేరి యుద్ధ తంత్రాన్ని రచించినట్లు ఒక కథనం. బ్రహ్మన్న నాగమ్మల మధ్య వైష్ణవ, శైవ మత విభేదాలే పల్నాటి యుద్ధ కారణమని వేరొక కథనం ప్రచారంలో ఉన్నాయి.

నాజర్ పల్నాటి యుద్ధం బుర్రకథలో మరొక కొత్త కోణాన్ని ఆవిష్కరించారు. మతాల మధ్య అడ్డుగోడలను కూల్చి అన్నిమతాల వారికి దేవాలయ ప్రవేశము కల్పించి కులమత బేధాలు లేకుండా ఏకపంక్తిలో భోజనం చేసే చాపకూడు సిద్ధాంతాన్ని బ్రహ్మన్న ప్రవేశ పెట్టాడు.

“ఎక్కువ తక్కువ మత విభేదము - అక్కర లేదనుచూ” ‘తందానాతాన’
ఒక్కటిగ ప్రజలందరుండతా - చక్కగా యోచించి ,,
చాకలి మంగలి మాల మాదిగ - సర్వ జనుల కెల్ల ,,
ఏకపంక్తిలో విందు భోజనము - ఏర్పాటు చేసి ,,
చాపకూటి సిద్ధాంతము పేరిట - సాగించెను ఘనుడు ,,
మాలకన్నమను బ్రహ్మనాయుడే - ప్రేమగ పెంచాడు ,,
కన్నమదాసును సేనాపతిగా - జేసెను బ్రహ్మయ్య ,,
వర్ణకుల మతమును ఉక్కు చట్రమును వ్రయ్యలు జేసాడా ,,
హెచ్చు తగ్గులను రూపుమాపగ దీక్ష బూనినాడు ,,
సర్వమానవ సమానత్వమును - స్థాపన చేయుటకై ,,

ధైర్యముగ ముందంజ వేసెనా - ధీరుడు బ్రహ్మయ్య ,,
పెద్ద పెద్దలకు పెత్తందార్లకు - పీక పట్టెనయ్యా ,,
గిట్టలేదు ఈ చాపకూటి సిద్ధాంతము - పెద్దలకీ ,,
మట్టిగలిసె కులకట్టు బాటులని - తిట్టుచూ లోలోన ,,
కట్టు పంచెలను కదలకుండగా - పుట్టు గోచిపెట్టి ,,
పట్టినపట్టు విడువమంచుమీ - సములు పట్టిదువ్వి ,,
ఒప్పుగ పెద్దలు పెత్తందారులు - ఒక్కటిగా కూర్చి ,,
చెప్పుకొనుచు బ్రహ్మయ్య దాపునకు చేరిరి కోపమున ,,
ఎప్పుడు పుట్టెనో ఈ మత ధర్మాలెందుకు పుట్టినవో ,,
ఇప్పుడు వీటిని త్రోసివేయ మే మొప్పము బ్రహ్మయ్యా ,,
అని ఇవ్విధమున స్వార్థపరులు బ్రహ్మయ్య కెదురుతిరిగి ,,

వచనం : ఈ విధముగా పెద్దలు బ్రహ్మయ్యను ఎదిరించిన సమయమున

పాట : సాగినాదిరా నాగులేటి దొరసాని - నాగసాని "తందానాతాన"
అధికారము చేబట్టుటకిదియే - అదను తలచింది ,,
నాగమ కంటిలో ఆశారేఖే నాట్య మాడి నాదా ,,
కూడదీసి అభివృద్ధి నిరోధక - కూటమినంతటిని ,,
అట్టహాసముతొ పెద్దలనందరినీ - దిట్ట పరచినాది ,,
ఒట్టు సుమా ఈ పట్టు వీడితిమా - పుట్టవు నీళ్లందీ ,,
అని ఇవ్విధమున పెద్దలందరిని రెచ్చగొట్టెనయ్యా ,,
నాగాంబ సైన్యాల గూర్చుకొని - వేగమె పూనిందా ,,
నివ్వెరపడి పలనాడంతా నిదరే మానింద ,,

వర్ణవ్యవస్థను సమూలంగా కూల్చివేసే చాపకూటి సిద్ధాంత చైతన్యాన్ని భరించలేని పెత్తందార్లు నాగమ్మ సహాయంతో బ్రహ్మనాయునిపై కక్ష తీర్చుకొన్నట్లు నాజర్ కల్పించారు.



# 6

# పాత్ర చిత్రణ

పల్నాటి యుద్ధం బుర్రకథలో సంయమనశీలిగా, ధీమంతునిగా, ఉచితానుచిత జ్ఞానశీలిగా బ్రహ్మన్న పాత్రను, ఈర్ష్య, అసూయ, కుటిలత్వం నిండిఉన్న ప్రతినాయకురాలిగా నాగమ్మ పాత్రను, వయస్సు చిన్నదైనా అపారజ్ఞాన సంపదను కలిగిన మృదు స్వభావిగా అలరాజు పాత్రను, ఒక వైపు బాల్య చాపల్యం, బాధ్యతా రాహిత్యం, మరొక వైపు వయసు పొంగుల శృంగార చాపల్యం, మరొకవైపు చండ ప్రచండ వీరత్వం వంటి విభిన్న ప్రకృతుల, కలబోతగా బాలచంద్రుని పాత్రను తీర్చిదిద్దాడు. పేరిందేవి పాత్రలో కరుణరసం కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది.

వీరరస పోషణలో నాజర్‌ది అందెవేసిన చేయి. కోడి పందాలకు ఇరువర్గాలకు సిద్ధమయ్యే సన్నివేశాన్ని, హృద్యంగా వర్ణించాడు. ఈ సన్నివేశాలలో సాహిత్యం వరద వేగంతో పరుగులు తీస్తుంది.

అందెవేసినా పందెగాళ్లురా "సై"
అందమైన పుంజు లెత్తిరి ,,
పాతల కత్తులు తీసిరీ ,,
సానం మీదే సాదిరి ,,
నూనెల మెరుగులు పెట్టిరి ,,
గజ్జెల చెడ్డీల్ కట్టిరి ,,
గంతులు వేయుచు కదిలారా ,,

నాగమ్మ వైపువారు గురజాల నుండి కదిలిన సన్నివేశాన్ని వివరిస్తూ...

| | |
|---|---|
| పేరుగొన్న పందెగాళ్లురా | "సై" |
| పౌరుగల కోళ్ల నెత్తిరా | "సై" |
| సాధన చేసిన వారురా | "సై" |
| సారాజాడి బండ్లురా | "సై" |
| భేరీ వాయిద్యాలురా | "సై" |
| జోరుజోరుగా తాగిరా | "సై" |
| దారులన్ని తెగనడిచారా | "భళానంటి భాయ్ తమ్ముడా" |

కోనేరు కట్టల వద్ద జరిగిన కోడి పోరును వీరరస స్ఫోరకంగా వర్ణించారు.

| | |
|---|---|
| మాచర్ల రాజులు నాయనా | "సై" |
| జాతి కోడినే దించిరా | ,, |
| నాయకురాలు సోదరా | ,, |
| పుంజుల్లోన పుంజుగానిదీ | ,, |
| పెట్టల్లోన పెట్టగానిదీ | ,, |
| పెట్టమారినే దించిందా | "భళానంటి భాయ్ తమ్ముడా" |
| నీటైన మాచర్ల పుంజురా | "సై" |
| నోటబట్టి పెట్ట మారినీ | ,, |
| దెబ్బమీద దెబ్బ గొట్టెరా | ,, |
| పెట్టమారి నేల గరిచిందా | ,, |
| కాళ్లు వణికే నాగమ్మకు | ,, |
| కళ్లు తిరిగే నాగమ్మకు | ,, |
| జిత్తులమారి నాయకి | ,, |
| నెత్తురు జెండా ఎత్తెరా | ,, |
| జుట్టును తా విరబోసెరా | ,, |
| దయ్యము లాగా నాయకి | ,, |
| ఆకయ్యము లోనా నిలిచిందా | "భళానంటి భాయ్ తమ్ముడా" |

సతీసహగమనము చేసే సన్నివేశంలో పినతండ్రి నరసింగరాజును చూచి పేరిందేవి అక్రోశంతో పలికిన మాటల్లో కరుణ రసం గుండెలను పిండిచేస్తుంది.

సిన్నయ్యా! ఓ సిన్నయ్యా! పిన్నయ్యా నరసరాజా "తందానా"
కన్నయ్యకన్నా మిన్నగ పెంచిన పిన్నయ్య వినరా ,,
దీవెనలిచ్చి వల్ల కాటికి పుడంపర పిన్నయ్యా "తందానా"
అల్లుని తోడుగ కూతుని గూడా అంపర పిన్నయ్యా ,,
మాయలేదురా పసుపు గుడ్డలు మాకో పిన్నయ్యా ,,
పెండ్లి ముచ్చటే తీరలేదురా పిన్నయ్యా మాకు ,,
కదిలి పోయెనా తల్లిగుణవతి కాటిదరికి ఇపుడు ,,
కంటినీటితో భర్త పాదములు కడిగె పేరిందేవి ,,
కాలిపోయెనా కాటిమీద కాంత పేరిందేవి ,,

బాలచంద్రుడు మాంచాలను చూచిన సందర్భంలో శృంగార రసాన్ని వర్ణించారు.

ఏడు వారపు నగలను బెట్టిన ఇంతిని జూచాడు "తందాన"
పట్టుది జలతారు చీరగట్టిన పసిడి బొమ్మ నరసి
పున్నమి చంద్రుని ధిక్కరించునా పడతిని బరికించి
కన్ను చెదిరి కామాంధకారమున తన్ను తానే మరచి
ఆమె అందము పొగుడు తాడా "భళాభళి"
ప్రేమ భిక్షను వేడుతాడు ,,
కామాన్ని తీర్చమంటాడా ,,
నన్ను మన్నించ మంటాడా ,,
నిన్ను విడనాడ నంటాడా ,,
పిచ్చి ఎక్కిన కోతి చందాన బాలుడా ,,
వచ్చిన పనిమరిచాడా " భళాభళి ఓ భారతీయుడా"

యుద్ధరంగంలో మోహరించిన ఇరుపక్షాలు తలపడుతున్న తీరును నాజర్ భయానకంగా వర్ణించాడు.

పటపట పటపటమని పండ్లు కొరుకుతూ పటు తరగతి వేగ
కటకట కటకట కోరలొరిపిడికి చిటపటయనె నిప్పుల్
రెట్టలు దట్టుచు అరెరేయని మిట్టిమిడుచు వేగ
పొట్టి మీసములు పట్టిదువ్వి కనుబొమ్మలు ముడియబెట్టి
పట్టా కత్తులు కఠారుబాకులు తటాలునందుకొని



పట్టిమీసం అంటూ రౌద్రరసాన్ని అభినయిస్తున్న నాజర్

పెఠిల్లుమని కక్కటిల్లుచును రిక్త కంఠంబుల దరగను
గండ్ర గొడ్డళ్లు కత్తులు బాణా కర్రలు చేబూని
వేండ్రమైన రోకండ్లు గుదపలును బిండి వాలములను
తళతళ నాకసంబున మెరయగ తలపడే నిరువారు.
కరులు సేనలును నురుమాడుచు మున్ముందు కేగుచుండ
రణభేరీ ధణధణలకు ధరణి దద్దరిల్లు చుండ
శరవేగంబున శత్రుసేనలు నురుమాడు మునుముందు కేగుచుండ
ధరణి మీద నరివీరుల తలలు తరుగుచు బాలుండు
విచ్చుకత్తి నరివీరుల రొమ్ముల కుమ్మి చిమ్ముచుండ
గుండెలు ప్రేవులు వొక్కుమ్మడిగా తుండెమె పైజార
కొండల రీతిగ శవములన్నియు గుట్టలు బడుచుండ
నెత్తురు చిమ్ముచు తలలు మొండెములు దొర్లాడుచునుండు
శత్రుసేనలు చెదిరి బెదిరెను చెట్లకు గుట్లకు"

ఈ రగడ నడకలో నిప్పులు కురిపిస్తూ నాజర్ వీరరసోద్రేక అభినయం ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తేది. రెంటపాళ్ల గుడ్డిజంగం కోటివీరయ్య నుండి ఈ శైలిని స్ఫూర్తిగా తీసుకొన్నాడు. అనంతర కాలంలో దాదాపు ప్రతి బుర్రకథకుడు ఈ రగడను యథాతథంగా వినియోగించడం విశేషం.

ఈ బుర్రకథలో పేరిందేవిని, అలరాజును కాటిమీద కాల్చేటప్పుడు అమ్మా అని వేసే కేకకు ఒక స్ఫూర్తి ఉంది. నర్సరావుపేట మురుకుళ్ల సీతారామయ్య వద్ద సంగీత శిక్షణ పొందే సమయంలో మాధుకర వృత్తి చేశాడు. ఒక రోజు సంగీత గురువు సీతారామయ్యతో కలసి నాజర్ కళావంతుల వీధికి మాధుకర వృత్తికి వెళ్లాడు. ఒక ఇంటి ముందు నిలబడి సీతారామయ్య ఆర్ద్రతతో కూడిన స్వరంతో అమ్మా అని అరిచాడు. ఆ కేక నాజర్ మనుసులో ముద్రించుకుపోయింది. ఆ కేకను అదే ఆర్ద్రతతో నాజర్ బుర్రకథలో వినియోగించాడు. ఆ సన్నివేశంలో ఆ కేక ప్రేక్షకుల గుండెలను పిండి వేసేది.

ఈ బుర్రకథలో ఎదరుబళ్ల (ఎదురెదురు), ఏర్లు (విడిపోవు), దౌడు (పరుగు), పారింది (పారిపోతుంది) వంటి గుంటూరు జిల్లా మాండలిక పదాలను ప్రయోగించారు. ఈ బుర్రకథలో త్రిపురనేని రామస్వామి చౌదరి రచించిన ఈ క్రింది రెండు పద్యాలను యథాతథంగా వినియోగించారు.

గీ॥ బ్రహ్మనాయుని ఇంజారి బెరసపుంజు
నెత్తురు ప్రేవులుజీరాడ నింగికెగసి
పెట్టమారిని రెట్టలు చిట్టుదన్ని
ప్రాణముల్ బాసె మాచర్ల జాతిపుంజు
చావకనె పారినది గురజాలమారి
చమరి బరిమీద వొరిగె మాచర్ల పుంజు
ధర్మ నిర్ణయ మగుదాక తడయకామె
కసిరి నాగమ్మ వేయించె కంచుఢక్క

పల్నాటి యుద్ధం కథను చెప్పే సమయంలో జనంలో స్పందన విశేషంగా కనిపించేది. మాచర్ల చెన్నకేశవస్వామి దేవాలయం ఎదుట బుర్రకథను చెప్పే సమయంలో ప్రేక్షకులలో కొందరికి ఉగ్రం పెరిగేది. వాళ్లనెత్తిన బిందెలతో నీళ్లుపోసి స్పృహలోకి తెచ్చేవారు. ఇటువంటి సంఘటనలు ఎన్నో చోట్ల జరిగాయి. నాజర్ పల్నాటి యుద్ధం బుర్రకథను ఆరువేల సార్లుకు పైగా చెప్పారు. స్వీయ రచనలతో పాటు ఇతర రచనలలో కూడా ఎక్కువసార్లు చెప్పింది కూడా ఈ కథనే. నాజర్‌కు ప్రజలలో విశేష ఆదరణతో పాటు పేరు ప్రతిష్టలు తీసుకొని రావడానికి ఎక్కువగా దోహదపడింది కూడా పల్నాటి యుద్ధమే.

# 7

# నేటి రాయలసీమ

**రా**యలేలినసీమ రతనాల సీమ, కత్తులును ఘంటములు కదను తొక్కిన నేల. అంగళ్ల రతనాలు అమ్మిన నేల. తుంగమ్మ, కృష్ణమ్మ జలాలతో తడిసి పునీతమైన నేల. ఒకప్పుడు భోగభాగ్యాలతో సిరిసంపదలతో అలరారిన నేల. ఒకనాటి కాలం అది. కాని వర్తమానంలో దరిద్రదేవత ఇనుపగజ్జెలతో కరాళ నృత్యం చేస్తున్న నేల. ఆకలి దప్పుల ఆర్తనాదాలతో గుండెలవిసిపోయే నేల. చుక్కనీరు రాలక బీటలు వారిన పొలాలతో, బుక్కెడు బువ్వలేక ఎండిన డొక్కలతో అల్లాడుతున్న నేల. ముఠాకక్షల మారణ హెూమాలతో.. మానవ హెూమాలతో భగ్గున మండి పోతున్న నేల. కరువు రక్కసి వికృత విలయాల సీమలో బక్కచిక్కిన రైతన్న వ్యధార్త జీవన యదార్థ హృదయ వేదనలను కరుణ రసాత్మకంగా నాజర్ చిత్రించిన బుర్రకథ నేటి రాయలసీమ. నాజర్ రైతు కూలి, రైతన్న కష్టనష్టాలను స్వయంగా చూచినవాడు. చిన్నకారు రైతుగా సాధక బాధకాలను అనుభవించిన వాడు. పొలం అన్నా, వ్యవసాయం అన్నా, రైతన్నా నాజర్ గుండె ఉప్పొంగుతుంది. శరీరంపై పులకింతల పూలు పూస్తాయి. నిజమైన హృదయ స్పందనతో కవిత్వాన్ని వ్రాయడమే కాదు అంతకన్నా మించిన అనుభూతితో ఆర్ద్రతగా పాడతాడు. అందుకే కథలో అవకాశం, సందర్భం వచ్చిన చోట రైతు ప్రస్థావనను ఆత్మీయంగా చేస్తాడు. రాయలసీమలో ఒకప్పుడు వైభోగంగా, ఆత్మగౌరవంతో బ్రతికిన రైతు కరువులో అరువు బరువుతో ఎలా కుంగి కృశించి నలిగిపోతున్నాడో ఆకలి పేగుల రుద్రవీణను మీటి ఆ ఆకలి చేతిలో ఆత్మాభిమానాన్ని తాకట్టు పెట్టలేక, ఆత్మగౌరవాన్ని కాపాడుకోలేక ఎలా వదలి పోతున్నాడో సజీవ రూపకల్పనతో నాజర్ ఈ బుర్రకథను రచించారు.

కథా ప్రారంభంలో రాయలసీమ చారిత్రక, భౌగోళిక విశిష్టతను ఈ విధంగా వివరించారు.

శ్రీల విలసిల్లే తెలుగుదేశ మకుటాయమానమైన
రాయలేలిన రాయలసీమరా రాజనాల సీమ
శిల్ప నిపుణులకు చిత్రకారులకు చరితపేరు గాంచె
కల్పతరువురా కవి దిగ్గజులను కన్నతల్లి యదిరా
బిరబిర పరుగిడు కొండ వాగులకు కొరతేలేదన్న
సిరులు చెరుగు బంగారు భూములకు తరుగులేదన్న
కొంగున బంగారము లాగున్నది తుంగభద్ర తల్లి
పొంగులెగయు కృష్ణానది దాపున పోవుచు నున్నాది
వీరగడ్డయని దేశదేశముల పేరుగాంచినాది
తెలుగుదేశ వర్తకముల కదియే వరవడి పెట్టినదీ
వీరులకు విజ్ఞాన ధనులకు నిలయము వెలనాడు

అటువంటి ఖ్యాతి గన్న రాయలసీమలోని రాయపేట గ్రామంలో రైతుబిడ్డ భూపతయ్య ఆయన సహధర్మచారిణి సీతమ్మ. తండ్రి మంచాన పడిన వృద్ధుడు. కల్లా కపటం లేని భూపతయ్య కష్టజీవి. ఉన్న రెండెకరాల కొండ్రలో రెక్కలు ముక్కలను చేసుకొంటూ సేద్యం చేస్తున్నాడు. సీతమ్మ నిజంగా ఆయన అర్ధాంగే. భూపతయ్య గ్రామ షావుకారు బ్రహ్మయ్యకు చెందిన ఐదు ఎకరాల భూమిని కౌలుకు తీసుకొని వ్యవసాయం మొదలు పెట్టాడు.

మింటివంక మేఘాల కోసమై మెడలెత్తిన జనుల — తందాన
కంటిలోన తళతళలు వెలుగ మేఘాలు కురిసినాయి — ,,
తొలకరించగనే కూలీ రైతులు కళకళలాడుచును — ,,
కోలాహలముగ గ్రామ దేవతల కొల్పులు కొల్చుకొని — ,,
ఎద్దుల సింగారించి వేగ కోటేరు దీర్చుకొని — ,,
హద్దు లేని ఆనందముతో ఏర్వాక సాగినారు — ,,

ఆ ఏడంతా ఆటపాటలతో గడిచిపోయింది. భూపతయ్య పొలం పనుల్లో వంచనలేని మనిషి, మేడి పట్టినా... మోపుగట్టినా అలుపూ సొలుపూ లేని మనిషి. సీతమ్మ జాలి గుండె గల మనిషి. ఇంటి చాకిరి చిటికెలోనే తానొంటరిగా చేసి తట్ట చంకనిడి చేలో భర్తకు దుత్తెడన్న మిచ్చి గంపగడ్డి అల్లంత పొద్దుకే కొంపకు తెస్తుంది.

పెయ్యకు కోడెదూడ తనకు కొడుకు పుట్టాలని ఏడుకొండల వానికి సీతమ్మ మొక్కుకుంది. కొడుకు పుట్టాడు. బారసాల ఘనంగా చేసి ఆనందయ్య అనే పేరు పెట్టుకొన్నారు. బారసాలకు వచ్చిన బంధువులకు అప్పు చేసి విందులు చేశారు. అదే రోజున గొడ్ల చావిడిలో కోడెదూడ పుట్టింది. ఆ ఏడాదంతా సుఖంగా గడిచిపోయింది. మళ్లీ తొలకరి అదును వచ్చింది కానీ

ఏడాదంతా మేఘము బట్టిన జాడేలేదాయే "తందాన"
వర్షాకాలము వచ్చిపోయినా ఒక్క చినుకు లేదు ,,
గొర్రు దించలేదాయే రైతు ముల్లు గర్రా మూల బడియే ,,
ఊరు ఉహము అల్లాడిపోయె నా తీరు వరపు జూచి ,,
ఉత్తర జూసి ఎత్తర గంపను సామెత నిజమాయె ,,

ఇంట్లో ఆకలి దేవత తాండవిస్తోంది. బిడ్డ ఆకలి చూడలేక షావుకారు బ్రహ్మయ్య వద్దకు అప్పుకోసం వెళ్లాడు. నూటికి ఆరుంబావలా వడ్డీ, ఆ వడ్డీ ముందుగానే అసలులో మినహాయింపు, పొలం తాకట్టుతో బ్రహ్మయ్య దగ్గర అప్పు తెచ్చాడు. వెయ్యి రూపాయిలకు నోటు వ్రాస్తే వడ్డీ, పాత బాకీలు పోగా మిగిలిన యాభై రూపాయిలతో భూపతయ్య ఇంటికి చేరాడు. ఈ ఏడాది కాదు వరుసగా మూడేళ్లు వానలు కురవలేదు. తినడానికి తిండిలేక, పశువులకు మేత దొరక్క భూపతయ్య అల్లాడిపోయాడు. బాధను దిగమింగి పశువులను అమ్మివేశాడు. కానీ సీతమ్మ బేరగాళ్ల కాళ్లావేళ్లా పడి పశువులను తిరిగి తెచ్చింది. పొట్టనిండే దారిలేక.. కుటుంబీకుల పస్తులను చూడలేక గుండె చెదిరిన భూపతయ్య ఇల్లు విడిచి ఎటో వెళ్లిపోయాడు. భర్త కోసం దేశమంతా గాలించిన సీతమ్మ నిరాశతో కుమిలి కుమిలి ఏడ్చింది. ఒకప్పుడు ఎంతో గౌరవంగా బ్రతికినా విధిలేక సీతమ్మ రోడ్డు పనికి కూలీగా వెళుతుంది. బ్రహ్మయ్య ప్రవర్తనతో కలత చెందిన సీతమ్మ పనిమానుకొని ఇంటికి వచ్చింది. బ్రహ్మయ్య తన బాకీ కింద ఆవును, కోడెను తీసుకొన్నాడు. ఆ ఊళ్లో బ్రతకలేక సీతమ్మ బిడ్డను, మామను తీసుకొని ఊరు విడిచింది. తనలాంటి నిర్భాగ్యులెందరో ఆ గ్రామం నుండి వలసలు వెళ్లారు. కర్నూలు గంజి కేంద్రాల వద్దకు చేరి ఆశ్రయం పొందారు. అర్ధరాత్రి మామ గిలగిల కొట్టుకుంటూ మరణించాడు. దిక్కెవరులెరని విలపిస్తున్న సీతమ్మ వద్దకు వచ్చిన బ్రహ్మయ్య నా కోరిక తీర్చుమని అడిగినా కాదన్నావు. అందుకే నీకీ కష్టాలు.. ఇప్పటికైనా ఆలోచించుకో అని హెచ్చరిస్తాడు.

వద్దయ్యా ఈ పెద్దరికాలు వద్దీ మర్యాదా
కరువుకు తోడై మా కాపురమును గంగపాలు జేసి
సిగ్గువీడి నా శీలమునిప్పుడు చెరుపనెంచినావా
పరువుకోసం ఈ ప్రాణాలైనా బలిపెడతానయ్యా
ప్రాణము కోసము శీలమమ్ముకొను పాపిని కాదయ్యా

అంటూ విసిరి కొడుతుంది. ఇటువంటి కరువు పీడితులను రక్షించడానికి రచయితగా నాజర్ ఈ విధంగా సందేశమిచ్చారు.

ఓ తెలుగుబిడ్డదా వెలనాటి వీరుడా
లేవయ్యా లేచి రావయ్యా
గుమ్మాన యుద్ధప్రమాదం
దేశ నాయకులంతా సిగ్గు చేటుగా నేడూ
పదవులకూ గుద్దుకుంటున్నారు "ఓ తెలుగు"
ఓ తెలుగు బిడ్డ లేవరా
ఈ తెలుగు గడ్డా నీదేరా
ఈ పంట భూమీ నీదేరా
ఈ సంపదంతా నీదేరా
నీ తెలుగుదేశాన ప్రవహించు నీళ్లకు
వారసుడ నీవేర తెలుగోడా
పరువెంత వారైన గానీ
శిరమైన ఇస్తావు గానీ
గట్టు దున్నితే తన్నుతావు
చెట్టుకొట్టితే చెండుతావు
నీ కృష్ణ నీటినీ తీసుకెళ్లొద్దని
నిలవేసి అడగరా మొనగాడా
నదికి ఆనకట్టలే గడితే
నంది కొండన కట్ట కడితే
బంగారు పండించు తాామూ
అందాలు చిందించు తాామూ

తెలుగు రైతుకు నీటి వసతులే కల్పిస్తే
దేశానికే తిండి పెడతామూ
ముక్కోటి బలగమో రన్నా
ఒక్కటై నిలవాల రన్నా
ఆనకట్టలే వస్తవన్నా
ఆంధ్రరాష్ట్రమే వస్తదన్న
కలతలే విడనాడి కలిసి పోరాడండి
కష్టాలు తీరునురా తెలుగోడా

సమస్యల మీద సమైక్యంగా పోరాడందే పరిష్కారం లభించదని నాజర్ ఈ బుర్రకథ ద్వారా సందేశమిచ్చారు. ఆనకట్టలు కట్టినపుడే నీటి సమస్య తీరుతుందని వివరించారు.

ఈ బుర్రకథ కరుణరస ప్రధానంగా సాగుతుంది. రాయలసీమ ప్రాంతంలో వర్షాభావ పరిస్థితులను కళ్లకు కట్టినట్టు వర్ణించారు.

వరుసగా మూడేండ్లు నిండే "హరిహరి"
వానలచ్చట కురవకుండే ,,
ఏరువాకే సాగలేదు ,,
విత్తనాలే వేయలేదు ,,
అన్నదాతా రైతు ఆవురావురు మంటు
మిన్నువంకే జూచుచున్నాడా "హరిహరి"
మేతలేక పశువులన్నీ ,,
మెడలువంచీ సుడులు తిరుగ ,,
కోపుటెద్లకు భూపతయ్యా ,,
కొష్టమిప్పీ మేపెనయ్యా ,,
ఆవు కోడెల గోడు అంతంత గాదయ్యా
ఆఘోష చూడ లేమయ్యా
మేతలేని పశువులానూ "హరిహరి"
కోతకే తానమ్మ జూచె ,,
కోపుటెద్లకు బేరమిచ్చె ,,

కోడెనావును బేరమిచ్చె ,,
ఆవుకోడెలు బట్టి ఇస్తూ ,,
భూపతి ఆవురనే తానేడ్చి నాడూ ,,
ఇల్లాలూ ఏడ్చు చున్నదా ,,
నీతిగల యాయావు కోడె ,,
సీతమ్మనే జూచినాయా ,,
మోరలే పైకెత్తి కనులెంట నీర్గార్చి ,,
అంబాయని యేడ్చి నాయా ,,
ఆ తల్లి సీతమ్మ కేమో ,,
కడుపులో పేగు కదిలిందా ,,
గుండెల్లో గుబులు పుట్టిందా ,,
కెవ్వునా కేకేసి బిరబిరా పరుగెత్తి ,,
అమ్మ వద్ద వున్నాడా "హరిహరి"
ఆ తల్లి ఏడ్పు విన్నారా ,,
సీతమ్మ గోడు విన్నారా ,,
బేరాన్ని వదులుకొన్నారా ,,
కోడెనావును వీడినారా ,,

ఈ రగడలో రైతు తన ఇంట ఉన్న పశువులను ఎంత ప్రేమగా పెంచుకొంటాడో, విధిలేక అమ్మవలసి వస్తే ఎంతగా విలవిలలాడి పోతాడో కళ్లకు కట్టినట్లు వివరించాడు. అప్పుల వాళ్ల వేధింపులు పడలేక, అవమానాలను భరించలేక, ఆత్మాభిమానాన్ని చంపుకోలేక భూపతయ్య దూరంగా ఎటో వెళ్లిపోవడానికి నిర్ణయించుకొంటాడు.

కన్ను పొడుచుకున్న కనుపించని కటికరాత్రి వేళ
కరిచేపాము, కుట్టే తేలు కానరాని వేళ
దారిలేక ఏ దారి తోచకా ఊరు విడిచినాడు
ఊరిబైట పొలిమేర నుండి వెనుదిరిగి చూశాడు
పుట్టిపెరిగిన గడ్డను చూచి భోరున ఏడ్చాడు
ఆలుబిడ్డలా గతి ఏమని గగ్గోలు చెందాడు
అతడు గుండెను రాయి చేసుకొని ముందుకు నడిచాడు "తందాన"

కుటుంబ సభ్యుల ఆకలి తీర్చలేక నిస్సహాయంగా రోదిస్తూ దూరంగా వెళ్లిపోయే ఆ రైతన్న వ్యధను, గుండె కోతను విషాధభరితంగా నాజర్ వర్ణించారు. భర్త ఎటో వెళ్లిపోగా కుటుంబ భారాన్ని తలకెత్తుకొన్న సీతమ్మ రోడ్డు పనులకు కూలీగా వెళ్లింది.

పూవులమ్మిన గడ్డ మీదే కట్టెలమ్మినటుల
పోవుచున్నదీ బిడ్డనెత్తుకొని రోడ్డు పనికి తల్లీ
చీర ఉయ్యాల చెట్టుకు గట్టి బిడ్డనచట బెట్టీ
చేతులకాయలు కాయ రోడ్డు పని చేయుచున్నాది
అర్ధకూలితో అర్ధాకలితో అట్లే పనిచేసి
ఆయమ్మ బిడ్డను మామను కూడా సాకుచున్నాది

కూలీగా వెళ్లిన సీతమ్మపై బ్రహ్మయ్య కన్నువేశాడు. తన కోర్కె తీర్చమని బలవంత పెట్టాడు. కసిరిగొట్టిన సీతమ్మ పనినుండి తిరిగివచ్చింది. ఆ కోపాన్ని మనసులో పెట్టుకొన్న బ్రహ్మయ్య అప్పుతీర్చమని పీకమీద కూర్చొన్నాడు.

బాకీ కింద అవును దూడను పట్టుకొనెళతాను
అడ్డమురావే గొడ్డట నరికెద అంటూ బ్రహ్మయ్య
తిట్టుచు బూతులు ఆవును కోడెను పట్టుకెళ్లసాగే
ఆవును కోడెను ఎంతో ప్రేమతో పెంచుకొంటినయ్యా
కాళ్లు పట్టుకొని వేడుచుంటిని కనికరించుడయ్యా
కాళ్లు వదలవే భడవాయని పడదన్నెను బ్రహ్మయ్య
దయయనునది ఈ జన్మకు లేదని దడదడ వెళ్లాడు

అదంతా చూస్తున్న ముసలయ్యకు ఎంతో కోపం వచ్చింది కానీ పేద కోపము పెదవికి చేటని కోడలిని ఓదారుస్తూ!

అండలేని ఈ ఊరిలోనైనా ఉన్నదోసమమ్మా "తందానా"
కొండలనైనా పాకవచ్చునే అండఉన్నచోట ,,
వలిగుంటే తొలిగుండమంటరు కలికాలములోన ,,
వెళ్లిపోదమే వాడకైనా ఈ పల్లె పాడుగాను ,,

గుక్కెడు నీళ్ల కోసం, పట్టెడన్నం కోసం వలస పోతున్న సీతమ్మ స్థితిని హృదయ విదారకంగా వర్ణించారు.

సీ॥ నిప్పుచెరిగే ఎండ నిలదీసికాయంగ
కాళ్ల బొబ్బల నీరుకారు చుండె
మాటిమాటికి మగని మాట మదిలో దొర్లి
కన్నీటి కాల్వలో క్రాగుచుండె
కడుపులో సొద చేత పడిచెడి ప్రాణాలు
పాలిపోయిన తల్లి తూలుచుండె
వడగాలిపోతకు వత్తియై పసిబిడ్డ
దప్పిచే నోరెండి తల్లడిల్ల
చంకలో బిడ్డ పటుదప్పి జారుచుండ
ఎత్తుకొననామె కడుపులో ఎత్తులేదు
నడువలేరని పసిబిడ్డ నడువడాయె
ఉన్నసత్తువ బొత్తిగా ఉడిగెనయ్య

ఆకలిదప్పులకు తట్టుకోలేక మృత్యుముఖంలో గిలగిల కొట్టుకొంటున్న ముసలయ్య దయనీయ స్థితిని గుండెను పిండేలా వర్ణించాడు.

వృద్ధుడు పాపం ఎండుటాకు వలే రెపరెపలాడెనురా "తందానా"
మామా మామాయని ఏడ్వసాగెను మానవతి సీత ,,
మామా నీవే తల్లిదండ్రివని మదిలో తలచానే ,,
మాయజేసి మమ్మొంటిగ విడిచి పోయితివి మామా ,,

మామశవంపై పడి రోదిస్తున్న సీతమ్మ వద్దకు వచ్చిన బ్రహ్మయ్య నన్ను కాదన్నందుకు నీకెన్ని కష్టాలు వచ్చాయో చూడు అన్నాడు. ఈ సన్నివేశంలో మానవతి సీతమ్మ మాటలు, మానసిక సంఘర్షణ అత్యద్భుతమైన నాటకీయతగా నాజర్ చిత్రించారు.

వద్దయ్యా ఈ పెద్దరికాలు వద్దీ మర్యాదా "తందానా"
కరువుకు తోడై మాకాపురమును గంగపాలు జేసి ,,
సిగ్గువీడి నా శీలమునిప్పుడు చెరుపనెంచినావా ,,
పరువుకోసం ఈ ప్రాణాలైనా బలిపెడతానయ్యా ,,
ప్రాణము కోసము శీలమమ్ముకొను పాపిని కాదయ్యా ,,
ఆ మాటలు విన్న బ్రహ్మయ్య .

శీలంగీలం చింతకాయలని చెబుతారేయనుకో "తందానా"
పాపము కదు పసిపాపడు వీడు వీణ్ణి చంపుతావా ,,
పోయిన మగడూ పోయినాడూ మరిరాడు తిరిగిరాడు ,,
చచ్చిన మామ చచ్చినాడు తిరిగొచ్చుట దుర్లభమే ,,
చూడు సీతా ఈ చుట్టుపట్లబడి యున్న పీనుగులను ,,
నేడోరేపో నీవు కూడా ఇట్లగుట నిశ్చయంబో ,,
అప్పుడు నీమురిపాలపాపడే పీనుగమీద పడునో ,,
ఈ మాటలను విన్న సీతమ్మ గుండె కరిగి నీరై పోయింది.
పెంచుకొన్న తనయావు పోయెనా "రామరామ"
ప్రేమగల్లా తనకోడే పోయెనా ,,
చేసుకొన్న తన భర్తే పోయెనా ,,
చేనుచెట్టు చేజారి పోయెనా ,,
చివరికి దు:ఖము మిగిలిపోయెనా ,,
చంటిబిడ్డనొక కంట చూచుకొందా ,,
అప్పుడు ఆ బిడ్డ తల్లితో
బువ్వపెట్టవే అమ్మా ఆకలి బువ్వపెట్టవే "తందానా"
బువ్వపెట్టి నాకెన్నాళ్లాయెనే తువ్వన్నా ఇయ్యమ్మా ,,
యేమిజేతురా కొడుకా నేనిపుడు ఎందు దూకుదునురా ,,
ఇందరి మ్రింగి బ్రతికినా నా బొంద పాడుగానూ ,,
నీతులు సెప్పే పెద్దల్లారా నిజం చెప్పుడయ్యా ,,
కూటికి చచ్చే వాడేలేదని చాటిచెప్పుతారు ,,
పెట్టకమానదు పుట్టించిన వాడంటారే మీరు "తందానా"
తిండి లేని మా చావు బ్రతుకూ తెలియద దేవునికి ,,
మానమా బిడ్డ ప్రాణమా రక్షణ మార్గమేది నాకు ,,
రివ్వున బోయెడు బ్రహ్మయ్య బండి మువ్వల మోతలలో ,,
బిడ్డ ఏడుపా బ్రహ్మయ్య గారికి వినపడ లేదాయే ,,

బుర్రకథా ప్రక్రియ ఎక్కువభాగం రగడలతో నడుస్తుంది. దీనితోపాటు సందర్భం వచ్చిన చోట్ల నాజర్ జానపద పాటలను రచించి గుదిగుచ్చేవారు. జానపద పాటలను

ప్రేక్షకుల గుండెలను మెలిపెట్టే విధంగా పాడడంలో నాజర్‌కు సాటి రాగల కవి మరొకరు లేరు.

రైతన్నల జీవితాల్లో సిరులు కురిపించడానికి ఏరువాక వస్తుంది. తొలికారు వర్షాలకు తడిసిన నేల పచ్చి బాలింతరాలుగా ఉంటుంది. ఆ తరుణంలో రైతన్నలు దుక్కిదున్నుతూ ఆనందంగా పాడుకొనే పాటను నాజర్ రచించిన తీరు జానపద సాహిత్యానికే తలమానికంగా నిలుస్తుంది.

కురిసెరా తొలకరీ ఓరన్నా
కోటేరు వేయరా రైతన్నా
కరువుతో దేశంబు
సురిగిపోతున్నాది
పరువులా ఏర్వాక
పరుగెత్తి వచ్చింది
పంట పైరేయరా ఓరన్నా
ప్రజల బ్రతికించరా రైతన్నా
వజ్రాలు పండెడి
వరలక్ష్మి నీబిడ్డ
రాజనాల పంట
రాలురా నీ ఇంట
బ్రతుకు రవ్వల బంతి ఓరన్నా
చితికి పోనీకురా రైతన్నా
నీగాటి బసవన్న
నీతోటి కూలన్న
నీకు తోడౌతారు
మాకు తిండంటారు
దబ్బాశ పడకురా ఓరన్నా
ఇబ్బంది పడతావు రైతన్నా

కుప్ప నూర్పిళ్ల సమయంలో శ్రమ జీవులు ఆడిపాడుతూ పనిచేసే తీరును పాటలో బంధించిన నాజర్‌లో ఆకుపచ్చ సూర్యుడు ప్రత్యక్షమౌతాడు.

వలియవలియో వలియా
రావేలుగలవాడా రార పొలిగాడా
పండిపెరిగిన పంటతల్లి
జీవులను బ్రతికించుతల్లి
కల్లమంతా కాలు మునగాలి "వలియో"
చేలుపండే మూల నిండా
పల్లెపట్టు చల్లగుండ
రాజనాల రాశిపెరగాలి "వలియో"
బంతినున్న బసవన్న
పొలితిరిగే చేనమాల
కాటకాలను కాలదన్నాలి "వలియో"
గాట ఎద్దులు బంతిగట్టి
కూలిరైతులు గొంతుకలిపి
పొలిగలుగ వలియ గలపండోయ్ ,,

బిడ్డలకు లాలపోసి జోలపాడే తల్లి ప్రేమను రంగరిస్తూ నాజర్ వ్రాసిన పాట ప్రేక్షకులను పసిపాపలుగా చేసి నిజంగానే ఉయ్యాలలూపుతుంది.

లాలి నాబంగారు కొండ
నా తంఢ్రీ పాలు త్రాగుము బొజ్జనిండా
నీకు తమ్ముడు పుట్టెనంటా
నా తంఢ్రీ నీకు తోడుగ ఆడునంటా
వెండి గజ్జెలు నీదు మొలకు
పవిడి మువ్వలు తమ్ము మెడకు
ఘల్లు ఘల్లున నాడుతారా
నాతంఢ్రీ కలిసి సుఖములు పొందుతారా "లాలీ"
విద్యలన్నీ నేర్చుతారా
నా తంఢ్రీ బుజ్జాయి అరక కడతావా
రతనాలు పండించు తారా
నా తంఢ్రీ స్థితిగలిగి జీవించుతారా

"ఉన్నవాడికీ అరగని జబ్బు, లేనివాడికీ ఆకలి జబ్బు, ఉండి లేని మధ్య రకానికి ఒకటే అప్పుల జబ్బురా" అన్నాడోకవి. మధ్య తరగతి మనిషికి భేషజం ఎక్కువ. ఆత్మాభిమానం అంతకన్నా ఎక్కువ. ఆకలిని పళ్ల బిగువున భరించడానికి సిద్ధపడతాడు. కానీ ఆకలి ఒక మహమ్మారి శక్తి. మనిషిని నిలువునా నీరు చేస్తుంది. జానెడు పొట్టలో నిలువెత్తున లేచే ఆకలి మంటలను చల్లార్చు కోవడానికి మనిషి ఏ ఆత్మాభిమానంతో బ్రతికాడో చివరకు దానిని కూడా వదులుకోక తప్పని స్థితి వస్తుంది. తెలుగు సాహిత్యంలో ఆకలి బాధలు, దారిద్ర్యంపై ఎన్నో వందల పద్యాలు, పాటలూ, గేయాలు వచ్చాయి. కానీ నాజర్ వ్రాసిన "ఎట్లా ఈ కాపురము" అనేపాట అన్నింటికన్నా మొదటి వరుసలో నిలబడుతుంది. మామూలు సాదాసీదా వ్యవహారిక పదాలతో వ్రాసిన ఈ పాట ఆంధ్రదేశాన్ని నిలువునా కదిలించింది. కరిగించింది. నేటి రాయలసీమ బుర్రకథలో రచించిన ఆ పాటలో మధ్య తరగతి మనిషి దైన్య, హైన్య స్థితిని వర్ణించిన తీరు అద్భుతం. నాజర్ బుర్రకథ చెప్పిన ప్రతిచోటా ప్రేక్షకులు అడిగి మరీ ఈ పాటను పాడించుకొనే వారు. ఔత్సాహిక ప్రజా గాయకులందరూ ఆ పాటను తప్పనిసరిగా నేర్చుకొని పాడేవారు.

ఎట్లా ఈ కాపురమూ
ఏసెరోసురో బడి చేతామన్నా "ఎట్లా"
కాపురమంతా కరువుల సంతా
జీవితమంతా అతుకుల బొంతా
గాలికొంపలో ఖాళీ కుండలు
చాలీ చాలని రేషన్ కూలిగింజలు "ఎట్లా"
ఉప్పుంటే పప్పుండదుయంటూ
ఎప్పుడు అప్పెవరిస్తారంటూ
పూటపూటకూ చాటబట్టుకొని
గడపగడప గాలించే దెట్లా "ఎట్లా"
చేతామా పని లేనేలేదు
తిందామంటే గింజలు లేవూ
చచ్చే చావో బ్రతికే బ్రతుకో
అంతూ పొంతూ అగుపడ దెంతకూ "ఎట్లా"

ఈ పాటలోని పల్లవిని అనంతరకాలంలో "ఎన్నాళ్లీ కాపురాలు ఏసెరోసురోబడి సేద్దామన్నా" అని మార్చారు.

నేటి రాయలసీమ బుర్రకథలో నుప్పితము (ఇష్టము), పెయ్య (ఆవుదూడ) గొర్రు (వ్యవసాయ పనిముట్టు), ముల్లుగర్ర (వ్యవసాయ పనిముట్టు), కోపు టెడ్లు (కోడెద్దులు), మోర (మూతి), యాగాని (పైసా), భడవా (తిట్టు), బువ్వ (అన్నము) వంటి గుంటూరు జిల్లా మాండలిక పదాలను ప్రయోగించారు. ఈ బుర్రకథను పల్నాటి యుద్ధం తరువాతి కాలంలో రచించారు. ఈ కథను కూడా 1000 చోట్లకు పైగా చెప్పారు.



# 8

# బొబ్బిలి యుద్ధం



**కరుణ రసాన్ని వర్షిస్తున్న నాజర్**

"బొబ్బిలి దుర్గంలో ఏ బురుజును ప్రశ్నించినా.. ఆ స్మరణం అగ్నికణం - నెత్తురు ఉడికిస్తుంది. ఒళ్లు జలదరిస్తుంది." అని కవులు కీర్తించారు. బొబ్బిలి యుద్ధం గురించి ఎన్నో కథలు వాడుకలో ఉన్నాయి. బొబ్బిలి వీరుల పరాక్రమాలను జానపద కళాకారులు వాడవాడలా అద్భుతాంశాలతో ప్రచారం చేశారు. బొబ్బిలి సంస్థానాధీశులు రావు వారు. వీరు రేచర్ల గోత్రజులు. 1757లో బొబ్బిలి యుద్ధం జరిగింది.

విజయనగరం 1300 గ్రామాల సువిశాల సంస్థానం కాగా బొబ్బిలి 250 గ్రామాల చిన్న రాజ్యం. కానీ అరివీర భయంకరుడైన బొబ్బిలి రంగారావుపై కన్నెత్తి చూడడానికి శత్రువులు సాహసించ లేకపోయారు. విజయనగరం మహారాజు పూసపాటి

విజయరామరాజు బొబ్బిలి కోటపై కన్నువేశాడు. ఫ్రెంచి దొర బుస్సీదొర, నైజాం ప్రతినిధి హైదర్‌జంగ్‌లను విజయరామరాజు బొబ్బిలి దొరలపై ఉసిగొల్పుతాడు. 1757 జనవరి ఇరవైనాలుగున బొబ్బిలి యువరాజు వెంగళరాయుడి వివాహ వేడుకలు జరుగుతున్న సమయంలో యుద్ధమేఘాలు కమ్ముకొన్నాయి. ఈ యుద్ధంలో రంగారాయుడు, వెంగళరాయుడుతో పాటు బొబ్బిలి వీరులు నేలకొరిగారు. నరసారాయుడి బావమరది తాండ్ర పాపారాయుడు విజయరామరాజును వధించి పగతీర్చుకొన్నాడు. ఈ చరిత్రపై ఎన్నో కట్టుకథలు ప్రచారంలో ఉన్న సమయంలో నాజర్ ఈ కథను బుర్రకథగా రచించడానికి పూనుకొన్నారు. శ్రీకాకుళం ప్రాంతంలో బుర్రకథలను చెప్పే సమయంలో బొబ్బిలి కథను వ్రాసి చెప్పమని కోరిన మీదట నాజర్ కథారచనకు ఉపక్రమించారు. అన్నాబత్తుల నారాయణమూర్తి, భాస్కరరావుతో కలిసి బొబ్బిలి, విజయనగరం ప్రాంతాలలో తలపండిన మేధావులతో బొబ్బిలి యుద్ధ నేపథ్యాన్ని క్షుణ్ణంగా పరిశోధించారు. ఆరునెలల పరిశోధన అనంతరం బొబ్బిలి యుద్ధం కథను నాజర్ రచించారు.

బొబ్బిలి యుద్ధంపై అప్పటి వరకూ వచ్చిన కథలకు భిన్నంగా నాజర్ రచన చేశారు. విజయనగర రాజుల ఈర్ష్య అసూయలే బొబ్బిలి రాజుల పతన హేతువు అనే నానుడికి భిన్నంగా వాస్తవ చరిత్రను రచనలో ప్రతిబింబించారు. బొబ్బిలి ప్రభువు రంగారాయుడి తమ్ముడు వెంగళరాయుడు అన్న మాటను కూడా వినకుండా పన్నెండు మంది పాలికాపులతో ఆకులకట్ట అడవికి వేటకు బయలుదేరాడు.

గట్టిగా పాగాల్ జుట్టీ
గజ్జెలా చెడ్డీల్ గట్టి
బారు ఈటెలు చేతబట్టీ
పారసి గుర్రాల నెక్కి
కాపులే తన వెంట సాగారా — "నారాయణ"
రావు వెంగళరావు కదిలాడా — ,,
ఆకులా కట్టడివిలోనా — ,,
చాకచక్యము తోడవారూ — ,,
కొండకోనల వెతికినారూ — "నారాయణ"
బండలా గాలించినారూ — "వహ్వారే"
గూళ్ల పక్షుల గుంపు లేచే — ,,

కొంగలే కోలాట మేసే ,,
నక్కలే నాట్యాలు దొక్కే ,,
పందికొక్కులు డోలుకొట్టే ,,
చెట్టుగుట్టలెక్కి చూశారా "నారాయణ"
కొట్టెరా పరదేశి పందినే ,,
హూంకరించే ఘీంకరించి ,,
కోరలో చిట్టడవి ద్రుంచి ,,
చెంగు చెంగున చెంగలించి ,,
పంది ఒరవడి ఉరవడించి "వహ్వారే"
ఆకులా కట్టడివి దాటింది "నారాయణ"
శత్రులా కోడేరు చేరిందా ,,

వచనం: ఎప్పుడైతే ఆ పంది బొబ్బిలి వారి సరిహద్దు దాటి విజయరామరాజుకు చెందిన కోడేరు అడవికి చేరిందో అప్పుడు సరిహద్దు నందు కాపలాగా ఉన్న విజయనగర వీరులు.

రివ్వురివ్వున పరుగుబెట్టీ
ఎవ్వరెవ్వరంటు వచ్చీ
బాకులు బల్లాలు దూసీ
బాటకడ్డు వచ్చి నిలిచీ
పట్టరాదీ పంది నన్నారా.. "నారాయణ"
వచ్చినా దారెళ్ల మన్నారా..
అది వినీ వెంగళరావూ
కాగ్రహంబతిశయించె నయ్యా
అదనిదీ కాదని కోపంబును
దిగమింగి వేసెనయ్యా..

వచనము : అప్పుడు కోపానికిది సమయం కాదని భావించిన రావు వెంగళరావు పన్నెండు మంది పాలికాపులతో పుట్టెడు పరాభవంతో పట్నానికి తిరిగి వచ్చాడు. కానీ ఆ రాత్రే కోడేరు తగలబడిపోయింది. ఈ సమయంలో విజయరామరాజు

కాలిపించే కోడేరును బొబ్బిలి "తందానా"
పేలిపించె కోడేరును బొబ్బిలి ,,
సాధించెదనే బొబ్బిలివారీ ,,
తీసెదనే దెబ్బకూ దెబ్బా ,,
సేనలంపమని నైజాము ప్రభువులా ,,
సాయమ్మునే కోరినాడా ,,

వచనం: అప్పుడు విజయరామరాజు తన అన్న కుమారుడైన ఆనందరాజుతో "నాయనా ఆనందరాజా బొబ్బిలిని సాధించుటకు అదను చిక్కినది లెమ్మని" చెప్పాడు. పన్నులకని నారాయణపట్నం పొమ్మని అన్నాడు.

పన్నును దారిలో వ్యూహమూ
దారిలో బొబ్బిలి ఉన్నదీ అన్నాడా
సైన్యముతో ఆ బొబ్బిలీ
పంటలే పాడుచెయ్యవయ్యా
ఎట్టులైనా ఈ నేరమంతా
బొబ్బిలి నెత్తి నేయుమయ్యా

వచనం: అదివిని ప్రధానమంత్రి బుర్రా బుచ్చన్న "మహారాజా తుమ్మల గుంటా యుద్ధం మనకపుడు నమ్మిరాకపోయే.. వమ్మయి పోయెను బలుసుపాటి యుద్ధమ్మున మనసేన" అన్నాడు. విజయరామరాజు "సంతృప్తి లేని బ్రాహ్మణుడు, తృప్తి చెందిన క్షత్రియుడు, లజ్జాశీలియగు వేశ్య, లజ్జలేని కులాంగన చెడుదురని పెద్దలన వినలేదా.. కనుక యుద్ధాలలో జయాపజయాలు రెండు సంభవమే. అంతమాత్రాన సైనికులు మరణించారనీ, అపజయం కలిగిందీ అని భయపడి క్షత్రియులు యుద్ధధర్మాన్ని వీడరు".

రాజ్యకాంక్షతో రణమున చావని రాజెవడున్నాడా
భారతయుద్ధము జరిగిన హేతువు రాజ్యకాంక్ష కాదా
వాలి చావు సుగ్రీవుడు కోరుట రాజ్యకాంక్ష కాదా
రాజ్యము కొరకై విభీషణుడు లంకకు చేటు తెచ్చెగాదా
నీతులెన్ని వర్ణించిన జరిగిన నిజమిదియన్నాడా

అడ్డము వస్తే బుద్ధి చెప్పుము బొబ్బిలి కన్నాడా

తగాదా పెట్టుకొని తడాఖా చూపుము తనయా అన్నాడా

ఆనందరాజు బొబ్బిలి పరగణాలలో ప్రవేశించాడు. అక్కడ. భీభత్సకాండ సృష్టించాడు. ఆక్రోశంతో ప్రజలు రంగరాయని వద్దకు వెళ్లి

రంగరాయా.. రంగరాయా అయ్యా

భంగమాయెనె బ్రతుకు రంగరాయా

మేతేదీ పశువులకు రంగరాయా

మేమెట్లు బ్రతికేమూ రంగరాయా

ఆపదలూ వచ్చాయి రంగరాయా

బిచ్చమెత్తితే మెతుకు రంగరాయా

చచ్చుటే మేలయ్యా రంగరాయా

ఆకొన్న వారికే రంగరాయా

అన్నాలు బెట్టాము రంగరాయా

చెయ్యెత్తి దానాలు రంగరాయా

చేశాము లేదనక రంగరాయా

ఆకలెరుగము మేము రంగరాయా

శోకమెరుగము మేము రంగరాయా

రామరాజు సేన రంగరాయ

నీమాలు మరిచేనా రంగరాయ

సాజు పరుగు దీసే రంగరాయ

పైరు పాడయింది రంగరాయ

మెతుకూ కరువై పోయె రంగరాయా

తిరుపాల బ్రతుకాయె రంగరాయా

అని రైతులు మొరపెట్టుకొనగా రంగారాయుడు కలత చెందాడు.

తాలిమి తాలిమి దాతలారా నా కూలి రైతులారా

తిరిపిమెత్తనేల మీకీ దీనత నేడేలా

గోనెలాదిగా కోటలో ధాన్యము

కొలిపించెదనే పాటక జనులకు "తిరిపె"

పంటలు బోయిన భూమికి బంగరు భూమికి

పన్నులు మిమ్మీ ఏటికి అడుగము "తిరిపె"

వచనం: అప్పుడు నారాయణ పట్నం నుండి పన్నులు వసూలు చేసి వస్తున్న ఆనందరాజును బొబ్బిలి పొలిమేరల్లో నిలిపివేసి తనకు జరిగిన నష్టానికి పరిహారం కట్టించుకొన్నారు. తిరిగి వచ్చిన ఆనందరాజును విజయరామరాజు

పాడుజేస్తివా నందరాజా పన్నడగన్నాడా

పోరుచేయమని చెప్పిపంపితే పారివస్తివటరా

ఏరా చస్తే నిన్ను నమ్మినే నెన్నో బొంకానే

మీరిపోయెనా బొబ్బిలి దుండగ మీనాడన్నాడా

దారిన పన్నుల కెళ్లితే వారితో తగవేనన్నావే

పాదుషాకాడ నా మాటలన్నియు పచ్చికల్లాయన్

వచనం: నారాయణ పట్నం నుండి పన్నులు తెస్తున్న ఆనందరాజును బెదిరించి బొబ్బిలి వారు ఆపన్నులు కాజేశారని విజయరామరాజు నైజాం నవాబుకు కబురు పంపి,

కోడి పందెముకు వెంగళరాయుని రమ్మని కబురంపె

రోసమున్న పడి పుంజులున్న వడి తెమ్మని కబురంపె

వచనము: ఆ వర్తమానమును విన్న రంగారాయుడు

"తమ్ముడా వెంగళరాయుడా! బొబ్బిలి పెద్దలారా వారు ఏదో విధముగా కయ్యమును పెంచ చూచుతున్నారు. అలనాడు కోడేరును కాల్చి చంపించిందీ మనమేననీ నారాయణ పట్నం నుండి పన్నులు తెచ్చు ఆనందరాజును అన్యాయంగా దోచుకున్నామని ఇంకా ఈ విధమైన అనేక నేరాలు ఆరోపించి నైజాము నవాబును మనకు వ్యతిరేకముగా యుద్ధమునకు రెచ్చగొట్టు జూచుచున్నారు. కనుక ఈ పరిస్థితులలో వెంగళరాయా ఈ కోడి పందెములకు వెళ్లడం శ్రేయస్కరం కాదని" చెప్పగా అందుకు వెంగళరాయుడు, తాండ్రపాపారాయుడు

పోతుగడ్డయను బిరుదు పోవునే "తందానా"

పోరుకు పోవలె బొబ్బిలి పుంజులు ,,

వచనము: కోళ్ల పందెములు జరిగే సమయములో
ఎందుకురా మీ అదరిపాటు లింకెన్నాళ్లన్నాడా
ముందున్నదిరా ముసళ్ల పండుగ మురుపేలన్నాడా
దున్నించెదను బొబ్బిలిపట్నం దుక్కిగనన్నాడా
కన్నులురిమి యా తాండ్రపాపారావు గస్సుమనుచు లేచి
బొబ్బిలి పట్నం దుక్కిదున్న నీ యబ్బ తరంగాదు
మాదు పట్నమును దున్నక ముందే బాకున కుమ్మెదనా
కోడిపోరు రారాజుల పోరుగ మారనీయకండో
కోడిపోరుతో నాశమాయెగా నాడు పల్లనాడు
పోవుదమింక చాలీ పందెములనె రావురంగారావు

బొబ్బిలి యుద్ధం కథను గూర్చి రకరకాల కట్టుకథలు రాజ్యమేలుతున్న రోజులలో నాజర్ స్థానికంగా ఎన్నో ఊళ్లు తిరిగి వాస్తవ కథను వెలుగులోనికి తెచ్చాడు. మొదటి కథను విజయనగరంలో విఘ్నేశ్వర ఉత్సవ వేదికపై చెప్పే సమయంలో చిత్రమైన సంఘటన జరిగింది. విజయనగర వీరబొబ్బిలి చరిత్రమ్ము అని కథను ప్రారంభించారు. ఈ మాట వినగానే ప్రేక్షకులు కోపంతో లేచి ఎవడ్రా ఇక్కడ బొబ్బిలి కథ చెప్పేది అంటూ అరచి అడ్డు తగిలారు. అప్పుడు నాజర్ వినమ్రంగా "సోదర సోదరీ మణులారా కాలినడకతో తిరిగి ఈ కథాంశాలను ఆరునెలలు సేకరించాను. నేను ఎవ్వరి వాడను కాను. పింజారీని. ఈ కథ విని తప్పని తోస్తే ఇక్కడే చించి మళ్లీ వ్రాస్తాను. బాగుందని శభాష్ అంటే ప్రింట్ వేస్తాను" అని పలికాడు. కథ చెప్పడానికి అంగీకరించారు. మూడు గంటలు నిశ్శబ్దంగా కథ విన్నారు. కథలో సంగీతం, సాహిత్యం, హావభావాలు, నటన, భాస్కరరరావు హాస్యం ఎంతో పుష్టిని కలిగించింది. చీమ చిటుక్కుమనకుండా విన్నారు. ఈ ఊళ్లో ఇంత వివరంగా ఏ కథా చెప్పలేదని అందరూ పొగిడారు. విజయనగరం, బొబ్బిలి రాజుల మధ్య వైరానికి కారణం కోడి పోరు కాదని, పంట పొలాలు, నీళ్ల కోసం అని మావాళ్లు కూడా మాకు చెప్పలేదన్నారు. వెంగళరావు పందివేట ఉదంతం ఇంతవరకు మాకు తెలియదని రాజుల బిడ్డలు తెలిపారు. విజయనగరంలో బొబ్బిలి రాజుల కథను చెప్పిన మొదటి కథకుడు నాజర్ అని అందరూ ప్రశంసించారు. బొబ్బిలిలో కూడా ఈ కథను చెప్పి అక్కడి స్థానికుల ప్రశంసలు పొందారు.

ఈ బుర్రకథలో వీర కరుణ, బీభత్సరసాలు ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయి. బొబ్బిలి, విజయనగర రాజుల మధ్య ఉత్కంఠ భరితంగా జరిగిన కోడిపోరును వీరరసోద్రేకంగా వర్ణించారు.

బొబ్బిలి పర్లా లెత్తిరా "సై"
ముప్పిరి నెమళ్ల నెత్తిరా ,,
రంగూన్‌రేజా లెత్తిరా ,,
నైజాం ఫిలా లెత్తిరా ,,
అప్లీ పుంజులెత్తెరా ,,
నల్ల జానకత్తు లేరిరా ,,
సానలమీద సాదిరా ,,
సాగి మన్నెమునకు వచ్చిరా "భళానంటి"
వచనం: విజయనగరం వారు కూడా
పచ్చ కాకులన్ బట్టెరా "సై"
అచ్చుగా డేగల బట్టెరా ,,
ఇరాను నెమళ్ల నెత్తిరా ,,
రీగరాల వడినెత్తిరా ,,
వచనము: అప్పుడు ఇద్దరు పందెగాళ్లు
లెఖ్ఖతాడులే తీసిరా "సై"
ఒక్కొక్క పుంజును చూచిరా ,,
ఈక వరుసనే జూచిరా ,,
ఇలపై పుంజులు దించిరా "భళాభళి"
విజయనగర పచ్చకాకిరా
విసురగ పారే జాతిరా
బొబ్బిలి పర్లా గాచిరా
దారగా రక్త మొలికిందా

వచనము: విజయనగరం వారి పుంజు బరిలో ఒరిగిపోగా బొబ్బిలి వారి వెంట వచ్చిన సుద్దులవారు

బొబ్బిలి కోళ్లకు రోసాలెక్కువ
బొబ్బిలి దొరలకు మీసాలెక్కువ"

వచనము: అని రెచ్చగొట్టారు. ఆ మాటలను విన్న విజయనగరం వారు

| | |
|---|---|
| విజయనగర మిత్ర వీగెనా | "సై" |
| గుబగుబ గుబ్బట్లాడెరా | |
| ముప్పిలి నెమల్ని దించిరా | |
| ఇప్పుడు రమ్మనమన్నారా | "భళానంటి భాయ్" |
| ముప్పిరి నెమలే నాయనా | "సై" |
| కోక్కొకొక్కోయని కూసెరా | ,, |
| తాండ్ర పాపారావు లేచెరా | ,, |
| అస్లీ పుంజులు దించెరా | ,, |
| తాండ్ర వారి పుంజెగిరిందా | ,, |
| రెండే పట్టులు గొట్టిందా | "భళానంటి భాయ్" |
| ధారగా రక్తం ఒలికిందా | "సై" |
| రాజుపుంజు పడిచచ్చిందా | "భళానంటి భాయ్" |

ఈ సన్నివేశంలో పందెంలో వేసే పచ్చకాకి, ముప్పిరి నెమలి, అస్లీ పుంజు, నైజాం ఫిలాలు వంట కుక్కజాతి విశేషాలను నాజర్ పేర్కొన్నారు. యుద్ధరంగంలో బొబ్బిలి వీరుల పరాక్రమాన్ని వళ్లు గగుర్పొడిన రీతిలో వీరరసభరితంగా వర్ణించారు.

| | |
|---|---|
| పఠాల్ రామన్న లేచెరా | "సై" |
| పఠా కత్తి ఝుళిపించెరా | ,, |
| ముత్యాల పాపన్న చూసెరా | ,, |
| ముకుంద బల్లెం దూసెరా | "భళానంటి భాయ్" |
| భేరీ రామన్న లేచెరా | "సై" |
| భేరీ స్త్రీలనదల్చెరా | ,, |
| ధీరత వడిశాల్లందెరా | ,, |
| కారమే అడ్డొళ్లు గట్టారా | "భళానంటి భాయ్" |
| వీర సైనికుల్లేచిరా | ,, |
| పారసి గుర్రాల్లెక్కిరా | ,, |

గుర్రాలు సైగల నందెరా ,,
కాలుగీటి సకిలించాయా "భళానంటి భాయ్"
తధిగిణతోం గుప్పట గుప్పట దూకాయా
పిప్పిగ శత్రుల దొక్కాయా "భళానంటి భాయ్"
కత్తిగుండెలో గుచ్చారా
చిటపట చిటపట వడిశల రాళ్ళు
చిత్తజల్లుగా కురిపించారా "భళానంటి భాయ్"
పెఠిల్ పెఠిల్‌మని శత్రు శిరస్సులు పెట్లు చుండెనన్నా
పఠాకత్తితో కుమ్మి చిమ్మెరా పఠాల రామన్న
ముకుంద బల్లెం కుమ్మి చిమ్మెరా ముత్యాల్ పాపన్న
ముక్కముక్కలుగ శాత్రువులను రామక్క నరికెరన్నా
వచనం: యుద్ధంలో స్వయంగా పాల్గొన డానికి తనకు అనుమతినివ్వమన్నాడు.
లేనిచో వెంగళరాయుడు తన అన్నతో
పంచుపంచు నాకొచ్చే కత్తుల్
ఎంచుఎంచు నాకొచ్చే సేనల్
ధాన్యము.. ధనమెందుకు నాకు
దాచుకోండి తినడానికి మీకు
తెలగబిడ్డడా తెగించి రారా
వెలమబిడ్డడా ఎగబడవేరా
బానిస బ్రతుకులు బ్రతకొద్దర్రా
సోమరి శుంఠలు కావద్దర్రా
జై ఆంధ్ర మాతాకు జై "భళానంటి"
మడెందన్నగా బొబ్బిలి గుర్రం మబ్బుల కంటిందా
రణం రణంబని వెంగళరాయుడు రణమున కురికాడా
ఆగుమాగుమని లాడూంఖానుం డడ్డమొచ్చినాడా
రారా రమ్మని లాడూ వెంగళరావు లాగ్రహమునా
పోరా పోరీ ఢాల్ కత్తులూ త్తళత్థళ మెరయా
వీరావేశా నిద్దరీటెలన్ కుమ్మిచిమ్ముకొనిరా

అమ్మా అని ప్రాణాలు వీడినాడపుడు లాడూచాన్
దిమ్మతిరిగి పడిపోయె ధరణిపై రావెంగళరావు
వచనం: రణ క్షేత్రంలో రంగారాయుడి పరాక్రమాన్ని గూర్చి వర్ణిస్తూ
సత్రున ఖడ్గం దూసి దండుపై తారసిల్లినాడు
అత్రులు తెగి గుర్రాల పుర్రెలు ధరణిదొర్ల నరికె
కండలు మొండెలు గుండెలు ప్రేవులు తుండెములైజారి
దండధరుని వలె తుండె తుండెములు ఖండిస్తున్నాడా
జబ్బలు బొబ్బలు రక్తం గ్రక్కుచు దిబ్బలు దిబ్బలుగా
సిబ్బందిని పడనరుకుచుండె నాబెబ్బులి రంగరావు
తట్టకోటలో పరాసు దండును తరిమె రంగారావు
పుట్టకోటలో పరాసు దండును పొడిచె రంగారావు
మూల బురుజులో పరాసు దండును కూల్చె రంగారావు
కలవరింతలతో పరాసు దండు కలవరపడసాగె
అబ్బో అయ్యో మొర్రో అంటూ నరచుచు శాత్రవులు
పాలకొండలకు పారజూసే నాబుస్సీ రామరాజులే
రారారమ్మనీ రంకెలు వేయుచు రావు రంగారావు
పెఠిల్ పెఠిల్‌మని కక్కరిల్లుచునే పఠాకత్తి దూసి
తెప్పరిల్లి యాలాలు ఖాన్‌పై కుప్పళించి దూకి
దెబ్బకు నరికెను లాలు ఖాను తలదొర్లె ధరణి పైన
హైదరజంగును హతమార్చగ తానురుకుచు రంగారావు
బొబ్బిలికోట వల్లకాడుగా
మారిన విషయాన్ని తెలుసుకొన్న తాండ్ర పాపారాయుడు
దున్నించితివా బొబ్బిలి పట్నం విజయరామరాజా
దున్నకమున్నె నిను నా బాకున కుమ్ముచు నున్నాడా
నారసింహుడా హిరణ్యకశిపు చీరిన చందాన
ఆరక పగ చల్లారక ఎన్నో బాకు పోట్లు పొడవ
విలవిల తన్నుకు వీడె ప్రాణములు విజయరామరాజు
కలగన్న కల్లాంకు కోరికలు గాలిమేడ లాయె

బుర్రకథా ప్రక్రియలో వీరరస పోషణలో నాజర్‌కు సాటిరాగల వారు ఈ శతాబ్దంలో లేరంటే అతిశయోక్తి లేదు. కరుణ రసగంగాతరంగాలను వెల్లువలా పారించడంలో అటు రచనలోనూ ఇటు ప్రదర్శనలోనూ నాజర్ సిద్ధహస్తుడు, యుద్ధ సమయంలో వారసుడైన చిన వెంకటరంగారాయుని దాసి వెంకట లక్ష్మికి అప్పగించి బిడ్డను చూచి విలపిస్తున్న మల్లమదేవి

ఎన్నిచేసి ఏదేశమేలనున్నాడో నమ్మా
కన్నుల ముందీ కసుగందువు కడతేర చూడలేనే
దక్కించవమ్మా ఒక్కగాని ఒక దిక్కని అన్నాదా
దాసివిగానీ వంశమాతవని లోకమంటదమ్మా
మయ్యపై మరులన్నీ మాసి పోలేదే
మరచైనా గట్టిగా గదిమెరుగనమ్మా
నామురిపెముల మూట నానోము ఫలము
నా మూలధనము ఈ నలుసుగదమ్మా
దేవకి బిడ్డకు ఇచ్చిన దీవన నీకు సాయమయ్యా
రాముని కిచ్చిన కౌసల్య దీవనే నీకు సాయమయ్యా
వణుకుపుట్టె నా తల్లి గుండెలో గుబులే పుట్టిందా
కన్నులద్దుకొని బిడ్డను దాసీ దోసిట పెట్టిందా

వచనము: మంటలలో బడి ప్రాణత్యాగము చేయు అంత:పురస్త్రీల ఆక్రందనలను విన్న మల్లమదేవి "రాజా విజయరామరాజా నీ పాలిటి యముడు బ్రతికేయున్నాడు. బొబ్బిలిగడ్డ మీదనే నీ బూడిద బుంగల కెత్తించగలడని చెప్తూతూ

నూనె మంటలో దహనమాయెనా మానిని మల్లమ్మ
మానవతే తన తమ్ముని కలలో కానుపించెనమ్మా
తమ్ముడా నా తమ్ముడా లేరా - తమ్ముడా పాపయ్య
ఆశలు మాపి ఆప్తుల బాసి అనాథవైతివయ్యా

అంటూ మంటల్లో దూకి ప్రాణ త్యాగానికి పాల్పడుతుంది. ఈ వార్తను వెంకటలక్ష్మి పాపారావుకు తెలియజేస్తూ..

ఎక్కడి బావా ఎక్కడి లోకం బాబూ అన్నాదా
దీపం పెట్టే దిక్కు లేదు మనదేవిడి కన్నాదా
రావువంశ భవితవ్యము నీపై నుంచినారు బాబూ
ఆశలు మాపిన అల్లుని నీకడ కంపినారు బాబూ

ఈ విధంగా బొబ్బిలి యుద్ధ కథలో కరుణ రసాన్ని హృద్యంగా పోషించారు.

జానపదుల గుండె చప్పుళ్లను స్వయంగా విన్న నాజర్ ఆ స్పందనల స్ఫూర్తిగా ఎన్నో జానపద గీతాలను రచించి సన్నివేశానికి అనుగుణంగా వాటిని అద్భుతంగా ప్రయోగించారు. బొబ్బిలి రాజ్యంలోని రైతులు, కూలీలు ఆడిపాడుతూ పనిచేస్తున్న విధానాన్ని జానపద బాణీలో చక్కగా రచించారు.

ఆడేటి పాడేటి తుమ్మెదా
వాన జాడల్లు జూపేటి తుమ్మెదా
సువర్ణముఖి పొంగె తుమ్మెదా
నవరత్నములు పండు తుమ్మెదా
వ్యాగావతి పారి తుమ్మెదా
ఢిల్లీ భోగాలు పండాలి తుమ్మెదా
మగనాలి నాటింది తుమ్మెదా
తెగపండి ఒరిగింది తుమ్మెదా
చేను గట్టున చూడు తుమ్మెదా
పెద్ద ఏనుగంతున్నాడే తుమ్మెదా
మునుం వెనుకాయనే తుమ్మెదా
అబ్బ నడుము కొర్రాయనే తుమ్మెదా

వచనము: ఈ విధంగా దండిగా పండిన పంటలు కోసి కుప్పలు కల్లాన వేసి రైతులు, కూలీలు ఆనందంగా పాటలు పాడుతూ నూర్పిళ్లు చేస్తున్నారు.

వలియ వలియో వలియా
రావేలు గలవాడా రార పొలిగాడా "వలియో"
బంటినున్న బసవన్న
పొలితిరిగే చానమాల
కాటకాల కాలదన్నాలోయ్ "వలియో"

పండి ఒరిగిన పంట తల్లీ
తిండి కొరతా దీర్చు తల్లీ
కల్ల మంతా కాలు మునిగిందా "వలియో"
చేలుబండి మూలనిండు
కూలినాలీ చల్లగుండ
రాజనాల రాశిపెరిగిందా "వలియో"
కుప్పనూర్చి పోశాడమ్మా "చందమామ రైతు"
అప్పులన్నీ దీర్చాడమ్మా ,,
భూసామీ బాకీసాకీ ,,
సావకారీ చిల్లర పద్దు ,,
పనివాళ్ల బాదర బందీ ,,
ప్రభువుల్లా పన్నుల రందీ "కుప్పనూర్చి చందమామా"
కష్టించి పైరులు బెంచీ
పండించే ప్రజలకు పంచి
మేలు సరుకూ లమ్ముతాడమ్మా
తాలుతరకు తింటాడమ్మా "కుప్పనూర్చి"
లోకాన్ని బ్రతికిస్తాడే
శోకాన్నీ భరియిస్తాడే
వెన్నకన్నా మెత్తనివాడే
నీకన్నా చల్లని రేడే

తుమ్మెద పదాలు, చందమామ పదాలు, వలియో పదాలను సందర్భోచితంగా ప్రయోగించి కథకు పుష్టిని చేకూర్చారు.

బొబ్బిలియుద్ధం బుర్రకథలో రగడలతో పాటు ఛందోబద్ధ ద్విపద, కందము, సీసం, పద్యాలను నాజర్ స్వయంగా రచించడం విశేషం. ద్విపదను నాజర్ నడిపించిన తీరు రమణీయంగా ఉంటుంది.

ద్విపద : పంటతల్లిని చూచి మది సంతసించె
ఇంట కరువులు దీరు కంటి తడియారు

నని ప్రజలు కొండంత యాశతో నుండ
మనసున చింతలు మాసియుండ

యక్షగాన ప్రక్రియలోని దరువులు, అర్ధచంద్రికలను కూడా బొబ్బిలి యుద్ధం కథలో రచించి గానం చేశారు. బుస్సీ ప్రభువు రాజమండ్రిలో మకాం చేసినపుడు విజయరామరాజుతో పాటు శ్రీకాకుళ ప్రాంత సామంతరాజులు తీసుకొని వచ్చిన సంభారాలు, బహుమానాల జాబితాను అర్ధచంద్రిక ప్రక్రియలో రచించారు.

బాతుగుడ్లు బడి కోడిగుడ్లనే
నేతిలడ్లు బంగారపు వడ్లన్
ఘుమ ఘుమలాడే కస్తూరి పునుగున్
ఘనముగ బ్రాందీ విస్కీ భంగున్
నల్లమందు గంజాయి గోనెలన్
పుల్లకల్లు సారాయి బానలన్
బంగరు కాన్కలు బండ్లా కెత్తెన్
నాగదత్తము దేవదత్తమున్
నాగస్వర సన్నాయిల తోడన్

ప్రార్ధనా పూర్వకంగా సాగే గతులతో ఉన్న దరువులను యక్షగానం నుండి స్వీకరించారు.

శాంభవీ రావే గంభీర భైరవీ
శంభూరాణీ నాకభయ మీయవే
కుంఫిణి నిప్పుడే కూల ద్రోసెదన్ "శాంభవీ"
చెంతానుండవే శాత్రవ పుర్రెలతో బంతులాడెద
వైరు ప్రేగులన్ జందె మేసెదెన్
వారి నెత్తుటను వసంతమాడెదన్ "శాంభవీ"

ఉత్తేజకరంగా సాగే దరువును అభినయిస్తూ ఆలపించడంలో నాజర్ శైలి విశిష్టంగా ఉంటుంది. ఈ బుర్రకథలను రాష్ట్రవ్యాప్తంగా 4 వేలకు పైగా ప్రదర్శనలిచ్చారు. అజ్ఞాత జానపద కవులకు, యక్షగాన గాయకులకు ఈ బుర్రకథను అంకితమిచ్చారు.

# 9

# అభిమన్యు యుద్ధం

**వింటే** భారతం వినాలి.. తింటే గారెలే తినాలి.. అంటారు. ఎన్నిసార్లు విన్నా.. ఎన్ని సార్లు చదివినా విసుగు పుట్టదు. ప్రతిసారీ ఒక కొత్త కోణం ఆవిష్కృతమౌతూనే ఉంటుంది. అటువంటి భారతకథలో అభిమన్యోపాఖ్యానం నవరసభరితసుధామధురం. పద్మవ్యూహాన్ని ఛేదించడానికి అరివీర భయంకరంగా పోరాడి కౌరవ సేనను చెల్లాచెదరు చేసి వారిని భయకంపితులను చేసిన అరివీర భయంకరుడు అభిమన్యుడు. పద్మవ్యూహాన్ని ఛేదించే సమయంలో కౌరవుల అధర్మ యుద్ధానికి బలైపోయిన అమరవీరుడు. భారతకథ మూలంగా యువర్తకం తొణికిసలాడే వారిని అభిమన్యుడంత వాడివి కావాలనే దీవెన లోకవ్యాప్తంగా జరిగింది. అటువంటి అభిమన్యుని ధైర్య శౌర్యపరాక్రమాలను వీరరసభరితంగా ఎందరెందరో కవితలుగా చెప్పారు. అభిమన్యుని కథ బహుళ ప్రచారం పొందడానికి జానపద కళాప్రక్రియలు ఎంతగానో దోహదం చేశాయి. అటువంటి విశేష ప్రచారంలో ఉన్న అభిమన్యుని కథను నాజర్ తనదైన శైలిలో **అభిమన్యు యుద్ధం** పేరుతో బుర్రకథగా రచించాడు.

పాండవమధ్యముడైన అర్జునుని ఇల్లాలు సుభద్ర నిండు చూలాలుగా ఉన్నప్పుడు
కమ్మకమ్మనీ కలలుగంటదా యమ్మ సుభద్రమ్మ "తందానా"
కన్న కలలు నిజమాయె సుభద్రకు ఎన్నో దినములకు ,,
ముసిముసి నవ్వులు ముద్దుమోముపై ముసురుతున్నాయా ,,
మిసమిసలాడే ముద్దుగుమ్మకూ మీగాళ్లురునాయా ,,
కథలు గాథలు వినగతాను చెవిగోసుకొనుచుండ ,,
పద్మవ్యూహ రహస్య మర్జునుడు ప్రబోధించనెంచె ,,

నిద్రిస్తూ జారె సుభద్ర పతి కథ మధ్య నాపుజేసే ,,
కన్న కలలు నిజమాయె సుభద్రకు తనయుడు పుట్టాడు "తందానా"
చిన్న పెద్ద తల్లిదండ్రులందరికీ కన్నుల విందాయె ,,
కన్నతల్లి కౌగిట్లో మురిసెనమ్మా ,,
కన్నతండ్రీ కళ్లల్లో మెరిసెనమ్మా ,,
పేరుపెట్టగా పడతులు వచ్చారా ,,
పేరుగాంచె వీరయభిమన్యుడన్నాడా ,,

పెరిగి పెద్దవాడైన అభిమన్యుడు వేదవేదాంగాలు, శాస్త్రపురాణాలు, ఇతిహాసాలు, నేర్చాడు. అస్త్ర, శస్త్ర యుద్ధ విద్యల ప్రవీణుడయ్యాడు. పాండవులు మాయాజూదంలో రాజ్యాన్ని కోల్పోయి అరణ్యవాసాలకు వెళుతున్న సమయంలో అర్జునుడు సుభద్రతో ప్రాణసఖీ మనబిడ్డడు జాగ్రత్తన్నాడు. సుభద్ర అభిమన్యునికి ఎన్నో నీతి బోధలు చేస్తూ పెంచసాగింది.

ఆడితప్పుట దోసమందా "భళాభళి"
ఆలమున కెనకాడుకుండా ,,
నిజం చెప్పుట నేర్వమందా ,,
హజం మంచిని చంపనుందా ,,
కామకథలను వద్దందా ,,
భామలతో నవ్వులను వద్దందా ,,
చదువు సంధ్యల యందు సాముగరిడీలందు
సాటిలేరనిపించమందా "తరిగిట తరిగిటతా"

అజ్ఞాతవాసం ముగిసింది. విరాటమహారాజు తనకు కానుకగా ఇచ్చిన ఉత్తరను కుమారుడైన అభిమన్యునకిచ్చి వివాహము చేయుటకు అర్జునుడు నిర్ణయించాడు. అభిమన్యుని పెళ్లికుమారునిగా చేయుచున్నారు.

పన్నీట స్నానం జేసెరా "సై"
సున్నిత వస్త్రాలే కట్టిరా ,,
కస్తూరి తిలకము దిద్దిరా ,,
నొసట బాసికం కట్టిరా ,,
పట్టుసెల్ల తలజుట్టెరా ,,

మణిహారాలు ధరించెరా "సై"
మన్మధుణ్ణీ మరపించెరా ,,

అభిమన్యుడు ఇలా పెళ్లికళతో శోభిల్లుతుండగా ఉత్తరను కూడా పెళ్లి కుమార్తెగా అలంకరించారు.

పెండ్లాయనమ్మ అందాలపందిట "పెండ్లాయె"
అభిమన్యునకు ఉత్తరా కన్యకు ,,
పచ్చలా తోరణాలే పసిడి పందుచునుండ ,,
ముత్యాల తోరణాలే మురిపాలు కురియంగ ,,
మంగళ వాద్యాలు మెండుగ మోయంగ ,,

ఉత్తరాభిమన్యుల వివాహం రంగరంగ వైభవంగా జరిగింది. సంజయ రాయబారం, కృష్ణ రాయబారం విఫలం కావడంతో కురుక్షేత్ర యుద్ధం ముంచుకు వచ్చింది. యుద్ధరంగంలో ఇరుపక్షాలు మోహరించాయి. ద్రోణాచార్యుడు పద్మవ్యూహాన్ని పన్నాడు. అభిమన్యుడు దానిని ఛేదించడానికి పూనుకొన్నాడు. అప్పుడు ధర్మరాజు

కాపుకాయుటకు మామా తండ్రియు దాపున లేరయ్యా "తందా"
వారికి కాక వ్యూహ రహస్యము ఏరికి తెలియవురా ,,
తెలుసు తెలుసు ఆవ్యూహ రహస్యము తెలుసు నాకు నాన్నా ,,
తెలుసుకొంటిరా తల్లి గర్భమందున్నపుడో నాన్నా ,,
బిడ్డా వ్యూహము చీల్చుటెరుగుదువె భళియనె భీమన్న ,,

ఈ యుద్ధంలో అభిమన్యుడు వీరమరణం పొందుతాడు.

ఈ బుర్రకథలో శృంగార, వీర, కరుణ రసాలను సమయోచితంగా పోషించారు. ఉత్తరను పెళ్లి కుమార్తెగా అలంకరించుట, శోభనం రాత్రి ఉత్తరాభిమన్యుల ప్రణయమును శృంగార రసంలో హృద్యంగా అభివర్ణించారు.

నూనెలంటి పన్నీట ఉత్తరను స్నానమాడజేసి "తందాన"
నీలికురుల దువ్వెంకుల సొంపుల పూలజడనువేసి ,,
చక్కని బంగరు జరీ పూవుల చీరె ధరించారా ,,
అద్దాల్ రైకను దూమెడు ముది ముత్తైదువలేశారా ,,
ముద్దుగుమ్మ నభిమన్యుని చెంతా వద్దిక నుంచారా ,,

నీలి చుక్కనును సిగ్గుల బుగ్గల తళుకుల గులికింపా "తందాన"
మేలిముసుగులో కలువల చెలివలె చెలియలవలపింపా ,,

రాచవారింట వధువు అలంకరణను సహజ సుందరంగా వర్ణించారు. ఉత్తరాభిమన్యుల మొదటి రాత్రి సన్నివేశంలో శృంగారరసం పరవళ్లు దొక్కింది.

సతీపతుల మతులెరిగిన రవి దిగజారెను త్వరత్వరగా
సగం గడిచినా మగువలుత్తరకు సొగసులు దిద్దారా
తెలియుమమ్మ చెలి కలుముల కిది తొలికళయన్నారా
పలుకపలుక చెలి వలపు తొలకగా పలకాలన్నారా
విడియము నోటికి ప్రియుడందిస్తే బిడియ పడకుమమ్మా
జడియకమ్మా నూరేళ్ల పంట కడు జాగ్రత్తన్నారా

గదిలోకి వచ్చిన అభిమన్యునితో ముత్తయిదువులు ఇలా పలికారు.

వగలూ, వలపులు నేర్వలేదు కసిగాట్ల కోర్వలేదు "తందాన"
గారాబముగా పెరిగినట్టి పసిగాయని తెలియండి

అంటూ ఉత్తరను గదిలోనికి తోశారు.

ముందుకు తోసి తలుపులు మూసినంత "తందాన"
మందయానకు చిరు చెమటందమివ్వ ,,
భూమిపై బొటన వేలితో పూయుచుండ ,,
కౌగిట చేర్చెను నును సిగ్గు సిగ్గు పడక ,,
సొక్కితాను మునిపంట ఉత్తరను నొక్కనోర్చినాడు ,,
సొక్కితాను తనకౌగిట సతినీ సొక్కజేయుచుండ ,,
హద్దులేని రతి సందడి దుర మందిద్దరిద్దరైనా ,,
పొద్దుపొడిచెనో కూకెనో అత్తరి పోల్చకయున్నారా ,,

నాజర్ బుర్రకథలో శృంగార రస పోషణ అభిమన్యు యుద్ధంలో ఎక్కువ మోతాదులో కన్పిస్తుంది. యుద్ధమునందు పొల్గొనబోవు అభిమన్యుని గూర్చి చేసిన వర్ణనలో వీరరసం చిప్పిల్లుతుంది.

పట్టుబట్టి బిగించెరా "సై"
పట్టాకత్తి వరనుంచెరా "సై"

పచ్చల పిడి బాకందెరా "సై"
చిచ్చుల పిడుగటులుండెరా ,,
అరవడి వరవడి చేసెరా ,,
అరదము పై కెగిరెక్కెరా "తరిగిట తరిగిటతా"
కుప్పించి గుర్రాలల్లే లేచాయా
ఘుప్పట ఘుప్పట దూకాయా "భళానం"
కొరకొరలాడుచు తండ్రుల కొల్వుకు
చెరచెర వచ్చాడా
వెరువ వలదు మీ పరువు పెంచ
కొడుకున్నాడన్నాడా
ద్రోణాచార్య, అభిమన్యుల యుద్ధవర్ణన నెత్తురును ఉడికిస్తుంది.
సారావార గంభీర ఘురతర వీరావేశముగ "భళాభళి"
నారిని సారించపుడు మీరి టంకారము చేశాడా
బాలుడ కానూ మీ పాలికే కాలుడనే కానా
విల్లుద్రుంచి సారథిని చంపి గుర్రాల కూల్చినాడా
తుళ్లి తేరునగు భిల్లవు దూకటు వెళ్లెను ద్రోణుండు
చిత్తజల్లు వలె చిటపట శరములు కురియుచు బాలుండు
శత్రు సేనలా నలగిలి చేయూ చెల్లా చెదరాయె
ఎదురు వచ్చిన దుశ్శాసనుని పైకి దూకి
కొప్పుకట్టి దొడ్డన్నును సభలో కీడ్చి నట్టి ద్రోహి "భళా"
ఇప్పుడు నీచావా హరినిల్చిన తప్పదురా పాపి ,,
విల్లు విరిచి దుశ్శాసనునట మూర్ఛిల్ల జేసినాడు ,,
చెల్లెకాలమని రొమ్మున కాలిడి బల్లెమెత్తెకుర్ర ,,
వీనిరొమ్ము దుధిరమ్ము చిమ్మ భీమన్న ప్రతినగలదు ,,
ఆ నెత్తుట కురులద్ది ముడువ దొడ్డమ్మా దీక్ష కలదు ,,
దుశ్శాసనుని విడిచిపెట్టిన అభిమన్యుడు దుర్యోధనుని పట్టుకొని
కోయుచు శత్రుల త్రోయుచు

రోయుచు సుయోధనున్ డాయన్ "తందాన"
దొడ్డమ్మకు తొడచూపిన ద్రోహి తొలుగక నిలుమనియెన్
ఈ కలహాలకు కారణమీవు
ఈ మరణాలకు మూలమునీవు "తందానా"
ఈ శోకాలకు హేతువు నీవు
పచ్చని కొంపకు చిచ్చు పెట్టినావు
వేడుకొనుము సుయోధనా ,,
ఇలవేల్పుల నన్నాడు
కొట్టగ తొడలే విరుగ
భీముని ప్రతిజ్ఞ కలవన్నా
శత్రు గుర్రాల కూల్చి సారథుల
జంప తుండెతుండెముల
పద్మవ్యూహములోకి ప్రవేశించిన అభిమన్యుడు
పటపట పండ్లు కొరుకుతూ పటుతరవేగ
రెట్టల దట్టుచు నరెరేయని మిట్టిపాటు తోడ
కదబడి వచ్చే దండును గదచే గదిమి చంపినాడు
కర్ణ శల్యులను దిమ్మెర పోవగ గదచే మోదాడా
ఇడివడి యుద్ధం చేయుచుండిరా వీరుల రోసానా

వీరరసం సహజంగానే ప్రేక్షకుల్లో ఉత్సాహాన్ని కలిగిస్తుంది. అందునా అభిమన్యుడు, బాలచంద్రుని వంటి పాత్రలు యుద్ధరంగంలో శత్రువులను చీల్చి చెండాడి వీరమరణం చెందాయి. ఈ సన్నివేశాలను వర్ణించడంతో పాటు నిప్పుల ఉప్పెనలా ఆలపించి అభినయిస్తాడు. పల్నాటి యుద్ధంలో బాలచంద్రుడు, అభిమన్యుని పాత్రల్లో నూరుశాతం సామ్యం కన్పిస్తుంది. రెండు కథల్లో యుద్ధం ఒకదశకు చేరుకొన్నాక అనివార్యంగా ప్రవేశించవలసి వస్తుంది. రెండు పాత్రలూ భార్యల వద్దకు వచ్చి వారి అనుమతులను తీసుకొంటారు. యుద్ధ భూమిలో చండ ప్రచండంగా శత్రువులను నిర్జిస్తారు. ఇద్దరినీ శత్రువులు చాటుగా వధిస్తారు. యాదృచ్ఛికంగా రెండు కథలను నాజర్ రచించి చెప్పారు. సన్నివేశం, దానికి అనుగుణంగా గానం, దానికి అనుగుణంగా అభినయం ఒక దానితో ఒకటి ముప్పిరిగా కలిసి పోతాయి. రెండు కథల్లోనూ శత్రువులపై

ఆగ్రహంతో దాడిచేసే విషయాన్ని వర్ణించే సమయంలో పటపట పటపట పళ్లు కొరుకుతూ పటుతరవేగ అనే తీవ్రతతో పద ప్రయోగం ఉంది. కానీ పునరుక్తి అనే భావం ఎక్కడా కన్పించదు.

పల్నాటి యుద్ధంలో బాలచంద్రుడు విరహ వేదనతో రగిలిపోగా మాంచాల కర్తవ్య బోధ చేస్తుంది. అభిమన్యు యుద్ధంలో ఈ సన్నివేశం మరింత పటుత్వంగా అర్ధగాంభీర్యంతో ఉంటుంది. తండ్రి లేని సమయంలో కౌరవులు పన్నిన పద్మవ్యూహాన్ని ఛేదించగల శక్తి తనకొక్కడికే ఉంది. అందుకే తాను బాధ్యతను తీసుకొనవలసిన ఆగత్యం వచ్చింది. స్థిర చిత్తంతో అడుగు ముందుకు వేశాడు. తల్లి సుభద్ర కొడుకును చూసి

యుద్ధమందు తనులేనిదే పంపొద్దనె మీనాన్న "తందానా"
పెద్దలు బాలుడు వనరు చేతురే యుద్ధము నీపైనా ,,
పుత్రా నిను దీవించ గుండె దడ పుట్టుచున్నదౌరా ,,

అంటూ ఒక తల్లిగా దీవించడానికి సంశయిస్తుంది. అప్పుడు అభిమన్యుడు

వీరపత్ని రణధీరవిప్పుడే వీరమాతవమ్మా
విజ్ఞులు రణ ప్రజ్ఞను లెందరిట మన్నైనారమ్మా
ఎన్నాళ్లున్నా వెన్నునంటి చావన్న దున్నదమ్మా
మనిషి చేసిన మంచి చెడ్డలకే మరణం లేదమ్మా
మనసు చంపుకొని కాకివలెనే మనలేనమ్మా

అంటూ తల్లికి బదులిస్తాడు. అప్పుడు సుభద్ర అభిమన్యుని వీరమాతగా

స్త్రీజాతిరా గుండె నీరుకాలేదురా "తందానా"
నీ మాత నవనాళ్లు ఊలిపోలేదురా ,,
వేడి రక్తపు జల్లు ఇంకి పోలేదురా ,,
తోడూనీడా అరే కాపాడు కొడకా ,,

ఇలా తల్లి దీవెనలు పొందిన అభిమన్యుడు అర్ధాంగి ఉత్తర వద్దకు వచ్చి అలినీలవేణీ ముద్దు చెల్లించవే అనగానే-

యుద్ధ వీరుల రక్తమేరులై పొంగ
ముద్దు ముచ్చటలందు మునిగిపోవంగ
భూమిపై యపకీర్తి యనుభవిస్తారా

అంటూ నిష్టూరమాడుతుంది. యుద్ధానికి సమాయత్తం చేసి వీరపత్నిగా తిలకం దిద్ది

పారిపోయేవారి పట్టి చంపొద్దు "తందానా"
చెట్టులెక్కిన భీతి కొట్టనే వద్దు ,,
మొక్కితే చేతులను కత్తిరించొద్దు ,,

అంటూ యుద్ధ నీతిని ఉద్బోధిస్తుంది. ఈ సన్నివేశంలో మాంచాల కన్నా ఉత్తర పాత్రలో స్థిత ప్రజ్ఞత ప్రస్ఫుట మౌతుంది.

ఈ బుర్రకథలో రగడలతో పాటు మంజరీ ద్విపదలను విరివిగా ప్రయోగించారు. అభిమన్యు యుద్ధం బుర్రకథను మిగిలిన కథలతో పోలిస్తే అంత బిగువూ, పట్టు కన్పించదు. ఏ సన్నివేశమూ మిగతా కథలంత పుష్టిని కూడా కలిగించదు. ఒకటి రెండు సన్నివేశాలను మినహాయిస్తే కథ తేలిపోయినట్లు ఉంటుంది.



# 10

# సీతారామరాజు యుద్ధం

**మ**న్యం అడువుల్లో ఏమాకును ప్రశ్నించినా నెత్తురు ఉడికిస్తుంది. వళ్లు జలదరిస్తుంది. ఆ స్మరణం అగ్నికణం. కొండఫలం, కందబలం దోచుకొన్న దుండగీడు తెల్లవాడిపై పోరాడి వారి గుండెల్లో నిద్రించి, అణగారి పోయిన తెలుగు వాడి పౌరుషాగ్నిని రగిలించిన అల్లూరి సీతారామరాజు అంటే ఒక విప్లవభేరి.. స్వాతంత్ర్యనినాదం. స్వేచ్ఛా మారుతం. తరతరాల దోపిడీకి గురౌతున్న గిరి పుత్రులలో చైతన్యాన్ని నూరిపోసి ఒక కట్టుబాటు చేసి ఆ కొండ గాలిని ఒక ఝంఝూ మారుత ప్రభంజనంగా మార్చిన అల్లూరి చరిత సాయుధ పోరాటానికి తిరుగులేని బావుటా.. అల్లూరి కథ కూడా దృశ్య, శ్రవ్య, కావ్య ప్రక్రియల ద్వారా తెలుగు వారికి సుపరిచితం. చర్విత చర్వణమైన ఆ కథను నాజర్ శ్రీ శ్రీ రామరాజు యుద్ధం పేరుతో వీరరస ప్రధానంగా రచించారు.

ఆంధ్రదేశం ఈశాన్య భాగాన భద్రాచలం, నూగూరు, పోలవరం తాలూకాలలో మూడువేల అడుగుల ఎత్తుగల పాపికొండలను అనుకొని ఉన్న అటవీ ప్రాంతాన్ని మన్యసీమగా పిలుస్తారు. అది టేకు, యేపె, వెదురు, వేగేశ చెట్లతో నిండి ఉన్న కీకారణ్యం. ఇక్కడి గిరిజనుల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని తెల్లదొరలు వారి సంపదను దోచుకొన్నారు. బ్రిటీష్ దోపిడీకి వ్యతిరేకంగా 1882-86 సంవత్సరాలలో రంపపితూరీ, లాగరాయి ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించిన సాహసవీరులు ద్వారబంద్రాల చంద్రయ్య, పులిచింత సాంబయ్య, రేఖవల్లి అంబుల్‌రెడ్డి వంటివారిని బ్రిటీష్ ప్రభుత్వం కాల్చిచంపింది. కీలకమైన ప్రదేశాలలో పోలీస్‌స్టేషన్లను ఏర్పాటు చేసి తన ఏజంట్లను నియమించింది. అప్పటినుండి వాళ్ల దాష్టీకం నానాటికీ పెరిగిపోయింది. పన్నుల పేరుతో అమాయక ప్రజలను పీల్చిపిప్పి చేసింది.

ఎండిన పుల్లల మోపులమ్మితే రేంజర్ మామూళ్లా
కొండగడ్డితో కొంపగప్పితే గార్డుకు లంచాలా
లొట్టెడు కల్లును ముట్టిన కేసు కోర్టు జరిమానా
పుట్టిన.. చచ్చిన.. చుట్టమొచ్చినా పోలీస్ ఫరమానా

ఈవిధంగా మన్నెం ప్రజలు అల్లాడి పోతున్నారు. పశ్చిమగోదావరి జిల్లా భీమవరం సమీపంలోని మోగల్లులో అల్లూరి వెంకట రామరాజు, నారాయణమ్మ దంపతుల గర్భశుక్తి ముక్తాఫలంగా రామరాజు జన్మించారు. చిన్నతనం నుండీ అన్యాయాన్ని చూసి సహించలేని రామరాజు

| | |
|---|---|
| బాలరాజై బాణమందెరా | "సై" |
| బాలుడావిల్లు ఎక్కుపెట్టెరా | ,, |
| కళ్లకీ గంతల్లు కట్టెరా | ,, |
| గగనాన డేగల్ని కొట్టాడా | ,, |
| కోటలోన బాకుదూశారా | ,, |
| పెన్నుతోసి గన్ను పట్టెరా | ,, |
| పిల్చి పులి నొష్టనే గొట్టెరా | "భళానంటి" |
| బాణం తొలకరి మెరుపేరా | "సై" |
| కోణం చిచ్చర పిడుగేరా | ,, |
| సూటి దప్పనీ గురికాడా | ,, |
| వ్రేటు తొలగనీ మొనగాడా | "భళానంటి" |

తెల్లధనిక రాజ్యము పోయి తీరాలని లేచాడా
కల్ల చదువులని సలాము గొట్టీ కానల కొచ్చాడా

ఆయుధాలతో ప్రజలను అణచివేస్తున్న ప్రభుత్వాన్ని ఆయుధాలతోనే ఎదిరించడానికి కంకణం కట్టుకొన్నాడు. మన్నెం గూడెంలోని గాముగంటం దొర, గాముమల్లు దొర వద్దకు వచ్చారు. వారిలో చైతన్యాన్ని ప్రోదిచేయడానికి

అడవిలో బుట్టి అడవిలో పెరిగిన అమ్మలయ్యలారా
ధనికులు చేసిన దరిద్రులారా దయగల ప్రజలారా
తెలుగుమాతల మానధనము లాత్మల మ్రింగు

పరదేశ ఏజెంట్లు ప్రభువు లిపుడు
రచ్చబండల వద్ద రంకు తీర్పుల నిచ్చు
నీతిహీనులు న్యాయనేతలిపుడు
కాకా కవిత్వాలు బాకా భజంత్రీలు
గాన సాహిత్య సంపన్నులిపుడు
లేని బిడ్డల గొనీ కాని పనులకు తార్చు
పాతపతితులు వీరమాతలిపుడు
ధరలు పెంచుట వ్యాపార ధర్మమిపుడు
పూటగడుపుతూ యేతెలివి తేటయకట
పురుష లక్ష్యము సకుటుంబ పోషణిపుడు
మానవత నాశనమగుచుండె మాన్యులారా

కొండబండలను కండల కరిగించి తవ్విపోసిన మీ భూముల నిక్షేపాలను, దోచుకొనేవారిపై మీరు పంపించిన మామిడి టెంకెలు వీధిలో విసిరితే ఆ టెంకెల జీడిని ఎండగట్టి, పిండి, గుండగొట్టి కాలే కడుపుల కింత గంజిగా, జావగా కాచుకు తాగే మీ దుస్థితిపై-

కట్టుగట్టి మీరంతా ఒకటై కదలాలన్నాడా
పట్టుగ మీరొక మాటగ బాటగ పదండి అన్నాడా

కొండ ప్రజలలో ఒక నమ్మకాన్ని కలిగించడానికి కులగోత్రాల పట్టింపులను పాతిపెట్టాడు. రైతుల్లో రైతుగా, కూలీలలో కూలీగా బ్రతికాడు. ప్రజలలో చైతన్యం వచ్చింది. అన్యాయాన్ని నిలదీసే ధైర్యం మొలిచింది.

చాల కోపమున తహసీల్దారా బాష్టీనొచ్చాడా "తందానా"
రోడ్డుబోయ పోలేదు కొండనా కొడుకులు అన్నాడు ,,
కూడు కలిగితే కుక్క గారనే కూతటు లుందోరా ,,
జాలిదలిచినే కర్వపన్ను తలపెట్టితిగదిలోనా ,,
సబాష్టియన్ దొర వద్దకు వచ్చిన రామరాజు-
వందనమయ్యా అయ్యా ఆంగ్లేయ దొరలకు వందనమయ్యా
ఆరణాల కూలీ యంటిరి మూడణాలే ఇచ్చుచుంటిరి
కూలినడిగిన కమల గుద్దిరి మచ్చరంటే చేయిచాపిరి

జాతిమాలి నిరుపేద బాధల పాలుజేయనేలా
నానాటా మమురాచి రంపాన బెట్టుటేలా
అంటూ నిలదీశాడు. సెబాష్టియన్‌కు కోపం తారాస్థాయికి వచ్చింది.
అరేయ్ కూలీ గొంతూ కెవడు నేర్పనీ కూతన్నాడా
పోలీస్ లాఠీ రుచి చూపండి సోల్జర్లన్నాడా
అంటూ అరిచాడు.
పెఠిల్ పెఠిల్లున పోలీసు లాఠీ వేట సాగినాదా
కఠోరముగ పసిబాల వృద్ధులను బట్టి బాదుచుండ
ఆ దెబ్బలు భరించలేక ఆ చెట్టూ గుట్టలూ
చెట్టుల నుండీ చింతకాయలటు చిటపట సాగిందా
గుట్టల పైగా రాళ్లూ బండలూ వర్షం రేగిందా
గచ్చ పొదల్లో బాణాలే పోలీస్ బుట్టలెగర గొట్టెన్
ఫైర్ ఫైరంటు బస్టిన్ పోలీస్ వ్యాను పరుగు పెట్టెన్

బారువడ్డీలు, చక్రవడ్డీలు పేర్లతో ప్రజలను పిండుతున్న వడ్డీ వ్యాపారులను, భూస్వాముల దుర్మార్గాలను రామరాజు నిలదీశాడు. దీనితో వారందరూ రామరాజుపై సెబాష్టియన్‌కు పితూరీలు చెప్పారు. రామరాజుపై ఆకారణంగా నేరం మోపి స్టేషన్‌లో కొన్నాళ్లు శిక్ష విధించారు. తప్పించుకొన్న రామరాజు పోలీస్‌స్టేషన్లపై మెరుపు దాడిచేసి ఆయుధాలను స్వాధీనం చేసుకొన్నాడు. వీరయ్యను తుపాకీ దండుకు నాయకునిగా నియమించాడు. తెల్ల ప్రభుత్వం లార్డ్ వెల్డింగ్‌టన్‌ను రామరాజును అణచివేయడానికి ప్రత్యేకంగా నియమించింది. ఆంగ్ల సైన్యానికి, మన్నెం వీరులకు పోరు భీకరంగా జరిగింది.

తళతళ నాకసమందు మెరయగ తలపడె నిరువారు "తందానా"
తలకనిపిస్తే కొండబండ్లపై తెగి అటుపడుచుండ ,,
దొరికె మల్లు దొర బరిలో గంటం వీరమరణమొందె ,,
శరవేగంబున రామరాజు ఆశత్రుసేననెదిరి ,,
ఘూటీలో కావెట్టిన సిపాయి కతం చేయుచుండ ,,
నెత్తురు జిమ్ముచు తలలు మొండా తన్నుకొనుచు నుండ

ఊచకోతగా రామరాజు యుద్ధాన కోయుచుండ ,,

గొర్రెకోతగా రామరాజు యుద్ధాన నరుకు చుండ ,,

శత్రుసంహారం చేయుచున్న రామరాజుపై తుపాకినీ గురిపెట్టి గుండెపై కాల్చారు.

సూటిగా నాటెను తుపాకీ గుండు రాజు గుండెలోనా

ఆంధ్రదేశమా అందుకొనుము నా వందనమన్నాడా

అంటూ వీరమరణం చెందుతాడు. రామరాజు వీరమరణ ఇతివృత్తం సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లో రకరకాలుగా ఉంది. సంధికోసం రమ్మని రూధర్‌ఫర్డ్ రాజుకు వర్తమానం పంపిస్తాడు. చర్చల కోసం వచ్చిన రామరాజును మేజర్ గుడాల్ కాల్చి చంపినట్లు మనకు తెలిసిన కథ. కానీ నాజర్ ఆంగ్లేయులతో జరిగిన యుద్ధంలో రాజు మరణించినట్లు మార్పు చేశారు. ఇప్పటి వరకూ అల్లూరి పేరున వచ్చిన రచనలన్నీ సీతారామరాజు పేరున రాగా నాజర్ శ్రీ రామరాజు అని ప్రయోగించడం విశేషం. బుర్రకథ మొత్తంలో కూడా ఎక్కడా సీతారామరాజు అని ప్రయోగించక పోవడం గమనార్హం.

ఈ బుర్రకథ అంతటా వీరరసమే అంతర్వాహినిగా ప్రవహించింది. జలియన్ వాలాబాగ్‌న జరిగిన దారుణ మారణకాండను విని తిరుగుబాటు బావుటా ఎగరేసిన అల్లూరి మన్నెంజనాన్ని మేలుకొలిపాడు.

వేదనలందరి నిల్పెరా "సై"

ఆకలి భగ్గున మండెరా ,,

అవసర మాయుధ మందిందా "భళానంటిభాయ్"

అరెరే దండు కదిలిందా శ్రీరామదండు "సై"

బండబండకో విప్లవ తండా ,,

గండాభేరుండడవులు నిండా ,,

కొండదేవర అండనుండెరా ,,

లండన్ ప్రభులా పిండిజేతుమే "దండు"

పోలిబలిరా చింతపల్లిరా ,,

పోలీస్‌స్టేషన్ గొట్టిరా ,,

కృష్ణదేవి పేటొచ్చెరా ,,

రాజా బొమ్మం గొచ్చెరా ,,
రైఫిలిచ్చె పోలీసులే ,,
రామదండులో చేరిరా ,,
రాజుకు జయమని పలికిరా "తతక్కథోమ్"
కల్ల రికార్డులు గాల్చిరా
ఖైదులో వీరయ్య నొదిలిరా "భళానంటి"
తూటాల్ దండలు వేశారా ,,

రామదండును అణచి వేయడానికి బ్రిటీష్ ప్రభుత్వం బ్రీమన్ దొరను నియమించింది. బ్రీమన్ దొరను రామరాజు ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించారు.

మలకపల్లి కొచ్చిరా "సై"
పోలీస్‌స్టేషన్ గొట్టెరా ,,
గుండా మన్యం రౌడీలే ,,
గుండె జారి కూర్చున్నారా "భళా"

పెద్దసంఖ్యలో సైనిక దళాలను హైటర్ నాయకత్వాన మన్యానికి దించారు.

ఆ వార్తయే రాజు కొచ్చెరా "సై"
అగ్గిరాముడై లేచెరా ,,
భగ్గుభగ్గునే మండెరా ,,
పట్టిమీసమే దువ్వాడా "భళానంటిభాయ్"
గంటం దొరనే బిల్చెరా ,,
గాంమల్లు దొర లేచెరా ,,
ఆజ్ఞలందుకొన్నారురా ,,
ఆయుధాలు చేబట్టారా "భళానంటిభాయ్"
తెల్లసేనలన్ జూచెరా ,,
వళ్లు పులకరించిందిరా ,,
ఢంకా ధణధణ మోగిందిరా "తతక్కథోమ్"
పటాలమే చెలరేగిందిరా "భళా"

కొండలనిండా కోయలురా ,,
బండబండకొక బాణంరా ,,
దూకుచు బండల పాకుచు బాటల ప్రక్కన గాచారా ,,
తాచుల వలెను.. రేచుల వలెను దిక్కుల మూగారా
ఆ పక్క ధార్ కొండ "భళిభళి"
ఈ దిక్కు గాము కొండ ,,
చిక్కారురా నాయాళ్లు ,,
జాతోళ్ల జీతగాళ్లూ ,,

వేలాది మంది పటాలాన్ని మన్యానికి తరలించారన్న వార్తను అగ్గిరాజు తెలియజేసినప్పుడు

రవిగుంకని సామ్రాజ్య మోడితే రాజు ధన్యజీవి "తందానా"
రామబలము గతిమాలి కోడితే రాజు చిరంజీవి ,,
మధుర జీవనులు మాన్యులెందరిట మన్నయినారన్న ,,
మనం మాత్రమిట శాశ్వతంబుగ మనగలమంటన్నా ,,
తనువు నెంత పోషించి పెంచినా చావుదప్పదన్నా ,,
మనం చేసిన మంచి చెడ్డలకు మరణం లేదన్నా ,,

అంటూ హితబోధ చేసి సైన్యాన్ని సమరానికి సిద్ధం చేస్తారు. యుద్ధానికి కదిలిన రామ దండును గూర్చి వర్ణిస్తూ-

పటపట పటపట పండ్లు గొరుకుచూ పటుతరవేగ
పట్టి మీసములు పట్టి దువ్వి కనుబొమ్మలు ముడియబెట్టి
పెఠిల్లుమని కక్కరిల్లుచును దిక్కంఠంబుల దరగును
పఠాకత్తులును కటార్లు బాకుల్ తటాల్ నందుకొని
అంటూ కదను తొక్కించారు.

జానపదుడైన నాజర్‌కు జానపద సాహిత్యం అంటే ఆరవ ప్రాణం. రగడలు, యక్షగాన ప్రక్రియలలోని దరువులు, చంద్రికలు, మంజరీ ద్విపదలతో పాటు గ్రామీణ వాతావరణాన్ని పల్లె ప్రజల ఆటపాటలను వర్ణించే సందర్భంలో విధిగా జానపద పాటలను మక్కువతో రచించేవారు. శ్రీ శ్రీ రామరాజు యుద్ధంలో కూడా

సన్నివేశాలకనుగుణంగా జానపద గీతాలను రచించారు. మన్యం గూడాలలోని పండుగ వేడుకలను హృద్యంగా రచించారు.

తుడుం డప్పు భేరీలు మోగుచుండ "తందాన"
నడుం చేతులతో నవజవ్వనులుండ ,,
సరిగ సన్నాయి మధురధ్వని మోగ ,,
సఖుల కంఠాలు కలిసి ఖంగుమనంగ ,,
భాగే భూలన్ నృత్యం సాగిందా ,,
భారే గుమ్మని నృత్యం రేగిందా ,,

కోయ నృత్యాలను ఇలా కళ్లకు కట్టినట్లు వర్ణించారు. ఏరువాక సమయంలో పల్లీయుల పనిపాటలను కమనీయంగా, రమణీయంగా వర్ణించాడు.

ఏరువాక వచ్చిందమ్మా చందమామా రైతా "రైతా"
ఏరిపూసి రారేమన్నా కొండమామా ,,
దుక్కి చలవ పైరుల బెంచున్ కొండమామా ,,
దున్నకుంటె కొయ్యక పండున్ కొండమామా ,,
ముదురు పైరు పంటకు మెరుగు చందమామా ,,
ముందు కొడుకు ఇంటికి వెలుగు కొండమామా ,,
బండలన్ని బయటకు తోసేయ్ కొండమామా ,,
దుంగలు సెలయేళ్లకు అడ్డేయ్ కొండమామా ,,
తల్లిచ్చే పాలకన్నా చందమామా ,,
ధరణిచ్చే పాలుమిన్న కొండమామా ,,

అడవి జంతువులు పక్షుల నుండి పంటను కాపాడే పైరు కాపరుల విన్యాసాలను గుండెకు హత్తుకొనేలా చిత్రించారు.

వడిశాలవారు తెగనమ్మ - ఓలమ్మ
పిడసలకు అలుసైతినమ్మ పిన్నమ్మ
పచ్చ జొన్నలు మెక్కి పాలేరు నీల్దాగి
ఊచబియ్యం బొక్కి ఊటనీరే తాగి

బలిసింది పిట్టలకు ఓలమ్మా
బియ్యమే లేదోలే సిన్నమ్మా

కలుపు తీతలకు పంట కోతలకు వెళ్లే పడుచుల మిడిసిపాటు వయ్యారాలను సరదాగా చిత్రించారు.

యల్తానమ్మా యల్తానే
జొన్నకోతకే నెల్తా నోలమ్మా "ఎల్తా"
అందగాడే మాయత్త కొడుకు
సందెయేలే రమ్మన్నాడమ్మా
ఆడులేనా అడ్డాల మునుమూ
కొడవలెత్తేనే కోయలేనూ "ఎల్తా"

కుప్ప నూర్పిళ్లను కూడా సంబరంగా వర్ణించారు.

వలియ వలియో వలియా
రావేలు గలవాడు రారపొలిగాడా "వలియో"
అల్లమూ వెల్లుల్లి కంది
తెల్లజొన్నా సజ్జపిండి
చిల్లరప్పులు చెల్లి పోయేనా "వలియో'
చక్రవడ్డీల్ ఖండ గుత్తలు
సక్కరంగా తీరిపోతే
చుక్క పండుగ జోరుగుంటుందా

నాజర్ బుర్రకథల్లో హాస్యం చకచక లాడుతుంది. భళ్లున నవ్వు పగులుతుంది. ఆశువుగా ప్రాసలతో హాస్యాన్ని వ్రాయడం నాజర్ ప్రత్యేకత. అన్ని బుర్రకథల్లో కన్నా శ్రీ రామరాజు యుద్ధంలో హాస్యం దొంతర్లు దొంతర్లుగా నవ్వును పుట్టిస్తుంది. వ్యవహారిక భాషల్లో పల్లెల్లో ఉన్న పామరజనానికి గిలిగింతలు పెట్టేలా చెణుకులను రచించారు.

హాస్య : పుణ్యదంపతులు 63 రకమా 36 రకమా

కథ : అంటే

హాస్య : ఆరు దక్షిణం మూడు ఉత్తరం అంటే అన్యోన్యంగా ఉన్న దాంపత్యం. ఇక మూడు ఉత్తరానికి ఆరు దక్షిణానికే ఎడమొగం పెడమొగం ఇంట్లో ఈరంగం ఈదిలో చదరంగం

నాయకుల అక్రమార్జనపై విచ్చుకత్తి లాంటి విసుర్లు వేశారు. "బంధువుల పేర్ల బస్‌రూట్లు, భార్య పేరున ప్లాట్లు, ఓట్లిచ్చి నోళ్లకు అగచాట్లు". పాత సామెతలకు కొత్త రూపం ఇచ్చి ప్రయోగించిన తీరుకూడా హాస్యరస స్ఫోరకంగా ఉంటుంది." విద్యలేని వాడు వింతపక్షి - ఉద్యోగం దొరక్కపోతే ఊష్ట పక్షి, "హరోంహరా యేదుస్తున్నావేందిరా ఇమ్మాన్యుయేలా అంటే బ్రాకెట్ తన్నేసిందిరా బ్రహ్మానందమా". రాజకీయం అనే పదానికి "అధికారపార్టీకి భజన చేయాలి. అబద్ధాలు గట్టిగా కోశేయాలి. చందాలు భోంచేయాలి' అంటూ సరికొత్త నిర్వచనం చెప్పాడు. పాత సామెతలకు, పద్యాలకు పారడీలు వ్రాసి నవ్వుల పువ్వులు పూయించాడు. "అన్నమైతే నేమిరా.. సున్నమైతే నేమిరా.. ఈ పాడుకడుపుకు అన్నమే వేద్దామురా" అనే దానికి బాటిలైతే నేమిరా... పెద్దబానెందుకు సోదరా.. మందు మరిగిన పాడు పొట్టకు బ్రాందీనే పోద్దామురా" అంటూ సరికొత్త వ్యాఖ్యానం చెప్పాడు. నిరుద్యోగ సమస్యపై చేతిలో డిగ్రీ పట్టా నిత్యం ఆకలి పొట్ట అంటూ ఛలోక్తి విసిరాడు.

ఈ బుర్రకథను తనకు ఆప్తమిత్రుడు తొలిదశలో తోటి కథకుడు పురుషోత్తానికి అంకితమిచ్చాడు. ఈ కథను రాష్ట్ర వ్యాప్తంగా వెయ్యికి పైగా ప్రదర్శనలిచ్చాడు.



# 11

# జ్ఞానజ్యోతి క్రీస్తు

**క**త్తితో సాధించనిది కరుణతో సాధించాలి. కక్షతో సాధించనిది క్షమాభిక్షతో సాధించాలనీ, ప్రేమ.. త్యాగం.. కరుణ.. గొప్పముక్తి సాధనాలని జాతికి తెలియజెప్పిన మహితాత్ముడు జనజాగృతి కోసం.. పాపులలో మానసిక పరివర్తన కోసం శిలువ నెక్కి రక్తం చిందించిన కరుణామయుడు.. పరలోక మంటే ఎక్కడో లేదని.. మనిషికి మనిషికీ మధ్య సౌభ్రాతృత్వం, సామరస్యం ఉండాలని, తోటి మనిషిని ఆదరించి.. ప్రేమించాలని విశ్వానికి చాటిచెప్పిన గొప్పప్రవక్త ఏసుక్రీస్తు. ప్రపంచ వ్యాప్తంగా తన బోధనలతో ప్రజలను పునీతులను చేసిన క్రీస్తు చరిత్రలోని కొత్త కోణాలను ఆవిష్కరిస్తూ నాజర్ జ్ఞానజ్యోతి క్రీస్తు అనే బుర్రకథను రచించారు. మతం ముసుగులో ప్రజల అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని ఆసరగా చేసుకొని పబ్బం గడుపుకొంటున్న కుహనా బోధకులపై ధ్వజమెత్తిన ఉద్యమ కారునిగా, తరతరాలుగా దోపిడీకి గురౌతున్న శ్రామికులలో చైతన్యాన్ని రగిల్చి వారిని జ్ఞానం వైపు నడిపించిన సత్యశీలునిగా క్రీస్తు పాత్రను నాజర్ చిత్రించిన తీరు అద్భుతంగా ఉంటుంది. పరలోకం పేరుతో ప్రజలను మోసం చేస్తున్న వారి బండారాలను బహిర్గతం చేసి నిజమైన పరలోకానికి అర్థం పరమార్థం, నిర్వచనం చెప్పి ప్రజలను జ్ఞాన శీలురుగా మార్చిన సామాజిక స్ఫూర్తి ప్రదాతగా క్రీస్తు చరిత్రను రచించారు. బైబిల్‌ను విస్తృతంగా పరిశోధించి ఆ సారంతో రచించిన తీరు కొత్త కోణాలను ఆవిష్కరించింది.

పశువుల పాకలో జన్మించిన ఏసయ్యను గొర్రెల కాపరులు, జ్ఞానులు దర్శించి నమస్కరించారు.

అందుకొనుము విజ్ఞానుల కాన్కలు ముందుగ మరియమ్మ "తందానా"
అందరీతడభిషిక్తుడు రక్షకుడందురు మరియమ్మ
ఈ కసికందే దీనదరిద్రుల పాపుల ప్రభువమ్మ
బానిస బిడ్డల బ్రతుకులితనిపై నున్నవి మరియమ్మ
నీతిహీనుడౌ రాజుకన్న ఈ పేద జ్ఞాని మెరుగు

అంటూ కీర్తించారు. క్రీస్తు జననాన్ని తెలుసుకొన్న హేరోదు రాజు తనకు ఈ విషయాన్ని చెప్పకుండా వెళ్లిన జ్ఞానులపై నిప్పులు దొక్కాడు.

ఔరా జ్ఞానులు నన్నిపు
డౌరా నమ్మించి మోసగించినారరే
కోరి రాజద్రోహపు
నేరానికి మిమ్ము శిలువ వేతురా

అంటూ ఆగ్రహించి

పండ్లు పటపటా కొరికెరా "సై"
పట్టిమీసమే దువ్వాడా ,,
హేరోద్వంశాలుండగా ,,
వేరొక దూదుల రాజుగా ,,
ఎక్కడి వాడు జనించినా ,,
మొక్కలోనే త్రుంచెయ్యనా "భళా"
గుట్టుగ సైన్యాలొచ్చెరా ,,
గుర్రాల్ కదనే తొక్కెరా ,,
అరవడి పరవడి జేసెరా ,,
అశ్వాల్ పైపై లేచాయా ,,
విచ్చుకత్తి కొన కొనలపై ,,
మృత్యువు నృత్యం చేసెరా ,,
తళ్‌తళ్ మెరిసే కత్తేరా ,,
పసిపాపల కదిమిత్తేరా ,,
రెండు వత్సరాల్లోపు బిడ్డలా చంపమన్నాడా "తందానా"

ఛండ శాసనం విని జైజై అని దండు కదిలినాదా ,,
అప్పటి కప్పుడు బిడ్డనెత్తుకొని ఆత్రముతో వారు ,,
ఆప్తుల వీడి దినపస్తులతో ఐగుప్తెళ్లారు "తందానా"
తండ్రి వెంట వడ్రంగి వృత్తి చేస్తుండె నచట ఏసు ,,
నిండెను పదిరెండేడులు ఏసుకు నిండెన్నాన్నాటా ,,
జూదయలో హేరోదు చచ్చెనని జాడ తెలియగానే ,,
జరూసలేములో పస్కా పండగ జూడ బోయినారు ,,

జరూస దేవాలయంలో

వెడలే సభకు పగటేషగాళ్లవలె అన్నాస్‌కైఫాసు "తందానా"
పొడుగంగీ పెద్దంచు పంచెలతో అన్నాస్ కైఫాసు ,,
దేవుని వాక్యాల్ పుటుంబెట్టెడీ ఫోజులరాయుళ్లు ,,
దీనుల మోసం చేయు ధనికులా తోడు దొంగలపుడు ,,

జీలకర్రలో పదవ వంతు దేవునికిచ్చి ఉన్నతాసనాల కోసం, ప్రధాన పదవుల కోసం ప్రవక్తల ప్రాణాలతో చెలగాట మాడే దొంగ బోధకులు

అరయ మన దేవుడూ ఆకాశమందూ "తందానా"
నరులు నిర్మించనీ స్వర్గ దేవళమందూ ,,
అదృశ్యుడై యుండీ జాగ్రత్తగానూ ,,
భూమిపై ధర్మాల పాలించు ఆమెన్ ,,

చీకటి వెలుగులూ, భూమ్యాకాశాలను సర్వజీవులు, పశుపక్ష్యాదులను చేసిన దేవునకు దున్నే ఎద్దులను, గుర్రాలను, వెన్నపాలు ఫలమాంసాలను వేల్పునకు లెవీగా ఇవ్వాలి. మీరు వీటన్నింటినీ లెవీగా చెల్లిస్తే మరణానంతరం పరలోకములో మీకు రెట్టింపుగా దేవుడు ఇస్తాడు-అంటున్న బోధకుల మాటలను విని క్రీస్తు నిర్ఘాంతపోయాడు. మీరు గుడ్డివారై పుట్టుగుడ్డి వారికి దారిచూపుతున్నారు. స్వర్గలోక దేవాలయము ఆకాశంలో ఉందా.. ఆపైన దేవుడున్నాడా

ఆకసమెక్కి దిగిన దెవ్వరు "తందానా"
భూమికి దిక్కులు అతికించెందెవరు ,,
గాలిని పిడికిట పట్టిందెవరు ,,
నీటిని మూటగ కట్టిందెవరు ,,

· లెవీ గట్టిన వారిని రక్షించి, కట్టలేని వారిని శిక్షించమని దేవుడు ఎవరితో చెప్పాడు. తినడానికి తిండిలేక పుట్టు బానిసలై పశువులతో పాటు పాకలో కట్టివేయబడుతున్న దీనులు, దరిద్రులు లెవీ చెల్లించలేక శిక్షించబడుట ధర్మమా.. వారిని దేవుడు కాపాడునా..

దేవుడే వ్యాపారి కాడు
స్వజనులా దేవునికి లేరు
ప్రత్యేక ప్రీతి గలవారు
ప్రకృతిలో దేవునికి లేరు
లోక వ్యాపకుడైన సూర్యునీరీతిగా
ఏకదృష్టే సామిదన్నాడా
అహంతో కూడినా దృష్టి
నాలుకపై కల్ల సృష్టి
చెడ్డ యాలోచనా సక్తి
నిరపరాధుల చంపు వ్యక్తి
దేవుడు కానే కాడు.

ఇర్మియా అధ్యాయము 13లో వ్రాసినట్లు

| | |
|---|---|
| భ్రష్టులను విశ్వాస ఘాతకులను సుఖపడమన్నాడా | "తందానా" |
| నోట జపించే వీరి హృదయముల నీవు లేవ దేవ | ,, |
| ఎంతకాలమీ గడ్డి పోచలిట్లుండ వలయు దేవా | ,, |
| స్వార్థపరుల తమ బాటల్లో వర్ధిల్ల జేసితివా | ,, |

అంటూ దొంగ బోధకులను నిలదీశాడు. తన మనసును ఆవరించిన సైతాన్‌ను ఏసు పారద్రోలాడు.

| | |
|---|---|
| ఒంటిగ నఫ్తాల్ జాలరులుండే ప్రాంత మొచ్చె ఏసు | "తందానా" |
| ఇంటింటా ఇంత అన్నమడుక్కొని తింటు తిరుగుచుండు | ,, |
| మాసిన గడ్డం మసిపాతల్లో మాణిక్యం క్రీస్తు | ,, |
| కానుపించె అజ్ఞాన చీకటిలో జ్ఞానజ్యోతి క్రీస్తు | ,, |

ఆనాటి నుండి శ్రీమంతులు, బానిస వ్యాపారులు రాజ కుటుంబీకులు దోపిడీలకు గురైన నిర్భాగ్యులలో చైతన్యాన్ని రగిలించాడు. దీన దరిద్రులు, పాపులకు పరలోకం అంటే ఏమిటో ప్రత్యక్షంగా నిరూపిస్తూ

| | |
|---|---|
| వీధుల వెంటా నడుస్తు క్రీస్తు | "తందానా" |
| వ్యాధి గ్రస్తుల బాగుపరుస్తూ | ,, |
| కుష్ఠరోగుల స్వస్థపరుస్తూ | ,, |
| దుష్ట జ్వరాల దూరం చేస్తూ | ,, |
| రాజ్య సువార్తల ప్రజకందిస్తూ | ,, |
| ప్రజామోదమును పొందెను క్రీస్తు | ,, |
| ఆత్మవిషయమై దీనులైన వారెంతో ధన్యులయా | ,, |
| నీతికొరకు హింసించబడిన వారెంతో ధన్యులయా | ,, |
| నీతినిమిత్తం ఆకలిదప్పులు కోర్చు ధన్యులంతా | ,, |
| తాత్వికులే భూలోకాన్నే స్వతంత్ర పరతురయా | ,, |

పరలోకమునకు నిజమైన అర్థమును ఈ విధంగా చెప్పాడు. దు:ఖపడువారు ధన్యులు. వారు ఓదార్చబడుదురు. నా నిమిత్తం మిమ్ము నిందించి హింసించి, చెడ్డ మాటలు సహించినపుడు మీరు ధన్యులు. అప్పుడు పరలోక రాజ్యంలో మీ ఫలం మీకు దక్కుతుంది.

| | |
|---|---|
| ఓ దీన జనులార.. అన్యజనులారా | |
| నమ్మకమే మీకు రక్ష అన్నాడా | "తందానా" |
| మారాలీ బానిస బుద్ధీ | "భళిభళి" |
| కావాలీ శరీర శక్తి | ,, |
| లోపలా బయటా పరిశుద్ధీ | ,, |
| లోకాన జ్ఞాన మభివృద్ధీ | ,, |
| ఆలోచనలు పెంచుకోండి | ,, |
| సుజ్ఞాన మలవరచుకోండి | ,, |
| విజ్ఞాన మన్నిటికీ తల్లీ | ,, |
| అభివృద్ధి కాచరణ తండ్రీ | ,, |

నీతికై హింసలను భరియించు ధన్యులదే
పరలోక రాజ్యమన్నాడా "భళిభళి"
చీమలను గని నేర్చుకోండి ,,
పాములను గని నడుచుకోండి ,,
మీ ఆస్తి పరుల పాలాయె ,,
మీ కష్ట మన్యులరియించె ,,
సోమరుల వలె నిట్టు వెంతకాలము ,,
దీర్ఘ నిద్రలో యుండు రన్నాడా ,,

కాపరులు లేని గొర్రెలవలే ప్రజలందరూ చెల్లాచెదురై ఉన్నారు. మీ ఆలోచనల చేత మీ ఉద్దేశములు స్థిరపడును. ఆచరణలేని ఉద్దేశము ఎంత గొప్పదైనా వ్యర్థము.

మీ తెలివే మీకు రక్ష "భళిభళి"
మీ వివేచన మీకు భిక్ష ,,
మీ బుద్ధి మీకు సుఖమిచ్చు ,,
జ్ఞానమున ఆత్మవికసించు ,,

ఈ ప్రబోధనలు ప్రజలలో సంచలనాన్ని సృష్టించాయి. క్రీస్తు పేరు ప్రజలలో మారుమోగిపోయింది. క్రీస్తు వద్దకు వచ్చిన యోహాను దూతలు ఇంతకాలం మేం ఎదురు చూస్తున్న ప్రవక్తవు నీవేనని అన్నారు.

ముందు చూపు లేనంధులెందరో పొందిరి చూపులను "తందానా"
కుష్ఠు సంఘ ముత్కృష్టులంతా పరిశుద్ధి పొందినారు ,,
నడుటెరుంగని రోగులు నడుస్తూ ఉన్నారు ,,
కడువడి బీదలు మృతులు బ్రతుకుచున్నారు ,,

అని క్రీస్తు యోహాను దూతలతో చెప్పాడు. క్రీస్తు పరలోక రాజ్య తీవ్ర సిద్ధాంత బోధ ప్రపంచ పాలక వర్గాలను, బానిస వ్యాపారులను, శ్రీమంతులను కలవరపరచింది. పీడిత ప్రజానీకాన్ని జాగృత పరచింది. విప్లవ సిద్ధాంతాలకు, త్యాగశీలతకు నాంది పలికింది. ఆ సిద్ధాంతాన్ని విన్న గుణహీనులు, మీ శిష్యులు మీవలే ఉపన్యాసాలు చేయడం లేదని ప్రశ్నించారు. దానికి క్రీస్తు మార్కు అధ్యాయం ఏడులో వ్రాసినట్లు

మీరు దేవుని ఆజ్ఞలను విడిచిపెట్టి మనుషుల పారంపర్య ఆచారాలను తీసుకొనుటకై దేవుని ఆజ్ఞను పూర్తిగా నిరాకరించుచున్నారు.

నక్కలకున్నవి బొక్కలు దీనులు నిలువ నీడలేదు "తందానా"
దిక్కులేని దీనుల కొరకొచ్చితి నొక్కడికనే క్రీస్తు ,,

క్రీస్తుతో వాదిస్తున్న సర్పిసంతు ఆయనను సత్పురుషుడా అని సంబోధించెను. అదివిన్న క్రీస్తు నరుడెవ్వడుకాదు. దేవుడొక్కడే సత్పురుషుడు. నిత్యము సత్యమునే పలుకుట, పొరుగువారిని ప్రేమించుట, ఇతరులను బాధించకుండుట, తల్లిదండ్రులను పూజించుట వంటివి సత్పురుషుల లక్షణములని చెప్పెను. సత్పురుషునివి కావాలంటే

పంట భూములను అమ్మి పేదలకు పంచమనె క్రీస్తు "తందానా"
వెంటనే నీ ఇండ్లన్నీ పేదలకు ఇమ్మనెనా క్రీస్తు ,,
తత్తరపడి ధనవంతుడు టాసాన్ దారిపట్టినాడు ,,
బిత్తరపడి పోవుచున్న శిష్యులను క్రీస్తు చూచినాడు ,,
ధనికుడు దేవుని రాజ్యము కెళ్లుట దుర్లభమన్నాడు ,,

దైవరాజ్యం తనకై తాను ప్రత్యక్షంగా రాదు. అది మంచి వారు ఎక్కడుంటే వారి మధ్యనే ఉంటుంది. దైవరాజ్యం అక్కడ ఉందీ, ఇక్కడ ఉందీ అని చెప్పడం, ప్రజలను మోసగించడం పాపము. మత్తయి అధ్యాయం 43,44 లో చెప్పినట్లు కేవల వేషధారులైన ప్రవక్తలారా

చంపి ప్రవక్తల ఘోరీ లెంతో చక్కగా గట్టారు "తందానా"
వంటి దోమ నొడకట్టి మీరు ఒంటెను మింగెదెరు ,,
త్యాగుల రక్త ప్రవాహములో మీ లోకం మునిగేను ,,
న్యాయకరుణ ధీశాలురకా పరలోకం దక్కేను ,,

అన్న క్రీస్తు మాటలు విన్న శాస్త్రులు, పరిశయులు ఈ ప్రాంతమును వీడివెళ్లక పోయినచో హేరోదు రాజు నిన్ను చంపునని హెచ్చరించిరి. క్రీస్తు ఆ మాటలను ఖాతరు చేయలేదు. పరలోక రాజ్యంలో ప్రతివారినీ సమంగా ఆదరించ బడుననీ, ప్రతిమనిషీ తన కులాన్నీ, మతాన్ని ప్రేమించుట తప్పు కాదు అన్య మతాలను తృణీకరించుట తప్పని క్రీస్తు సందేశ మిచ్చాడు. వ్యక్తిగత ఆస్తి, అధికారాలు, గర్వాలు పోవాలని ప్రబోధించాడు. క్రీస్తు సిద్ధాంతం ప్రజల్లో సృష్టించిన పెను ప్రకంపనంలో కుహనా బోధకులు, వడ్డీ వ్యాపారులు క్రీస్తుపై రాజుకు పితూరీలు చెప్పారు.

చెరసాలలో ఉన్న యోహాను తలను రాజు నరికించాడు. ఈ ఘోరకృత్యమును విన్న క్రీస్తు ఒక చెంపను కొడితే వేరొక చెంపను చూపాలి. అజ్ఞానుల కోసం జ్ఞానఖడ్గాన్ని ఉపయోగించాలి. చావుకు భయపడేవాడు అనుక్షణం చస్తూ బ్రతుకుతూ ఉంటాడు. ధైర్యవంతుడు ఒకేసారి మరణిస్తాడని శిష్యులకు హితబోధ చేస్తాడు. ప్రతిఫలాన్ని ఆశించి ఏపనీ చేయకూడదని

మంచి తిండిని కోరవద్దు "భళి"
మంచి గృహముల వెదక వద్దు ,,
పట్టువస్త్రాల్ కోరవద్దు ,,
ప్రాణాలపై తీపి వద్దు ,,
మీరు చల్లిన మంచి ముత్యాల పైనడుచు
పందులే మిమ్ము చీల్చునన్నాడు ,,
వ్యభిచారి ఇంటి కెళ్లొద్దు ,,
వ్యసనాల పాలు కావద్దు ,,
పతిత కౌగిలి చాల ముప్పు ,,
పరస్త్రీ పొందు బహు తప్పు ,,
జారస్త్రీ కౌగిట ధనమాన ప్రాణాలు ,,
క్షీణించి పోవునన్నాడు ,,
మీ క్రియలు మీ శక్తి పెంచున్ ,,
ఆ క్రియలు ప్రజలు ప్రేమించున్ ,,
మీగొప్ప మీరెంచవద్దు ,,
మీ కొరకు ధనం కూర్చొద్దు ,,

అంటూ జ్ఞానాన్ని ప్రబోధిస్తాడు. ఐహిక సుఖాలపై వ్యామోహాన్ని చంపుకోవాలనీ, దురభ్యాసాలకు దూరంగా ఉండాలని, వ్యక్తిగత ప్రతిష్ఠకు ఆరాట పడవద్దని అప్పుడే పరలోక ప్రాప్తి కలుగుతుందని క్రీస్తు వివరించాడు.

ఆశతో కొందరుంటారు "భళాభళి"
బ్రతుకు నేరనివారి వాక్యమే ,,
భయమనే సైతాన్ మింగున్ ,,
పదిమంది నడిచెడి బాటలో విత్తువలె ,,

ఫలియించ బోదన్నాడు ,,
ప్రేమతో మధ్యరక మిన్న ,,
శ్రమల హింసల కోర్వరన్న ,,
వారిలో వెన్నుముక లేదు ,,
కోరి ద్రోహమె చేయగలరు ,,
మధ్యరకమది బోధ రాతిలో విత్తువలె ,,
రాణించబోవదన్నాడు ,,
ఇతరులూ వింటారు బాగా ,,
ఇహలోక వాంఛలే మూగా ,,
ధనకనకముల ఆశరేగ ,,
జ్ఞానబోధలు నడుచు వేగ ,,
అన్ని ఉన్నవిస్తరది ముండ్ల పొదలోజల్లు ,,
విత్తనము ఫలియించ దన్నాడు ,,
శ్రద్ధగా వాక్యాలు వినుట ,,
శ్రమయనుక ఆచరణ గనుట ,,
ముప్పదారి పదిరెట్లు పెంచు ,,
ముప్పులన్నిటి నధిగమించు ,,
మంచినేలను జల్లు విత్తనము లాబోధ ,,
మించి ఫలియించునన్నాడు.

ప్రముఖునిగా పేరు పొందాలంటే సామాన్యులందరికీ దాసునిగా ఉండాలి. మనుష్య కుమారుడు ప్రజలకు సేవ చేయుటకు వచ్చెను. దీన దరిద్రుల పాపుల కొరకు ప్రాణాలను సైతము అర్పించుటకు వచ్చెను. పరలోక మంటే మానవ లోకానికీ అతీత మైనది కాదు. మనిషిని మనిషిగా ప్రేమించే చోటు, మానవత్వం పరిమళించే చోటు పరలోకమని క్రీస్తు నిర్వచనం చెప్పాడు. పరలోకమునకు చేరు మార్గమును పోల్చిన విధము అద్భుతంగా ఉంటుంది.

వలవిసిరి సంద్రాన వేసి "భళాభళి"
వలయందు చేపలా చూసి ,,
గుంజి వల ఒడ్డుపై నేసి ,,

మంచి చేపల నేరిపోసి ,,
పనికిమాలిన వాటి పారవేసిన రీతి ,,
పరలోక రాజ్యమ్ము చేరాలి ,,

మనిషి తన మనసులోని ద్వేషం, కక్ష, కార్పణ్యం, స్వార్థాలను విడిచి పెట్టినప్పుడు మనసు నిర్మలంగా ఉంటుందని అదే పరలోక రాజ్యమని ప్రబోధించాడు. అన్యాయం పెచ్చు పెరిగినపుడు, అధర్మం తాండవించినపుడు, దుర్మార్గుల దురన్యాయాలపై సామాన్యులు తిరుగుబాటు చేస్తారని క్రీస్తు హెచ్చరించాడు. శారీరక శ్రమలకు తట్టుకోలేక మానవత్వాన్నీ, ఆత్మను చంపుకోరాదని, మానవ కళ్యాణం కోసం శరీరాన్ని హింసలకు, మరణానికి అర్పణ చేయాలని క్రీస్తు ఉద్బోధించాడు. మనిషి చేసిన మంచికి చావుండదనీ, అది అజరామరంగా నిలిచిపోతుందని చెప్పాడు.

వ్యక్తిగతమైన సంపద, అధికార బలం ఉండరాదనే సిద్ధాంతాన్ని ప్రజలలో ప్రచారం చేసి మార్పుకు, తిరుగుబాటుకు బీజాలు వేసిన క్రీస్తును శిలువను వేయాలని సర్వసంతు రాజును కోరెను. వడ్డీ వ్యాపారులు, శ్రీమంతులు, కుహనా మత ప్రబోధకులతో నిండిన శిష్టుల సభ దీనిని ఆమోదించి సిఫార్సు చేసింది. శిక్ష అమలు జరిగింది. ప్రజా విముక్తికి, ఓర్పు సహనానికి నిజమైన తొలిగుర్తుగా క్రీస్తు చరిత్ర ప్రపంచ ముఖచిత్రంపై శాశ్వతంగా నిలిచిపోయింది.

జ్ఞానజ్యోతి క్రీస్తు బుర్రకథ రచన కోసం నాజర్ బైబిల్ కొత్తనిబంధన, పాత నిబంధనలను లోతుగా అధ్యయనం చేశాడు. క్రీస్తును దైవాంశ సంభూతుడుగా కాకుండా ఒక సంస్కర్తగా, ఒక మానవతా వాదిగా నిరూపించాడు. పరలోక రాజ్యం పేరుతో కుహనావాదులు చేస్తున్న ప్రచారాల బండారాన్ని బట్టబయలు చేశాడు. పాపులను ముద్రవేసి వారిని బానిసలుగా చేసి పబ్బం గడుపు కొంటున్నారని, పాపులనగా పాపము చేసిన వారు కాదని, బానిసలనే అర్థం అనీ నాజర్ సోపపత్తికంగా చూపాడు. అహంకారం, అధికారం మత్తులో ప్రజల అమాయకత్వంతో రాజు, అధికారులు, కుహనా మత బోధకులు ఆడుకొంటున్నారని ఈ బుర్రకథ ద్వారా వివరించాడు. వ్యక్తిగత ఆస్తి ఉండరాదనే అంశాన్ని క్రీస్తు ప్రస్ఫుటంగా ప్రచారం చేసినందున నిబద్ధత కలిగిన సామాజిక విప్లవకారుడు ఏసు అని నాజర్ ఆ బుర్రకథ ద్వారా నిరూపించాడు.

1972 ప్రాంతంలో నాజర్ ఈ బుర్రకథను రచించి తొలిసారిగా గుంటూరు

జిల్లా ముట్లూరులో చెప్పాడు. క్రీస్తుపై నాజర్ బుర్రకథ రచించారనే విషయం తెలిసిన గుంటూరు జిల్లాకు చెందిన పలువురు క్రైస్తవ బోధకులు ఈ కథకు హాజరయ్యారు. పరలోక రాజ్య అంశంపై కుహనా మత బోధకులు చేస్తున్న ప్రచారాలపై క్రీస్తు ధ్వజమెత్తిన తీరును ప్రదర్శనకు హాజరైన బోధకులు ప్రశ్నించారు. అణగారిన జనాన్ని క్రీస్తు చైతన్యవంతం చేసిన తీరును కూడా ఆక్షేపించారు. ఈ అంశాలపై నాజర్ తన వాదనను బలంగా నిరూపించాడు. తాను పాత, కొత్త నిబంధనలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన తీరు వివరించడమే కాకుండా బోధకులకు ఆధారాలను చూపాడు. క్రీస్తును ఒక కమ్యూనిస్టుగా, ఒక సోషలిస్ట్‌గా చిత్రించారని బోధకులు వాదించారు. తమ సూచనల మేరకు మార్పులు చేసిన పక్షంలో ఈ కథను రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించే ఏర్పాట్లు చేయగలమని చెప్పినా నాజర్ మార్పులకు అంగీకరించలేదు. ఈ కథను ముట్లూరులో చెప్పిన తరువాత ఆపివేశారు. జ్ఞానజ్యోతి క్రీస్తు బుర్రకథ కోసం బైబిల్ అధ్యయనం చేయడంతో క్రీస్తులో ఒక గొప్ప సంస్కర్త కనిపించాడు. నాజర్ ఇంట్లో అప్పటి వరకూ ఉన్న కారల్‌మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, మావో, స్టాలిన్ ఫొటోల మధ్య జీసెస్ ఫొటోను చేర్చారు. విశ్వవ్యాప్తంగా బహుళ ప్రచారంలో ఉన్న జీసెస్ చరిత్రలో నూతన కోణాలను ఆవిష్కరించిన తీరు ఆయన ఆలోచనా ధృక్పధానికి, పరిశీలనా శక్తికి దర్పణంగా నిలుస్తుంది.



# 12

# ఇతర బుర్రకథలు

**స**ర్‌హ్యూమ్ నుండి గాంధీ, నెహ్రూ, ప్రకాశం వరకూ కాంగ్రెస్ నిర్వహించిన సత్యాగ్రహాలు, సమ్మెలు, అల్లూరి వంటి వీరయువకుల పోరాటాలు, సైనికుల తిరుగుబాటు, స్వాతంత్ర సముపార్జన వంటి అంశాలను ఇతివృత్తంగా తీసుకొని **"స్వతంత్ర భారతం"** అనే బుర్రకథను రచించి ఆకాశవాణి ద్వారా వినిపించారు. కళాపోషకుడైన గన్నాబత్తుల పెదతాత కోరికపై ఆయన కథను బుర్రకథగా రచించి భీమవరంలో చెప్పారు. ఈ సందర్భంగా గన్నాబత్తుల పెదతాత కుమారుడైన నారాయణమూర్తి వంతగా పాల్గొని ముచ్చట తీర్చుకొన్నాడు. చైనా ప్రతినిధి బృందం గుంటూరుకు వచ్చిన సందర్భంలో భారత చైనా మిత్రమండలి కోరిక మేరకు డాక్టర్ కోట్నీస్ జీవనగాథను నాజర్ పదిహేను నిముషాల బుర్రకథగా రచించాడు. ఈ కథను గుంటూరు శ్రీ వెంకటేశ్వర విజ్ఞాన మందిరం ఆవరణలో చెప్పాడు. నాజర్ పెద్ద కుమారుడు సాయిబాబా వంతగా వ్యవహరించాడు.

## ఇతరుల రచనలు

సుంకర సత్యనారాయణ రచించిన కష్టజీవి బుర్రకథను నాజర్ వందలాది చోట్ల చెప్పాడు. రామకోటి, కర్నాటి లక్ష్మీనరసయ్య వంతలుగా వ్యవహరించారు. ప్రజానాట్యమండలిపై నిషేధం ఎత్తివేసిన తరువాత పార్టీ కార్యకలాపాలు నచ్చక దూరంగా జరిగాడు. **"కష్టజీవి కథలో మధ్య తరగతి, ధనిక రైతుల బిడ్డలైన నాగయ్య భీమయ్య అనే పాత్రలను సృష్టించి వారిని కమ్యూనిస్టు నాయకులుగా, త్యాగమూర్తులుగా చిత్రించి ఆడిపాడి మేము ఏడ్చి జనాలను ఏడ్పించి మధ్యతరగతి, ధనిక రైతు యువకులు**

**కమ్యూనిస్టు నాయకులుగా ఆక్రమించేటట్లు చేశామని భావిస్తున్నాను. చదువు, విజ్ఞానం లేని గ్రామీణ కార్మిక, కర్షక కూలీలను నాయకుల వేషాలలో ఉన్న ధనిక రైతుల పాదాల కింద పడవేశానని, గొప్ప తప్పు జరిగిందని గమనించి కష్టజీవి కథను చెప్పడం ఆపేసాను"** అంటూ నాజర్ తన ఆత్మకథ **పింజారీ**లో పేర్కొన్నాడు.

నాజర్ 'పిట్టలదొర', 'నా చేతి మాత్ర' ఏకపాత్రలను రచించినట్లు పలు సందర్భాలలో పేర్కొన్నప్పటికీ అవి అలభ్యం.

## వెండితెరపై మోగిన తంబురా

ప్రజానాట్యమండలి దర్శకుడు, ప్రజా కళల నిర్దేశకుడు డాక్టర్ గరికపాటి రాజారావు స్వీయదర్శకత్వంలో నిర్మించిన 'పుట్టిల్లు' చిత్రంలో నాజర్ బుర్రకథను చిత్రించారు. ఈ బుర్రకథను సుంకర సత్యనారాయణ రచించాడు. కథానాయిక సుశీల (జమున) పై రాఘవరావు (రాజారావు) పురుషాధిక్యతను ప్రదర్శించే సన్నివేశం తరువాత సుశీలను ఇంటి నుండి గెంటివేస్తాడు. సుశీల వీధిలోకి వచ్చిన సందర్భంలో నాజర్ బుర్రకథ ప్రారంభమౌతుంది. ఈ సన్నివేశంలో రాణి రుద్రమ్మ బుర్రకథ జరుగుతుంది. రాణి రుద్రమ్మ వంటి ధీరవనితలు పుట్టిన నేలలో

| | |
|---|---|
| పుట్టెడు కూటికి బానిసయై | "తందానా" |
| ఏడుపాట్లు పాట్లగాదో | ,, |
| ఇంటికుక్కకు ఉన్నంత విలువ | ,, |
| నేడిల్లాలికి లేదా | ,, |
| ఇంటి దాసిగా ఉంటానని | ,, |
| పతినెంతా వేడుకొనినా | ,, |
| జాలిదలచక నవ్వెపకపకా | ,, |
| కాలదన్నెమగడు | ,, |
| ఆలిని బటబట బైటకీడ్చునా | ,, |
| అపనిందలు మోపి | ,, |
| వలవల కులసతి | ,, |
| కన్నీరాలక బోయుటేలా | ,, |
| నిలువనీడ లేదాయె గదమ్మా | ,, |
| నీకుసుగుణ శీల | ,, |

రుద్రమదేవి పుట్టిన నేలపై నేటి మహిళల దుస్థితిని గూర్చి ఈ బుర్రకథలో కళ్లకు కట్టినట్లు సుంకర చిత్రించాడు. అంతే రసాత్మకంగా చిత్రంలో నాజర్ ఈ బుర్రకథను డాక్టర్ రాజారావు చిత్రించాడు. నాజర్‌కు వంతలుగా రామకోటి, కర్నాటి లక్ష్మీనరసయ్య నటించారు. బుర్రకథను చిత్రీకరించే సమయంలో నాజర్ మద్రాసులో ఉన్నాడు. ఖాళీ సమయాలలో 'ఆసామి' నాటక రచన చేశాడు. ఈ షూటింగ్ సమయంలో స్టిల్ ఫొటోగ్రాఫర్ వి.యన్.రెడ్డి తీసిన నాజర్ బుర్రకథ ఫొటో అద్భుతంగా ఉంటుంది. నలుపు తెలుపు ఫొటోలతో ఈ ఫొటో ఇప్పటికీ గొప్ప ఫొటోగా గుర్తింపును పొందింది. లండన్ రాయల్ సొసైటీకి ఈ ఫొటోను పంపిస్తే ఫొటోగ్రాఫర్ తీసింది శిల్పాలనని భావించారు. నేపథ్యంలో స్ట్రీకింగ్ ఎఫెక్ట్‌ను సాధించడానికి వైట్‌డోమ్‌కు తాటాకును కట్టారట. ఈ చిత్రంలో బుర్రకథను రికార్డు చేసే సమయంలో నాజర్ గాత్ర మాధుర్యాన్ని విన్న సినీ సంగీత దర్శకులు యస్.రాజేశ్వరరావు నెలకు ఐదువందల జీతం ఇవ్వడంతో పాటు నెలకొక పాటను ఇస్తాను. మద్రాసులోనే ఉండిపొమ్మని కోరారు. **"ఇదొక ప్రత్యేక లోకం లాగా ఉంది. నేను ఇమడలేనని"** నాజర్ సున్నితంగా తిరస్కరించాడు.

ఒక రోజు నాజర్‌కు కోయంబత్తూరు నుండి అత్యవసరంగా బయలుదేరి రమ్మని టెలిగ్రాం మనీఆర్డర్ వచ్చింది. రామకోటి అప్పటికే మద్రాసులో ఉన్నందున నాజర్ కర్నాటిని తీసుకొని వెళ్లారు. మద్రాసులో నాజర్‌కు ఆచార్య ఆత్రేయ స్వాగతం పలికాడు. శ్రీరాములునాయుడు తాను తీస్తున్న 'అగ్గిరాముడు' చిత్రంలో నాజర్‌ను అల్లూరి సీతారామరాజు బుర్రకథను చెప్పాలని కోరారు. కానీ అప్పటికే సీతారామరాజు కథపై ప్రభుత్వం నిషేధం విధించిన సంగతిని నాజర్ నాయుడు గారితో చెప్పాడు. నిషేధం విషయం తనకు వదిలిపెట్టి మీరు సినిమాకు సరిపడా కథను వ్రాసి ప్రాక్టీస్ చేయమని నాయుడుగారు చెప్పారు. అప్పటికే నాజర్ రామరాజు చరిత్ర బుర్రకథను రచించి ఎన్నో ప్రదర్శనలిచ్చారు. సినిమాలో చెప్పిన పదినిముషాల కథ కోసం గతంలో వ్రాసిన కథను సంక్షిప్తీకరించి రిహార్సల్స్ చేశారు. రిహార్సల్స్ సమయంలో రష్యా నుండి వచ్చిన సాంస్కృతిక బృందం పాట ఆరోహణ, అవరోహణల విషయంలో నాజర్‌కు ఎన్నో సూచనలిచ్చారు. షూటింగ్ సమయంలో రామారావు, భానుమతి ప్రతిరోజూ హాజరై నాజర్ కథను ప్రత్యేకంగా వినేవారు. అల్లూరి సీతారామరాజును కాల్చిన సమయంలో



**పుట్టిల్లు చిత్రంలో రుద్రమ్మ కథ చెబుతున్న నాజర్, రామకోటి, కర్నాటి**



**అగ్గిరాముడు చిత్రంలో కథ చెబుతున్న నాజర్**

గుండు తగలగానే "అబ్బా" అనే మాటను సహజత్వం కోసం పదమూడు టేకులుచేశారు. ఈ సమయంలో అక్కడే ఉన్న భానుమతి "నాయుడు గారూ నాజర్‌గారు చెప్పేది ఉద్రేకం. ఆ ఊపును ఉన్నది ఉన్నట్లు తీయాలంటే అమెరికా, రష్యాలలో లాగా నాలుగు వైపులా కెమేరాలను పెట్టి తీస్తే వస్తుంది. ఒక్క కెమేరాతో ఆయనను శ్రమ పెట్టకుండా

ఆ షాట్ ఓ.కె. చెయ్యండని" సూచించింది. నాజర్ గారి దగ్గర ఇంత గొప్ప కళ ఉందని తెలియదు. ఇలాంటి ప్రదర్శన నేనింత వరకూ చూడలేదని భానుమతి ప్రశంసించారు. మొదట పదినిముషాలు అనుకొన్న కథను రికార్డింగ్ సమయంలో తొమ్మిది నిముషాలకు కుదించారు. సంగీత దర్శకుడు రికార్డింగ్ రోజున నాజర్ గారూ మైక్ మోత పెడుతుంది. కాస్త స్వరం పెంచి పాడండని కోరారు. ఆ మాట విన్న నాయుడు గారు సౌండ్ ఇంజనీర్ ఏం చేస్తున్నాడయ్యా.. ఐదువేలు ఆయనకు ఎందుకిస్తున్నాం.. నాజర్ గారు మీ ఇష్టం వచ్చినట్లు పాడండి. వేలమంది నీ ఎదురుగా ఉన్నారనుకొని పాడు" అన్నాడు. రికార్డింగ్ రెండు రోజులు పట్టింది. నాయుడు గారు అనుకొన్నదానికన్న వెయ్యి రూపాయిల డబ్బు, చిత్రీకరణలో ఉపయోగించిన దుస్తులు, బుర్రకథ చేసిన గ్రామ్‌ఫోన్ రికార్డు ఇచ్చారు. అగ్గిరాముడు సినిమా చూచిన తరువాత తాను చెబుతున్న బుర్రకథలో కొన్ని లోపాలున్నట్లుగా గమనించారు. అచ్చమైన తెలుగు జానపద బాణీల కోసం సుబ్బదాసు వంటి వీధి భాగవత కళాకారులను కలిసి తనకు రాగాలను నేర్పాలని కోరారు.

'భలే బావ' సినిమాలో కథ చెప్పేందుకు ఆహ్వానం వచ్చింది. ఈ సినిమాలో "జానకీ వనవాసం" చెప్పారు. కథను కూడా నాజరే వ్రాయగా వంతలుగా రామకోటి, కర్నాటి లక్ష్మీనరసయ్య వ్యవహరించారు. 'పెత్తందార్లు' చిత్రంలో బుర్రకథ చెప్పాలని నిర్మాత యు.విశ్వేశ్వరరావు, దర్శకులు సి.యస్.రావు కబురు చేశారు. ఈ సినిమాలో బుర్రకథకునిగా ఘంటసాల చేత పాడించారు. బుర్రకథ చెప్పే విధానాన్ని నాజర్ ఘంటసాలకు నేర్పించారు. చిత్రీకరణలో ప్రధాన కథకునిగా నటించిన పద్మశ్రీ నందమూరికి కూడా నాజర్ అడుగులు, అభినయం నేర్పారు. చిత్రీకరణ పూర్తయ్యాక "మళ్లీ మనిద్దరి కలయిక ఎప్పుడో" అంటూ యన్.టి.ఆర్. ఆలింగనం చేసుకొన్నారు.

'నిలువుదోపిడీ' చిత్రంలో బుర్రకథ కోసం విశ్వేశ్వరరావు నాజర్‌ను పిలిపించాడు. పంచాయితీ సమితి అధ్యక్షుడు ప్రజలను ఎలా నిలువుదోపిడీ చేస్తున్నాడో వివరించే కథ ఇది. ఎన్నికల్లో గెలవడానికి డబ్బు వెదజల్లడం, సర్పంచ్‌లను కొనుగోలు చేసి సమితి అధ్యక్షులుగా గెలుపొందడం, ఎరువులను బ్లాక్ మార్కెట్‌చేసి రైతులకు అన్యాయం చేయడం, కరువు సమయంలో విదేశాల వారు పంపిన పాలపొడిని పిల్లలకు



భలేబావ చిత్రంలో కథ చెబుతున్న నాజర్



పెత్తందార్లు చిత్ర రికార్డింగ్‌లో పాల్గొన్న నాజర్

పంచకుండా అమ్ముకోవడం వంటి అవినీతి అక్రమాలను నాజర్ ఈ కథలో వివరించాడు. నాజర్ ఈ పాటను పాడగా చిత్రంలో బుర్రకథకునిగా అనుభవమున్న రాజబాబు అభినయించాడు.

# 13

# నాజర్ నాటక ప్రస్థానం

**జా**తిని జాగృతం చేసేదీ, జాతి జీవనాన్ని ప్రతిబింబించేదీ నాటకం. విభిన్న రుచులు కలిగిన జనావళికి ఏకపత్ర సమారాధన చేసేది నాటకం. పెను నిద్దుర వదిలించి.. పరిపూర్ణ బ్రతుకుకు దారులు వేసేది నాటకం. ఉద్యమాలకు ఊపిరి పోసింది, పోరాటాలకు పురుడు పోసింది నాటకం. కందుకూరి చేతి చలువతో తెర తొలిగిన తెలుగు నాటకం గురజాడ చేతిలో పాశుపతాస్త్రంగా మారింది. కాళ్లకూరి వంటి కవులు సంస్కరణోద్యమానికి నాటకాన్ని పదునైన ఆయుధంగా సంధిస్తే జాతీయోద్యమంలో దామరాజు వంటి కవులు నాటకాన్ని ప్రచండమైన శక్తిగా మలిచారు. ప్రజా నాట్యమండలి వేదికపై సుంకర, వాసిరెడ్డి తెలంగాణా ఉద్యమాన్ని నాటకం ద్వారా శతఘ్నులుగా పేల్చారు. అటువంటి తెలుగు నాటక ప్రస్థానంలో ప్రజా నాట్యమండలి వృక్షానికి పుట్టిన ఒక కొమ్మగా నాజర్ నిలిచారు. బాల్యం నుండీ నటనపై ఆసక్తి కలిగిన నాజర్ నటునిగా, నాటక రచయితగా కూడా రాణించాడు.

పుట్టిపెరిగిన పొన్నెకల్లులో విద్యార్థిగా ఉన్న నాజర్ పాఠశాల వార్షికోత్సవంలో ద్రోణవిజయం నాటికను ప్రదర్శించాడు. ఈ నాటికలో కథానాయకుడైన ద్రోణుని పాత్రను పోషించాడు. కోటదాసు స్ఫూర్తి జన్మత: సంక్రమించిన గానకళతో ఆ పాత్రలో చక్కగా నటించి జనం మెప్పులను పొందాడు. నాటకం వేసిన మరునాడు పంతులు గారు నాజర్‌ను దగ్గరకుతీసుకొని ముందు ముందు నువ్వు గొప్పగాయకునిగా పేరు తెచ్చుకొంటావని ఆశీర్వదించారు. పంతులుగారు ఈ సందర్భంగా ఐదు రూపాయిల నగదు, పుస్తకం, పెన్సిల్‌ను బహూకరించారు. కాస్త వయస్సు పెరిగిన తరువాత పొన్నెకల్లులో శ్యామలరెడ్డి అనే భూస్వామి పొద్దునే నాజర్ గారింటికి వచ్చారు. నాజర్

తండ్రి మస్తాన్‌తో ఈ ఏడాది శ్రీరామనవమి ఉత్సవాలలో కనకతార నాటకం వేస్తున్నాము. ఇందులో నాజర్ చేత కనకసేనుడి పాత్ర వేయించాలని నిర్ణయించామని పోర్షన్ కాగితాలు ఇచ్చివెళ్లారు. నాలుగు నెలల రిహార్సల్స్ తరువాత నాటకాన్ని ప్రదర్శిస్తే పది గ్రామాల ప్రజలు బళ్లు కట్టుకొని వచ్చారు. కనకసేనుని పాత్రలో నాజర్ పేరు పది ఊళ్లలో నానిపోయింది. ఈ నాటకానికి సంగీతం నేర్పిన హార్మోనిస్ట్ తెనాలి ఖాదర్‌సాహెబ్ మస్తాన్ వద్దకు వచ్చి మీ అబ్బాయి మంచి గాయకుడు నాతో పంపిస్తే బాగా చదివించి మంచి గాయకునిగా తీర్చి దిద్దుతానని కోరాడు. తల్లి వద్దని వారిస్తున్నా తండ్రి మాత్రం నాజర్‌ను ఖాదర్‌తో పంపాడు.

తెనాలి ప్రస్థానం నాజర్ జీవితాన్ని అద్భుతమైన మలుపు తిప్పింది. త్రిపురారిభొట్ల దాసు బాలరత్నసభ అనే నాటక సమాజాన్ని పెదరావూరి కేంద్రంగా నిర్వహించేవారు. నాజర్‌ను ఖాదర్ ఆ నాటక సమాజంలో చేర్చాడు. దాసుగారు నాజర్‌ను కన్నబిడ్డ లాగా చూసుకొనేవారు. రామదాసు, తులాభారం, శ్రీకృష్ణలీల, రాధాకృష్ణ వంటి నాటకాలలో నాజర్ చేత స్త్రీపాత్రలను ధరింపజేశారు. దాసుగారి కఠోరమైన దర్శకత్వంలో నటన, గానాలలో ఎన్నో సంగతులను నేర్చుకొన్నాడు. రామదాసు నాటకంలో నాజర్ చాందిని పాత్రను పోషించేవాడు. ఈ పాత్ర పోషణ కోసం నాజర్ తెనాలిలో ఒక మేళగత్తె వద్ద నాట్యాన్ని కూడా నేర్చుకొన్నాడు. బాలరత్నసభ సమాజం ద్వారా రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో సభ నాటకాలను ప్రదర్శించాడు. కాంట్రాక్టర్లలో వచ్చిన పేచీలతో బాలరత్నసభ మూతపడింది.

నర్సరావుపేటలో మురుగుళ్ల సీతారామయ్య వద్ద సంగీత శిష్యరికం చేస్తున్న సందర్భంలో మేనమామ అక్కడకు వచ్చాడు. తెనాలి బాలరత్నసభలో ఉన్న నీతోటి కళాకారులందరూ బాల మహమ్మదీయ సభ పేరుతో నాటకాలను ప్రదర్శిస్తున్నారు. నీ చేత వేషం వేయించడానికి తీసుకురమ్మన్నారని చెప్పాడు. బంధువుల పెళ్లి అని గురువుగారికి అబద్ధం చెప్పి అమ్మమ్మ గారి ఊరు గారపాడుకు చేరాడు. కొన్నాళ్ల పాటు పరిసర గ్రామాలలో నాటకాలను ప్రదర్శించారు. అదికూడా మూతపడింది. పొన్నెకల్లు గ్రామంలో మిత్రులను పోగుచేసి పండుగలు, పబ్బాలకు నాటకాలు వేయడం ప్రారంభించాడు. పాదుకా పట్టాభిషేకంలో కైకేయి, ఖిల్జీ రాజ్యపతనంలో కమలారాణి వంటి స్త్రీ పాత్రలను నాజర్ గొప్పగా పోషించి మంచిపేరు తెచ్చుకొన్నాడు. నాజర్ గరికపాటి రాజారావు ఆధ్వర్యంలో నడుస్తున్న రాష్ట్ర ప్రజానాట్యమండలి దళంలోకి

గుంటూరు జిల్లా దళానికి చెందిన నాజర్, రామకోటిని ఎంపిక చేశాడు. రాష్ట్రదళంలో చేరిన నాజర్ నటనతోపాటు డప్పుల నృత్యాలు, కూచిపూడి, భరతనాట్యాలలో ప్రత్యేక శిక్షణ పొందాడు. అహ్మదాబాద్‌లో జరిగిన అఖిలభారత ప్రజానాట్యమండలి సభల్లో జానపద కళల విభాగంలో నాజర్ బృందానికి ప్రథమ బహుమతి లభించింది. రాష్ట్రదళంలో ప్రవేశించిన తరువాత మా భూమి నాటకంలో జగన్నాథరావు దేశ్‌ముఖ్ పాత్రను, క్రీప్సు రాయబారంలో నవాబు పాత్రలను పోషించాడు.

## మా భూమి (నాటకం)

తెలుగునాటక రంగ చరిత్రలో అత్యధిక ప్రదర్శనలు పొందిన నాటకంగా మా భూమి రికార్డులు సృష్టించింది. ప్రదర్శనా పరంగా సంచలనం సృష్టించడమే కాకుండా పాలకుల గుండెల్లో సింహస్వప్నమై నిలిచింది. తెలంగాణా దొర దేశ్‌ముఖ్‌ల దౌర్జన్యాలను నిరసిస్తూ దిక్కులు పిక్కటిల్లేలా సింహనాదం చేసి విజయం సాధించిన వృత్తాంతమే ఇందులోని ఇతివృత్తం. నల్గొండ జిల్లాలో జరిగిన ప్రజాపోరాటాన్ని గురించి ఈ నాటకం వ్రాయబడింది. ఆ పోరాటంంలో 240 గ్రామాలపై పోలీసు దాడులు జరిగాయి. 2500 మంది అక్రమంగా నిర్బంధించబడ్డారు. 15,390 మంది నైజాం ప్రభుత్వ హింసాకాండకు గురయ్యారు. యాభైరెండుమంది వీరులు ప్రాణాలు కోల్పోయారు. అరవైనాలుగు మంది మహిళలు మానభంగాలకు గురయ్యారు. ఈ మహోజ్వల పోరాటం ఇతివృత్తంగా సుంకర-వాసిరెడ్డి కవులు మా భూమి నాటకాన్ని రచించారు. ఈ నాటకాన్ని ప్రభుత్వం నిషేధించింది. ఈ నాటకంలో తెలంగాణాలోని దొరతనాన్ని నరనరాన జీర్ణించుకొన్న జగన్నాథరావు దేశ్‌ముఖ్ పాత్రను నాజర్ అత్యద్భుతంగా పోషించారు.

## సిమ్లా భాగవతం

బ్రిటీష్ ప్రభుత్వం భారతదేశాన్ని పీల్చి పిప్పిచేసి స్వాతంత్ర్యం ఇచ్చి వెళ్లే సమయంలో జాతిని నిట్టనిలువునా రెండుగా చీల్చిన కుట్రను కళ్లకు కట్టినట్లు చూపిస్తూ కోగంటి గోపాలకృష్ణయ్య సిమ్లా భాగవతం నృత్యనాటికను రచించాడు. బ్రిటీష్ ప్రభుత్వం హిందూ, ముస్లీంల మధ్య విభేదాలు సృష్టించి భారతదేశాన్ని రెండుగా విభజించడం ఇందులోని ఇతివృత్తం. హిందూ ముస్లింల మధ్య కలహాలు పెరిగిపోయి విచ్చలవిడి హత్యాకాండ జరుగుతుంది. రక్తం కాలువలై ప్రవహించింది. ఈ స్థితిలో కొందరు నాయకులు ప్రజలను జాగృతం చేస్తారు. మత విభేదాలను మరచి అందరూ ఒక్కటిగా తెల్లవారిపై

పోరాటానికి ముందడుగు వేసిన ఇతివృత్తంతో కోగంటి గోపాలకృష్ణయ్య ఈ నృత్యనాటికను రచించాడు. ఈ నృత్య నాటికలో నాజర్ భూపాల్‌నవాబు పాత్రను పోషించగా క్రిప్స్ పాత్రను డాక్టర్ రాజారావు, లారెన్స్ పాత్రను రామకోటి, అలెగ్జాండర్ పాత్రను పురుషోత్తం, నేవెల్ పాత్రను మిక్కిలినేని, సర్దార్ పటేల్‌పాత్రను కోగంటి గోపాలకృష్ణయ్య, నెహ్రూ పాత్రను సత్యం, జనాబ్ జిన్నా పాత్రను మాచినేని వెంకటేశ్వరరావు, పి.సి.జోషి పాత్రను వల్లం నరసింహారావు పోషించారు.



**దేశ్‌ముఖ్ పాత్రలో నాజర్**

## ఆసామి నాటకం

మట్టికానిదీ, మట్టినుండి రానిదీ ఏదిలేదు. బ్రతుకును బ్రతికించేదీ, నిలబెట్టి కదిలించే కీలక మూలకం మట్టి. మట్టి చరిత్రే మనిషి చరిత్ర. ఈ ప్రపంచం అంతా మట్టిమీద, కాదంటే మట్టిమనిషి మీదా నిలబడుతుంది. అద్భుత జీవశక్తితో పాటు అమేయమైన సృజనాత్మక శక్తి మట్టిలో దాగిఉంది. ఆ సృజనను వెలికి తీసిన మానవ మూల పురుషుడు భూమిపుత్రుడు. ఆ భూమిపుత్రుడు అలనాటి రాచరిక వ్యవస్థ నుండి ఈ వర్తమాన ప్రజాస్వామ్య వ్యవస్థ దాకా యుగయుగాలుగా, తరతరాలుగా దోపిడీకి గురౌతూనే ఉన్నాడు. చారెడు నేలను కాపాడుకోవడం కోసం ఉసురులు పోగొట్టు కొంటున్న నేపథ్యంలో ఆ రైతుకు ఆగ్రహం వస్తే అతడి చేతిలో తిండి గింజలే వడిసెల రాళ్లవుతాయి. కాదంటే బండల్ని పగలగొట్టే మందు గుళ్లవుతాయి. ఎండకు ఎండుతూ, వానకు తడుస్తే ఆరుగాలం శ్రమిస్తున్న రైతు కురుక్షేత్రంలో శాపగ్రస్తుడైన కర్ణుని వంటివాడు. భూమికోసం, భుక్తికోసం, విముక్తికోసం కర్షకుడు చేస్తున్న అవిశ్రాంత పోరాటంలో ఒక కోణమే నాజర్ రచించిన ఆసామి నాటకం.

తెలుగు వారి గ్రామీణ జీవితాన్ని, అందునా రైతన్న వ్యధలూ, కథలూ, సుధలను నాటకంలో తొలినాళ్లలో అక్షరబద్ధం చేసిన ఘనత నార్ల, సుంకర, వాసిరెడ్డికి దక్కుతుంది.

నార్ల కర్షక జీవితంలోని చీకటి వెలుగులను విశ్లేషిస్తే సుంకర వాసిరెడ్డి దురహంకార దౌర్జన్యాల ఉక్కుపాదాల కింద చిట్లిపోతున్న రైతాంగ వ్యధలను, వారి తిరుగుబాట్లను విశదీకరించారు. కవి భావనా బలం అమేయమైనది. నిశితమైన లోక వృత్త పరిశీలనలో కవి ఒక అంశాన్ని యథాతథంగా చిత్రీకరించవచ్చు. మనలను కదలించవచ్చు. ఆ కవి తన వృత్తి రంగాన్ని కవితా వస్తువుగా తీసుకొన్నప్పుడు ఆ రచనలో కనిపించే జీవం, ఆత్మీయత, సహజత్వం, గుండె పట్టులను కదిలిస్తాయి. రెండెకరాల ఆసామిగా అరణాల కూలీగా మట్టితో అనుబంధమున్న నాజర్ కవిత్వంలో పల్లెవాసన గుభాళిస్తుంది. రోహిణీ కార్తెలో ఎండలకు నెర్రెలు బారిన నేలపై తొలకరిజల్లు కురిసినప్పుడు వెలువడే కమ్మని వాసనకు లక్ష బుడ్ల అత్తరులు, కోటి అగరొత్తులు సాటిరావు. ఆ వాసన నాజర్ చేసిన రైతు వర్ణనలో అడుగడుగునా పరిమళిస్తుంది.

ప్రజానాట్యమండలి రాష్ట్ర దళంలో పనిచేసే సమయంలో నాజర్ విజయవాడలో ఉండేవాడు. ఆంధ్రా ఆర్ట్స్ థియేటర్ సభ్యుల సలహాలతో 1953లో నాజర్ ఈ నాటక రచన ప్రారంభించారు. **"ఇది మొదట నాటక రచన. ఇందులో చాలాభాగం నాస్వానుభవమని చెప్పాలి. నేటి మధ్య తరగతి రైతు మనస్తత్వం, అనతి ఆశలు, కోర్కెలు, ఊహలు, యదార్థ జీవితంలో ఎలా విచ్ఛిత్తి అవుతున్నాయో, తాను ఆసామిగా మనలేక కూలీగా, పాలేరుగా, కడకు బికారిగా ఏగోడ నీడనో రాలి పోయే స్థితికి ఎలా దిగజారి పోతున్నాడో చెప్పాలని నా ప్రయత్నం"** అని నాజర్ నాటకం ముందు మాటలో పేర్కొన్నారు. ఈ నాటకంలో ఇతివృత్తం రైతులు, రైతు కూలీల చుట్టూ తిరుగుతుంది. భూస్వాముల దురాగతాలు, రైతన్నల ఉక్రోషాలు, ఆక్రోశాలతో నడుస్తుంది. బాధలకు, భయాలకు లొంగి వంచిన తల ఎత్తితే ఏ పరిణామాలకు దారి తీస్తుందో, మట్టి పిసుకుతూ, అరక దున్నుతూ, కోతకోస్తూ, కుప్ప నూరుస్తూ కాయలు కాసిన చేతివేళ్లు పిడికిలిగా బిగుసుకొంటే అన్యాయం ఎలా తోక ముడచి పరుగెడుతుందో నిరూపిస్తూ అద్భుతంగా చెక్కిన నాటకం ఆసామి.

ధర్మయ్య భూస్వామి. పాముకి అన్న పులికి తమ్ముడు. కనపడిన నేలనంతా తన పాదాక్రాంతం చేసుకోవడం అతని నైజం. అతను విసిరే నోట్ల కట్టలతో చట్టం అతనికి చుట్టంగా మారిపోయింది. కళ్ల బెదిరింపులు, దౌర్జన్యాలు, కాదంటే కోర్టుకు లాగడం అతని రివాజు. ప్రామిసరీ నోట్లలో మతలబులు చేయడం, అర్థంగాని గజిబిజితో చిత్రగుప్తుడి లెఖ్ఖలు వ్రాయడం డబ్బు గుంజడం, అతనికి వెన్నతో పెట్టిన విద్య. శ్రీరంగం



ప్రజానాట్యమండలి రాష్ట్రదళం

ఆయన గుమస్తా. నక్కజిత్తుల్ని నరనరాన జీర్ణించుకొన్న మహానీచుడు. ఆ గ్రామంలో జరుగుతున్న దోపిడీ పరాయణత్వానికి ధర్మయ్య కర్త అయితే శ్రీరంగం క్రియ. అమరయ్య అవసరాలను తీరుస్తున్నట్లుగా నమ్మించి లొంగదీసుకొంటాడు. అమరయ్య దృష్టిలో ధర్మయ్య మంచివాడు. చలమయ్య వంటి కులవృత్తులవారిని, దాసు వంటి కూలీలను అదిరించి, బెదిరించి వారికి డబ్బు ఎగవేస్తాడు. ప్రసాద్ అమరయ్య కుమారుడు. అభ్యుదయవాది. గ్రామంలో ఎవరికి ఏ సమస్య వచ్చినా స్పందించే మనిషి. ఊరిచెరువు విషయంలో ధర్మయ్య, గ్రామస్తుల మధ్య వివాదం రాజుకుంటుంది. నోరున్న మహారాజు ఏ చెరువునైనా దున్నుకోవడం నేరమా అని ప్రసాద్ ప్రశ్నిస్తాడు. దగాపడిన ప్రజలను తిరుగుబాటుకు సమాయత్తం చేస్తాడు. ఈ విషయంలో ధర్మయ్యకు ఎదురు తిరగవద్దని అమరయ్య కొడుకును హెచ్చరిస్తాడు. తండ్రీ కొడుకుల మధ్య మాటామాటా పెరుగుతుంది.

గ్రామ రైతుల పక్షాన మాట్లాడటానికి ప్రసాద్ ధర్మయ్య ఇంటికి వస్తాడు. పండని ఏడు కూడా రైతులను దోచుకు తినడం పద్ధతి కాదని ప్రసాద్ హెచ్చరిస్తాడు. చెరువును తాను దున్ని స్వాధీనం చేసుకొంటానని ధర్మయ్య ధీమాగా చెబుతాడు. ఆ చెరువు తన స్వంతమైనందున రైతులు దున్నడానికి వీలులేదని ధర్మయ్య కోర్టు నుండి స్టే తెస్తాడు.

కౌలుదారీ చట్టం వస్తుందనగా స్వంత సాగంటూ రైతుల గొంతులను కోయడానికి ప్రయత్నిస్తే అందరం ప్రతిఘటిస్తామని ప్రసాద్ అంటాడు.

బంధించుట కెవరి తరం
దండించుట దెవరి బలం
ఏది బలం ఎవరి తరం
మా శక్తిని ధారవోసి
శ్రమ శక్తిని వార పోసి
ఘన సంపద నిర్మిస్తాం
జనక్షేమం సాధిస్తాం "బంధి"
మముకాదని హద్దు మీరి
తమదేనని తలమోటిన
మెలివేయును కౌలుపొలం
బలిదీయును ప్రజాబలం
ఏది బలం.. ఎవరి తరం.. "బంధి"

అంటూ ప్రసాద్ గ్రామస్తులను ఏకంచేసి ఉద్యమిస్తాడు. ధర్మయ్య చెరువు పొలాన్ని దున్నడానికి ప్రయత్నిస్తే ప్రసాద్ నాయకత్వంలో రైతులు అడ్డగిస్తారు. రైతు కూలీ దాసును ధర్మయ్య కొరడాతో కొట్టి హింసిస్తాడు. రైతులు తనపై దౌర్జన్యం చేస్తున్నారని ధర్మయ్య శ్రీరంగం ద్వారా పోలీసులకు ఫిర్యాదు చేస్తాడు. సర్కిల్ ఇన్స్పెక్టర్ విచారణ కోసం గ్రామానికి వచ్చినప్పుడు అతనికి డబ్బాశ చూపి లొంగదీసుకొంటాడు. దాసుపై ప్రసాద్ రైతులను ఉసిగొల్పి దాడి చేసారని ధర్మయ్య ఇన్స్పెక్టర్‌కు ఫిర్యాదు చేస్తాడు. ఇన్స్పెక్టర్ ప్రసాద్‌ను అరెస్ట్ చేస్తాడు. గ్రామంలోని రైతాంగమంతా ఏరువాక పండుగను కోలాహలంగా చేసుకొంటున్న తరుణంలో ధర్మయ్యకు చెల్లించవలసిన రూ. 1700 అప్పు వసూలు కోసం ఇల్లు, ఎద్దులు జప్తు చేయాలంటూ కోర్టు అమీనా వస్తాడు. దున్ని పండించి దేశానికి జీవం పోసే రైతులకు అధికారం లేదు. ఒక్కసారి గద్దెనెక్కి ప్రభువైన వాడు ఎంత క్రూరంగా ప్రవర్తించినా వాడిని గద్దెనుండి దొర్లించే అధికారం ప్రజలకు తెలియదని ప్రసాద్ అంటాడు. తాను ఏడువందలే ఇవ్వాలని, తనపై ఇంత దారుణానికి పాల్పడిన ధర్మయ్యతోనే తేల్చుకొంటానని అమరయ్య వెళతాడు. ధర్మయ్య కాళ్లావేళ్లాపడి ప్రాథేయ పడినా ఆయన గుండె కరగలేదు. ప్రసాద్ రైతులతో వచ్చి ధర్మయ్యను

చుట్టుముడతాడు. "ఏ పొలం కోసం ఇన్నేళ్లుగా కోర్టుల చుట్టూ తిరుగుతున్నానో, ఏ పొలం కోసం నా కుటుంబానికీ గతులొచ్చాయో, ఏ పొలం కోసం దేశంలో చావుబ్రతుకుల పోరాటం జరుగుతుందో, ఏ పొలం కోసం వందల మంది విప్లవ యోధులు తమ పవిత్రమైన ప్రాణాలను బలిపెట్టారో ఆ పొలం కోసం, కౌలు పొలం కోసం ప్రాణాలకు తెగిస్తాం" అంటూ ప్రసాద్ తిరగబడతాడు. ధర్మయ్య ప్రసాద్‌పై తుపాకీ గురిపెట్టగా అమరయ్య "నన్ను కాల్చు, మూడు దమ్మిడీలు చేయని నేను నీసాటోణ్ణిగా విర్రవీగినందుకు కాల్చు, కులం అనీ, తలం అనీ లేని గొప్పకోసం పాకులాడినందుకు కాల్చు". అంటూ ధర్మయ్య పై తిరగబడతాడు. చెరువు పొలాన్ని సాగుచేసుకొనే హక్కు రైతులకు ఉందని ప్రసాద్ కోర్టు ఉత్తర్వులను చూపిస్తాడు. కోర్టు ఉత్తర్వులను ధిక్కరించి రైతులపై దౌర్జన్యం చేసిన ధర్మయ్య, శ్రీరంగాలను ఇనస్పెక్టర్ అరెస్ట్ చేస్తాడు. ఈ భూస్వామిక విధానం రద్దుకావాలి. దున్నేవాడికే భూమిమీద శాశ్వత హక్కు రావాలి. భూమిని అమ్మడం కొనడం అనే నీచ పద్ధతులు అంతమయ్యే దాక ఆసామికి ఈ అగచాట్లు తప్పవు అని ప్రసాద్ సందేశమిస్తాడు.

లెండోయ్.. లేలెండోయ్
రారండోయ్.. కదలండోయ్
నడవండోయ్.. రైతులూ... కూలీలు.. "లెండోయ్"
చిటపట చినుకులు
ఉరుములూ.. మెరుపులూ..
మెరిసె.. మురిసె.. మురిసి.. మెరిసె..
తొలకరీ తల్లికి పొంగలీ పులగం
తొలిమొక్కులిడన్ లెండోయ్ "లెండోయ్"
గణగణ గణగణ
గంటలూ.. మువ్వలూ
మ్రోగె.. మ్రోగె.. మ్రోగె.. మ్రోగె..
పరుగున అందరు
ములుగర్రలతో
అరకలమర్చగ లెండోయ్

రారండోయ్.. రారండోయ్..　　　　"లెండోయ్"

అనే జయ నినాదాలతో రైతులు సంఘటితంగా ఏరువాకకు సాగుతుండగా నాటకం ముగుస్తుంది.

దేశానికి వెన్నుముక వంటి రైతుల అచ్చమైన, స్వచ్ఛమైన కథ ఇది. ఈ నాటకంలో ఇతివృత్తం, పాత్రలు, సంభాషణలు (భాష) ఒక దానితో ఒకటి పోటీ పడ్డాయి. చారెడు నేల కోసం తపించే రైతు ఆవేదన, ఆవేశం నేపథ్యంగా సాగే ఈ నాటకంలో గ్రామీణ కర్షక జీవన చిత్రణ అపూర్వం. రైతన్నల గుండె చప్పుళ్లు అద్భుతంగా వినిపిస్తాయి. రైతన్నల జీవన విధానం, ఆలోచన సరళి, ఈ నాటకంలో చక్కగా చిత్రించబడ్డాయి. వ్యవసాయ విధానం, రైతన్నలకు అన్ని పండుగల కన్నా ముఖ్యమైన ఏరువాక గురించి ఈ నాటకంలో అనితర సాధ్యంగా చిత్రించారు. ఏరువాక నేపథ్యాన్ని, సందడిని ఈ నాటకంలో చిత్రించినంత గొప్పగా మరొక నాటకంలో వివరించ లేదంటే అతిశయోక్తి కాదు.

ఆరవ సన్నివేశంలో ఏరువాక ప్రసక్తి ప్రధానంగా వివరించబడింది. ఉరుములు, మెరుపుల హడావుడితో సన్నివేశం ప్రారంభమౌతుంది. తొలికోడి కూతలు విన్పిస్తాయి.

కొక్కొరోయని తొలికోడి కూసెనపుడె
వృక్షముల నుండి లేచిన పక్షులచట
మసక చీకటి ముసుగులో మసలుచున్న
పేదలోకము బ్రతుకును వెదకసాగె

తెలతెలవారుతున్న సమయంలో శాంతి పాత్ర రంగస్థలం పైకి ప్రవేశిస్తుంది.

సాగవయ్యా ఏరువాక　　　　"ఆసామి రాజా"
ఆపవయ్యా కరువుల రాక　　　　,,
నీటుగ తలపాగా జుట్టి　　　　,,
కోటేరూ తీరిచిదిద్ది　　　　,,
చేలన్నీ అరకలమయమూ　　　　,,
సాలుకు ఎయిపుట్లను మోయీ　　　　,,
పంటలు మాబాగా పండీ　　　　,,
ఇంటింటానందం నిండీ　　　　,,
ఆగిపోవు ఆకలి శోకం　　　　,,

అన్నదాత అంటది లోకం ,,

పశువులను శుభ్రంగా కడిగి పసుపురాసి బొట్లు పెట్టడం, మువ్వల గంటల పట్టెళ్లను శుభ్రం చేయడం వంటి అంశాలు రంగస్థలం పై సన్నివేశాలుగా నడుస్తాయి.

ప్రసాద్ : గొర్రు కట్టించడం అయిందా

కొండయ్య : ఓ ముప్పేర్న

ప్రసాద్ : అయితే గొర్రుకు అంటురాయి (ఆముదం సీసా ఇస్తాడు) ఈయారగట్ట సామాను గూడా తీసుకెళ్లి ఒకేసారి కోటేరేస్తే పోద్దిగా (వీరమ్మ వీధిలోకి వెళుతుంది)

వీరమ్మ : చంద్రమ్మ గారి కోటమ్మను పిల్లిపిసర్లడిగితే గోగిత్తులు దొరుకుతాయంది. ఇయ్యిచ్చి అయి తెద్దామని

ప్రసాద్ : అమ్మా పంతులు బాపయ్య గారింట్లో తియ్యదోస గింజలుండాలి వాళ్ల వరిగసేలో నిరుడు పూరాగా కాసాయ్

అమరయ్య : సూడయ్య చుట్టూ కారుజొన్న పట్టెలే. రెండు గొర్లు దట్టంగానే పెట్టించు. పిల్లిబిసర్లు కాస్త ఎక్కువగానే కలుపులే. పల్లులో కొచ్చాన కిందికీ మీదకే గోగుల పట్టెట గొర్రు పెట్టించు.

ప్రసాద్ : నాన్నా మరి కంది

అమరయ్య : చారెడసాలులో పట్టెలెందుకు గానీ సాలుకందే పెట్టించరోయ్ రేయ్ కొండలా పైరు ఎట్టుండాలో తెలుసా. కర్రక్కర్రంటకుండా అచ్చన గాయలట్టుండాల.

ఈ సంభాషణల వలన ఏరువాక సాగే సమయంలో వ్యవసాయ పనిముట్లు, పొలం దున్నకాల వంటి ఆసక్తికర అంశాలు తేటతెల్లం చేయబడ్డాయి. ఈ నాటకంలో మధ్యతరగతి మనస్తత్వం గల రైతుగా అమరయ్య, రైతులను దోపిడీ చేస్తున్న పెత్తందారీతనంపై ధ్వజమెత్తే నాయకునిగా ప్రసాద్, కులవృత్తుల ప్రతినిధిగా చలమయ్య పాత్రలను నాజర్ గొప్పగా తీర్చిదిద్దారు.

కల్మషం లేని మనసులు, అనుభవసారంతో పండిపోయిన మనుషులు, ఏ భేషజంలేని భాష, యాసలతో గ్రామీణ రైతాంగ జీవన ప్రస్థానం సాగుతుంది. గుమ్మపాలలోని చిక్కదనం, పైరగాలికి ఊగే పంటపొలాల చక్కదనంతో నాజర్ 'ఆసామి' నాటకంలో భాషా ప్రయోగం చేశారు. ప్రతిపాత్రలో అసలైన రైతు మాండలికం పరుగులు

తీసింది. నాగాలు (పనికిరాకుండా ఉండటం), మన్నడి (మర్యాద), కోపు తలగుడ్డ (తలపాగా), ఈవజాన (ఈవిధంగా), నీయదాన (నీముఖాన), సీరబోతులు (పేలు), గుబుల్లమారి (స్థిరమైన మనస్సు లేని) వంటి మాండలిక పదాల గుభాళింపు ఆ నాటకం నిండా పరిమళిస్తుంది. కుడుమిస్తే పండగ, యంపలి చెట్టుకు నిచ్చెన, ఈగలు బడ్డ గొడ్డు, పుట్ట పగిలినట్టు వంటి జాతీయాలు ఈ నాటకంలో కోకొల్లలు.

ఈ నాటకం అంతా రైతు భారతం. గ్రామీణ ప్రాంతాలలోని ఇళ్లకు వివిధ వృత్తుల వారు, జానపద కళాకారులు వచ్చి భిక్షాటన చేస్తూ ఉంటారు. ఈ నాటకంలోని రెండు సన్నివేశాలలో అల్లాకే నామ్, చెంచుల వాళ్ల కళారూపాలను అంతర్భాగంగా చేసి నాటక గమనానికి మరింత పుష్టిని చేకూర్చారు. భార్యాభర్తలైన అమరయ్య, వీరమ్మ సంసారంలోని దరిద్రాన్ని గూర్చి వాదులాడుకొనే సమయంలో

పాడీ పంటల్ సల్వగుండాల అల్లాకేనామ్
తల్లీపిల్లల్ సల్వగుండాల అల్లాకేనామ్"
అంటూ ఒక ఫకీరు భిక్షాటనకు వస్తాడు. మరికొద్ది సేపటికి
రేపల్లె వాడలో చెంచీత
గోపమ్మ నీలాడే వైభామ
చిన్నారీ ఆడాలా చెంచీతా
చిలకల్లకొలికే వైభామ
అందాల ఆబాల చెంచీతా
కుందాల తల్లీ వైభామ

అంటూ చెంచుదొర భిక్షాటనకు వస్తాడు. ఈ జానపద కళారూపాల గానం, సంగీతం ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకొంటాయి. జనంచేత పుట్టిన జానపద కళారూపాలను నాటకాలలో అంతర్భాగం చేసినప్పుడు అ ప్రదర్శన ఎంత గొప్పగా విజయవంతమౌతుందో ప్రజానాట్యమండలి నిరూపించింది. ప్రజానాట్యమండలి కళాకారుడైన నాజర్‌కు ఈ విషయం అనుభవం రీత్యా సుస్పష్టం కావడంతో తాను వ్రాసిన 'ఆసామి' నాటకంలో జానపద కళారూపాలను సన్నివేశంలో అంతర్భాగంగా వినియోగించి సఫలీకృతులయ్యాడు.

'ఆసామి' నాటకానికి ముందు 'అన్నదాత' అనే పేరును నాజర్ పెట్టినట్లు ఈ నాటక దర్శకుడు మాచినేని వెంకటేశ్వరరావు తెలిపారు. ఈ నాటకాన్ని మూడు నెలలకు

పైగా రిహార్సల్స్ చేశారు. కొప్పరపు సుబ్బారావు గారింట్లో హనుమంతరాయ గ్రంథాలయంలో తరువాత మాచినేని ఇంట్లో రిహార్సల్స్ చేశారు. డ్రస్ రిహార్సల్స్‌కు రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులను ఆహ్వానించి వారి సూచనలు, సలహాలను స్వీకరించారు. ఈ నాటకాన్ని రాష్ట్ర ప్రజానాట్యమండలి పేరును కాకుండా విజయవాడ ప్రజానాట్యమండలి సంస్థ పేరున ప్రదర్శించాలని రాష్ట్ర నాయకత్వం సూచించింది. ఈ నాటకంలో ధర్మయ్య పాత్రను మాచినేని వెంకటేశ్వరరావు, శ్రీరంగం పాత్రను కర్నాటి లక్ష్మీ నరసయ్య, అమరయ్య పాత్రను నాజర్, ప్రసాద్ పాత్రను రాఘవాపురపు అప్పారావు, కొండయ్య పాత్రను వెంగళనాథం, దాసు పాత్రను పురాణం వెంకట సుబ్బారావు, సర్కిల్ ఇన్స్‌పెక్టర్ పాత్రను విన్నకోట రామన్న పంతులు, జ్ఞానయ్య పాత్రను కాకర్లపూడి వెంకటరాజు, చలమయ్య పాత్రను తమ్మిన రామారావు, అమీనా పాత్రను జొన్నాదుల పిచ్చయ్య, వీరమ్మ పాత్రను కొప్పరపు సరోజిని (కొప్పరపు సుబ్బారావు సతీమణి), శాంతి పాత్రను కొమ్మినేని హైమ (సినీ దర్శకుడు చక్రవర్తి సోదరి) పోషించారు. ఈ నాటకానికి బి.గోపాలం సంగీత దర్శకునిగా వ్యవహరించారు.

ఈ నాటకాన్ని మొదట హనుమంతరాయ గ్రంథాలయంలో ప్రదర్శించారు. తరువాత 1954 మే 7,8,9 తేదీలలో బందరు మినర్వా హాలులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్ 18వ రాష్ట్రస్థాయి నాటక పోటీలలో ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శన బహుమతి గెలుపొందారు. ఉత్తమ నటిగా శ్రీమతి కొప్పరపు సరోజిని ఎన్నికయ్యారు. ఈ ఉత్సవాలకు బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించగా సినీ దర్శకుడు కె.వి.రెడ్డి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఆంధ్రనాటక కళాపరిషత్‌లో ఉత్తమ ప్రదర్శన బహుమతిని పొందిన సందర్భంగా గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడిలో విజయోత్సవ సభను నిర్వహించి 'ఆసామి' నాటకాన్ని ప్రదర్శించారు. తదుపరి ఈ నాటకాన్ని తిరువూరులో ప్రదర్శించడానికి నిర్ణయించి ప్రచారం కూడా చేశారు. ఇది పార్టీకి సంబంధించిన నాటకం కాదని ప్రచారం జరగడంతో నాటక ప్రదర్శనను రద్దుచేశారు. **"తీరుతీయాలు గల తేట తెలుగు భాషలో 'ఆసామి' లాంటి నాటక రచనలు మనకు అనుదినము రావాలని"** కొప్పరపు సుబ్బారావు అన్నారు. అచ్చమైన తెలుగు పలుకుబడులకు గాదెలాంటి 'ఆసామి' నాటకం అనంతర కాలంలో రైతునేపథ్య నాటక రచనలకు స్ఫూర్తిగా నిలిచింది. ఈ నాటకాన్ని నాజర్ అన్నదాతలకు, ఆసాములకు అంకితం చేశాడు.

# 14

# కలం నుండి.. గళం నుండి దూకిన పాటల వరద

**త**రతరాల దోపిడీని ఎదిరిస్తూ బిగిసిన పిడికిలి శక్తిని.. యుగయుగాల అహంకారాన్ని కాల్చివేయడానికి రెప్పలమాటున సుడులు తిరుగుతున్న నిప్పుల ఉప్పెనను, ఆకలిపేగుల ఆర్తనాదాలను.. చుర్రున కాలే ఎండలో కారే చెమట చుక్కలను, నిస్సత్తువులో జావగారిన అసహాయ ఆక్రోశాలను.. జోరుగ సాగేహుషారులో కలుపు తీసే కరువు కాటకాల ఈతిబాధలను, ఏరువాకలో చెంగణాలు తీసే లేగదూడల మువ్వల ముచ్చట్లను.. వడివడిగా దుక్కిని దున్నే బసవన్నల గంటల గణగణలను, వింటే.. చూచే మనసుంటే ఆ ఆర్తి నుండి, ఆర్ద్రతనుండి, ఆవేదన నుండి, ఆక్రోశంనుండి అక్షరాలు అందమైన అల్లికతో పాటగా రూపుదిద్దుకొంటాయి. కవి భావనా ప్రపంచం నుండి ఉరుకుల పరుగులతో వచ్చిన ఆ మాటలకు కలం ఒక రూపం దిద్దితే.. ఆ మాటలు రాగయుక్తంగా.. భావభరితంగా ఆ కవి గళం నుండి జాలువారితే కదలని తనువు, కరగని మనసు ఉండదు. ఆ పాట సందర్భాన్ని బట్టి శ్రోతల వంటిపై పులికింతల పూలు పూయించవచ్చు. గుండెలను పిండవచ్చు. నిలువెల్లా ఊపేయవచ్చు. కళ్లల్లో ఎర్రెర్రని జీరలను అద్దవచ్చు. ఆ స్పందనే పాటకు ప్రాణం. అదే కొన్ని తరాలపాటు ఆ శ్రోతల గొంతులో కూనిరాగంగానో.. గొంతెత్తి పాడుకొనే పాటగానో శాశ్వతత్వాన్ని పొందుతుంది. అన్నిదశలను స్వయంగా చూచి.. అనుభవించిన నాజర్ కలం నుండి వెలువడిన ఒక్కొక్క పాట ఒక్కొక్క ఆణిముత్యంగా నిలిచింది. జానపద కళాభారతి శిరస్సున ఆకుపచ్చ కిరీటమై మెరిసింది.



**ఘంటసాలతో నాజర్**

పెదపూడి చారిత్రక, విజ్ఞాన రాజకీయ పాఠశాలలో పొందిన శిక్షణ నాజర్‌కు ఎంతగానో ఉపకరించింది. తెలుసుకొన్న ఛందస్సు పద్యం వ్రాయమని పోరుపెట్టింది. లయజ్ఞానం పాటల దండలను అల్లించింది. కడుపునింపుకోవడానికి పొగాకు బ్యారన్ పనికి వెళ్లినపుడు అక్కడ పడ్డ బాధలు, తోటి కూలీల నిట్టూర్పులు, దిగాలు పడ్డ ముఖాలను చూచి అద్భుతమైన పాటను వ్రాశారు.

ఏనాటికానాడు ఎండవానల్లోన
సేసి సేసి ప్రాణమిసిగి పోతున్నాది
కూడు జాలనికూడు ఓరన్నా
దొరల కుక్కలే నయమురా కూలన్నా
అద్దరేతిరి కాడ నిద్దరే లేస్తాము
బిడ్డలారా మీకు దేవుడే దిక్కనే
కాలమీడ్చుకు పోదురు మీరన్నా
నిద్ర కళ్లతో తూలుతూ కూలన్నా

చేలోకి చేరాక మెలుకువే రాక
బండ్ల కాకేశాక పండ్లనే తోముతూ
మూరు రూపాయితో ఓరన్నా
ఇండ్లు చేరుకొంటాముర కూలన్నా
ఆదరాబాదరా ఆకంత దింపాక
ఆవురావురుమనే అన్నానికెళితే
కూడుంటే కూరుండదు ఓరన్నా
మరింట్లో పాడసలుండదు కూలన్నా
తాలుగింజల కూడు తెల్లకారపు కూర
చేదునోటికి పోదు బాధ దేవుడెరుగు
ఏడుపే తరుగురా ఓరన్నా
ఏందిరా ఈ బతుకు కూలన్నా
పచ్చాకు తెస్తిరని పండాకు లెక్కువని
పనితొందర లేదని పరువు దక్కదని
వెనక సణుగుడు మోత ఓరన్నా
దొరలకెంత జేసిన మెప్పు లేదన్నా
ఏపూట వెంటుండి వేపుకొని తింటారు
కూలడిగితే తప్పు కూడడిగితే ముప్పు
కులము అంటారు ఓరన్నా
కలవనివ్వరు మనల కూలన్నా
ఏకులం వారైన ఏదేశమున ఉన్న
పేదలంతా ఒకటే బాధలన్నీ ఒకటే
కులం కూడెట్టదురా ఓరన్నా
కలసి పోరాడాలి కూలన్నా.

రాత్రింబవళ్లు గొడ్డుచాకిరి చేసినా నాలుగు వేళ్లూ లోపలకి వెళ్లడం గగనమై పోతుంది. పొగాకు బ్యారన్‌లో ఆకును వారం రోజులు కాలుస్తారు. పొలంలో ఆకు వలుపుడుకు కూలీలు రాత్రిపూటే వెళతారు. ఆకువలచి బండ్లకు ఎత్తేసరికి



**పెత్తందార్లు చిత్రంలో ఎన్.టి.ఆర్.కి బుర్రకథ అడుగులు, అభినయం నేర్పిన నాజర్**

తెలతెల్లవారుతుంది. గొడ్డుచాకిరి చేసి అవురావురుమంటూ ఇంటికి వెళితే కూడుంటే కూరండదు.. కూరుంటే కూడుండదు. తాలుగింజల కూడులో గొడ్డుకారం కలిపి మెతుకులను తింటే ఆ చేదు నోటికి బాధ వర్ణనాతీతం. ఆ బాధలన్నీ దిగమింగి బ్యారన్‌వద్దకు వెళితే పచ్చిగా ఉన్న ఆకువలిచారని, పండు ఆకు దూసి తెచ్చారని యజమాని నసుగుడు, సణుగుడు, విదిలింపులతో మనసు కలుక్కుమంటుంది. ప్రతిగంటా.. ప్రతినిముషం ఊపిరి సలపనివ్వకుండా వేపుకు తింటారు. ఆకలిని తీర్చుకోవడానికి కూలిడబ్బులు అడిగితే పెద్దతప్పు. తక్కువ కులం వారంటూ దూరదూరంగా పెడతారు. ఏ ఊళ్లో అయినా రూపాయికి నూరు పైసలే అన్నట్లు ఏ ఊరైనా, ఏ ప్రాంతంలోనైనా పేదలందరూ ఒక్కటే. వారి బాధలన్నీ ఒకటే. కులమతాల గీతలు చెరుపుకొని కూలీలంతా సంఘటితమైనప్పుడే ఆ బాధలన్నీ తొలగిపోతాయని నాజర్ ఈ పాట ద్వారా చిత్రించారు. ఒక పాటను వ్రాసినపుడు ఆ వాతావరణం, ఆ సన్నివేశం మన కళ్లముందు కదలాడాలి. అదే ఉత్తమ సాహిత్యం. ఈ పాట ప్రారంభం నుండే శ్రోతను ఆ వాతావర్ణంలోకి లాక్కొని వెళుతుంది. ఆ బాధలన్నీ చెప్పి కుదిపి వేస్తుంది.

'లంబాడోళ్ల రాందాసు' కథ తెలుగువారికి పరిచయమైనది. ఆకథలో జానపద

బాణీలో సాగే ఒకపాట మరీ సుపరిచితం.

నీ ఆశా అడియాసా
చేజారే మణిపూసా
బతుకుంతా ఆమవాసా
లంబాడోళ్ల రాందాసా

తెలుగునాట విశేష ప్రచారం పొందిన ఈ పాట బాణీలో నాజర్ ఒక పాటను రచించారు.

ఎండల్లో వానల్లో
నీడనకా నిద్రనకా
పండిస్తాము పంటలను
పస్తుంటాము ఓరన్నా
ఉప్పుంటే పప్పుందా
ఉండబోతే కొంపుందా
బ్రతుకంతా వెతలాయె
నా చిన్నారీ కూలన్నా
దినమంతా శ్రమచేసే
జనమంతా పస్తులురా
నీ పొలమూ జనబలమూ
పేదోళ్ల శ్రమఫలము
సోమరులా సొత్తాయె
శ్రామికుల సత్తాయే
నీ శక్తి.. నీ యుక్తి
పేదోళ్ల ధీశక్తి
ఏకంగా నిలవాలి
లోకాలు ఏలాలి

మాకండల పిండిన నెత్తురు.. మీ వంటికి పూసిన అత్తరు అంటారు మధుర కవి జంధ్యాల పాపయ్య శాస్త్రి. భగ్గున మండే ఎండలో.. జోరుగ కురిసే వానలో

పంటలు పండిస్తే గింజ భూస్వామికీ, గంజి పేదలకూ దక్కుతుంది. పస్తులు ఆ ఇంటికి తోరణాలు.. శ్రామికుల శ్రమ ఫలితంతో భూస్వామి నానాటికీ ఎదిగి పోతున్నాడు. అతుకుబతుకుల వెతలు పోవాలంటే అందరూ ఒక్కటై నిలవాలని నాజర్ కూలీలకు పిలుపునిచ్చారు. అప్పుడే కూలీ లోకాలను ఏలుతాడని ఈ పాటద్వారా అభిలషించారు.

తెలంగాణా సాయుధ పోరాటంలో ఒక ప్రచండమైన శక్తిగా, ఒక ప్రభంజనంగా, ఒక శతఘ్నిలాగా పేలి ప్రజలను ఉగ్రూత లూగించింది, పాలకుల పీఠాలను కదిలించింది ఒక పాట. అక్షరజ్ఞానం అంతగాలేని యాదగిరి అనే ఒకకవి వ్రాసిన ఆ పాట ప్రతివారి నోటా ప్రతిధ్వనించింది.

బండెనక బండి గట్టి
పదహారు బళ్లు గట్టి
ఏ బండ్లో వస్తవ్ కొడకో
నైజాము సర్కరోడా!

ఉత్తేజగీతంగా ప్రసిద్ధిచెందిన ఈ పాట బాణీలో నాజర్ రచించిన గేయం బహుళ ప్రచారం పొందింది.

ఎన్నాళ్లీ కాపురాలూ
ఏచెరోసురోబడి చేద్దామన్నా "ఎన్నాళ్లీ"
కాపురమంతా కరువుల సంత
జీవితమంతా చిరుగుల బొంత
గాలి కొంపలు ఖాళీ కుండలూ
చాలీచాలని కూలిగింజలు "ఎన్నాళ్లీ"
పారపనుల్లో పారుకులాడి
సత్తువకొద్దీ కత్తవ దొక్కి
సతమతమై నే మెతుకుల కెళితే
కుండదుగున కూడుండదురన్నా "ఎన్నాళ్లీ"
చేలన్నీ నా చెమటను దడిసి
నేల బురద నాటునువేసి
కళ్ల ప్రాణాలతో ఇల్లు జేరితే

పిల్లలు తింటే తల్లులు పస్తు "ఎన్నాళ్లీ"
పంటలు కోసి కళ్లాల చేసి
వీపున మోసి పాతట పోసి
కూలిస్తుంటే తాలిస్తుంటిరి "ఎన్నాళ్లీ"
రాజనాలు పండించే వానికి
భోజనానికి బొత్తిగ లేదు
పేదల కష్టం ప్రభువుల పాలు
బాధలన్నీ మన పల్లెలపాలు "ఎన్నాళ్లీ"

రైతు కూలీల ఆకలి పస్తులను గుండెలకు హత్తుకొనేలా రచించిన ఈ పాట గత నాలుగు దశాబ్దాల కాలంలో విశేషమైన ప్రచారం పొందిన పాటగా చరిత్రపుటల కెక్కింది. ఎంత కష్టించినా జానెడు పొట్ట నిండడం గగనమైపోతున్న స్థితిలో ఆపేదరికాన్ని వర్ణించిన తీరు హృద్యం. గాలికొంపలు, ఖాళీ కుండలు అనే పదప్రయోగంలోనే నట్టింట్లో తాండవిస్తున్న దరిద్రాన్ని అద్భుతంగా వర్ణించారు. "చేలన్నీ నా చెమటకు తడిసి" అనే మాటలు శ్రీశ్రీ శ్రమైక జీవన సౌందర్యం అనే మాటను గుర్తుకు తెస్తుంది. పేదలు ఎంత కష్టించినా ఆశ్రమ అంతా భాగ్యవంతుల బొక్కపాలు నింపడానికే పనికి వస్తుందని, రైతులు, రైతు కూలీల వ్యధలు, బాధలతో పల్లెలన్నీ కునారిల్లుతున్నాయని నాజర్ చేసిన వర్ణన అప్పటికీ ఇప్పటికీ అక్షరసత్యం. చెర, సుర, బొంత, సత్తువ, కత్తవ, బొత్తిగా వంటి కూలీనాలీ ఉపయోగించే అచ్చమైన గ్రామీణ మాండలిక పదప్రయోగం. ఈ పాటకు మరింత జీవం పోసి వన్నె చిన్నెలను దిద్దింది. ఈ పాటను పాడని ఔత్సాహిక ప్రజాగాయకుడు లేడంటే అతిశయోక్తి లేదు.

ఏరన్నా రాకముందే ఏరువాక వచ్చెరన్నా
ఎవరింట ఉందువన్న ఓరన్నా జీతగాడా
భూమినీ దుక్కి దున్నీ పైరూల నెల్లాసాకి
కమ్మాని కందిపప్పు కనరాదు నేతిబొట్టు
ఉప్పాకే నీమొకాన గొప్పోరి జీతగాడు "ఏరన్నా"
పొద్దునే సద్దికూడు మద్దేల నీలకూడు
కొద్దిగా జీతమాయె పొద్దాక తోముడాయె
పెద్దోరి భాగ్యమట్లా పోగాయె జీతగాడా "ఏరన్నా"

కంటికీ నిదరాలేదు వంటికి సుఖము రాదు
రోగాలు వచ్చి పడినా నాగాలు తప్పవన్నా
ఇదియేమి బతుకురన్న ఓరన్నా జీతగాడా "ఏరన్నా"
ఇన్నోటి కోర్చియున్నా ఏరోజూ తిట్టులన్నా
గట్టిగా మాటలాడ కట్టేసి తన్నుదురన్నా
ఈ బతుకు వద్దు పదరో పోరాడు జీతగాడా "ఏరన్నా"
ఈ గనులూ మనవేరన్నా ఈ వనులు జనులవన్నా
ఈ పంట భూములను కాజేసే దొరలు మొన్న
నీ బలము చూపుమన్నా ఈ పొలమూ పంచుమన్నా
నీ వెతలూ తీరునన్న ఓరన్నా జీతగాడా "ఏరన్నా"

చుక్కపొద్దున లేచి అపరాత్రి దాకా గొడ్డుచాకిరి చేసే జీతగాళ్ల వెతలకు అద్భుతమైన రూపకల్పన చేసిన నాజర్ కలం నుండి జాలువారిన ఈ పాటకూడా బహుళ ప్రచారం పొందింది. దుక్కిదున్ని, పైరును కంటికి రెప్పలాగా కాపాడి సోమరిపోతులైన భూస్వాముల భోషాణాలను నింపే జీతగాళ్ల దుస్థితి వర్ణనాతీతం. కడుపునిండా తిండి, కంటినిండా నిద్ర ఎరుగని జీతగాళ్లకు రోగాలు వచ్చినా నాగాలు పడడానికి వీలులేదు. ఈ బాధలను భరించలేక ఇదేమిటని అడిగితే తిట్లూ తన్నులు తప్పవు. ఎన్నాళ్లీ బతుకులు.. ఈ దుస్థితి నుండి తప్పించుకోవాలంటే పోరాటమే మార్గమని కర్తవ్యబోధ చేస్తారు. చాకిరి ఒకరిది.. సౌఖ్యం ఒకరిది అనే స్థితి పోవాలంటే నీ బలం చూపాలని నూరిపోస్తాడు. జీతగాళ్ల స్థితిగతుల మీద సుద్దాల హనుమంతు వ్రాసిన "ఓ పాల బుగ్గలా జీతగాడా పాలుమరిచే ఎన్నాళ్లయిందో" అనే పాట తెలంగాణా ప్రాంతంలో అద్భుతంగా పేలింది. బాలకార్మికుని దీనహీన గాథను సుద్దాల హనుమంతు చిత్రించగా నాజర్ "ఏరన్నా రాక ముందే" పాటను రచించారు. ఈ పాట ఆంధ్ర దేశమంతటా బహుళ ప్రచారాన్ని పొందింది. జీతగాళ్ల సాధక బాధకాలను గురించి వ్రాసిన పాట మంచి ప్రచారం పొందింది. పొన్నెకల్లుకు సమీపంలో మోతడక గ్రామ భూస్వామి కుమారుడు "ఏరా! కులం గోత్రం లేని వెధవ జీతగాళ్లకు చద్దన్నాలు కాక వేడిగా వార్చి పెడతారటరా" అంటూ నడివీధిలో నాజర్ చెంపపై ఛెళ్లున కొట్టి జేబులోని కలాన్ని లాక్కొని వెళ్లారు. ఈ విషయం తెలుసుకొన్న పలువురు హరిజన యువకులు, పెద్దలు భూస్వామి కొడుకును నిలదీయగా కలాన్ని ఇచ్చి తాను నాజర్‌ను కొట్టలేదని అబద్ధం చెప్పి తప్పించుకొన్నాడు.

తొలిమానవుల జూడు తెలుగోడా
మన వారసులు వారు పనివాడా
నట్టడవి బుట్టారు
చెట్టాకు మేశారు
గుంపుగా జంతువుల
చంపుకొని తిన్నారు
నరసింహములు వారు తెలుగోడా
ధరణి పతులైనారు పనివాడా
వేటసాగని నాడు
పూటగడవని నాడు
చిన్నడవులన్నిటిని
దున్ని పండించాడు
అందరిది ఈ భూమి తెలుగోడా
లేదపుడు భూస్వామి పనివాడా
చేతివృత్తులు మావి
చేలన్నియును మావి
పండించి సంపదలు
పంచుకొని తిందుమని
అన్నదమ్ములు కోరి తెలుగోడా
అష్టమా వర్ణాలైరి పనివాడా
కుంఫి నోడొచ్చి
కొంపలను కూల్చాదు
కాలిచెప్పులు మొదలు
గోచీలు గునపాలు
అన్నివాడే దెచ్చె తెలుగోడా
అగచాట్లు మనకొచ్చె పనివాడా
మగ్గాలు సారెలూ

కత్తులూ ఆరెలూ
కమ్మరం కుమ్మరం
కర్షకులతో సహా
అష్టాది వర్ణాలు తెలుగోడా
అలగాజనాలైరి పనివాడా
జాతికళలే చచ్చె
కూలి కొడవళ్లొచ్చే
ఆసాము లడుగంటే
భూసాములరు దెంచె
కూటికేడ్చే ప్రజకు తెలుగోడా
గుళ్లు కట్టించారు పనివాడా
చేతిపనులడు గంటె
జీవకళ నశియించె
మేరగింజలు పోయె
మర్యాదలడుగంటె
పోవ ఇంకేముంది తెలుగోడా
పోతే మన కష్టాలే పనివాడా!

నాజర్ ఈ పాటలో మానవ పరిణామ క్రమాన్ని మొదట పేర్కొన్నారు. పొట్టనింపుకోవడానికి వ్యవసాయాన్ని నేర్చుకొన్నాడు. వ్యవసాయ ఆధారితంగా చేతివృత్తుల వారు ఏర్పడ్డారు. కాలక్రమేణా ఎనిమిది వర్ణాలుగా మానవులు విడిపోయారు. విదేశి దండయాత్రలు జరిగాయి. మనదేశ సంపదను యధేచ్ఛగా కొల్లకొట్టడమే కాకుండా విదేశీ వస్తువులను దిగుమతి చేయడంతో చేతివృత్తుల వారి జీవనాధారం ఛిద్రమైపోయింది. ప్రపంచీకరణ ఉక్కు పిడికిలిలో చేతివృత్తుల వారి అధోగతిని, నాలుగు దశాబ్దాల క్రితమే నాజర్ ఊహించి వ్రాశారు. ప్రజాకళలకు ఆదరణ తగ్గిపోయింది. ఆసాములందరూ చితికిపోగా వారి శ్రమను దోచుకొన్న కొందరి భూస్వాముల చేతిలోకి సంపద తరలిపోయింది. ఇటువంటి స్థితిలో సర్వస్వాన్ని కోల్పోయిన ప్రజలు పోగొట్టుకోవడానికి మిగిలిందేమి లేదు గనుక కష్టాలు పోగొట్టుకోవడమే చేయాలని హిత బోధ చేశారు. పెట్టుబడీదారి వ్యవస్థ దోపిడి రాజ్యంలో శ్రమజీవుల దుస్థితిని, గ్రామ సీమల అధోగతిని

నాజర్ ఆ పాట ద్వారా అద్భుతంగా చిత్రించాడు. వేములపల్లి శ్రీకృష్ణ రచించిన "చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా! గతమెంతో ఘనకీర్తి కలవోడా" అనే పాట బాణీలో ఈపాట నడక సాగింది.

వలియ వలియ వలియో
రావేలు గలవాడా రార పొలిగాడా
చేలుపండి మూలనిండి పల్లె పట్టు చల్లగుండు
కల్లమంతా కాలుమునగాలోయ్
కురిసెరా తొలకరీ ఓరన్నా
కోటేరు లాయరా రైతన్నా
కరువులో దేశమూ సురిగి పోతున్నాది
పరువులో ఏరువాక పరుగెత్తుకొచ్చింది
పంట పైరేయరా ఓరన్నా
ప్రజల బ్రతికించరా రైతన్నా "వలియ"

తొలకరి జల్లుల పలకరింతలతో ఏరువాక వచ్చింది. కరువు కాటకాలతో ప్రజలు అల్లాడిపోతున్నారు. ఆ కరువు రక్కసిని పారద్రోలడానికి కోటేరును పట్టుకొని భూమిని దున్నాలి. నీరెక్కల కష్టంలో ఈ క్షామమంతా పోవాలి. ప్రజలంతా క్షేమంగా ఉండాలనే ప్రబోధంగా రైతన్నలను ఉద్దేశించి నాజర్ ఈ పాటను రచించాడు.

గుమ్మాన యుద్ధ రాకాసి దేశాన కరువు పిశాచి
దేశమందు తిండి దొంగలు దాచివేసిరి తిండి గింజలు
దేశాన సంక్షోభమొచ్చును దీనజనులెందరొ చచ్చును
మన గాంధీ జిన్నాలు మరలా కలవాలని
మనమంతా ఏకమై కోరాలోయ్

దేశవిభజన సమయంలో రాజకీయ ప్రతిష్టంభన ఏర్పడింది. గాంధీ జిన్నాల మధ్య అభిప్రాయ బేధాలు పొడచూపడంతో వారిద్దరూ ఎడమొగం పెడమొగంగా ఉంటున్నారు. దీనితో సమస్య మరింత జటిలంగా మారింది. ఈస్థితిలో దేశ సరిహద్దుల్లో యుద్ధపిశాచి, దేశం లోపన కరువు రక్కసి తాండ వించబోతుంది. ఈ రెండింటి మూలంగా విలయం సంభవించే ప్రమాదం ఉంది. కావున గాంధీ జిన్నాలు ఏకంకావాలని ఆశిస్తూ నాజర్ వ్రాసిన పాట ఇది. ఈ పాటను విజయవాడ హనుమంతరాయ

గ్రంథాలయంలో బెంగాల్ కరువు బుర్రకథను చెప్పే సమయంలో పాడారు. కార్యక్రమంలో పాల్గొన్న పుచ్చలపల్లి సుందరయ్య ఈ పాటను ఎంతగానో మెచ్చుకొన్నారు.

నాజర్ 1947-48 మధ్య కాలంలో చాలా పాటలు వ్రాశాడు. కానీ ఆ పుస్తకాన్ని పోలీసులు తీసుకుపోయారు. ఆ పుస్తకం కోసం తరువాత రోజుల్లో ఎన్నిసార్లు పోలీస్ స్టేషన్‌కు వెళ్లినా వారు ఇవ్వలేదు. దీనితో ఎన్నో పాటలు వెలుగు చూడకుండా మరుగున పడిపోయాయి.

నాజర్ వ్రాసిన పాటల సాహిత్యాన్ని పరిశీలిస్తే 'ఒక్క తెలుగోడా' పాట మినహా మిగతా పాటలన్నీ రైతులు, రైతు కూలీల గుండె చప్పుళ్లను ప్రతిధ్వనించినవే. పాటంటే నాజర్‌కు ప్రాణం. పాటంటే ఆయన భావన కళ్లెంలేని గుర్రంలాగా పరుగులు తీస్తుంది. పల్లెదనం గుభాళించే మామూలు మాండలిక పదాలను తీసుకొని ఆయన పాటవ్రాస్తే అది అచ్చమైన రసగుళికే. బుర్రకథ చెప్పే సమయంలో పల్లెలో ఈ పాటలను విధిగా పాడేవారు. అనంతర కాలంలో ప్రేక్షకులు కావాలని ఒకటి రెండుసార్లు ఆ పాటను పాడించుకొనేవారు. మామూలు పదాలను ఉపయోగించినా నాజర్ పాట ఒక ప్రచండమైన శక్తిగా ఉంటుంది. ప్రతిబుర్రకథలోనూ గ్రామీణ జీవన చిత్రణ చేసే సమయంలో తప్పనిసరిగా జానపద బాణీలతో పాటలు వ్రాసి పాడేవారు. ఈ పాటలన్నీ కథకు ఒక పుష్టిని తుష్టిని కలిగించాయి.



# 15

# భక్త ప్రహ్లాద

భాగవతంలోని ప్రహ్లాదకథ తెలుగువారికి సుపరిచయం. తన మందార మకరంద కవితచే బమ్మెర పోతన ఈ కథను మధుర సుమధురంగా చెప్పాడు. ఆ ప్రహ్లాద చరిత్రను యక్షగాన ప్రక్రియ ద్వారా నాజర్ రచించారు. గ్రాంధిక, వ్యవహారిక భాషల సమ్మేళనంగా ఛందోబద్ధమైన పద్యాలతో పాటు రగడలు, దరువులు, అర్ధ చంద్రికలు పాటలు మేలుకలయికగా సాగే యక్షగాన ప్రక్రియ అలనాటి విశిష్ట జానపద ప్రదర్శనా కళారూపం. భక్త ప్రహ్లాద కథను విశ్లేషించబోయే నేపథ్యంలో యక్షగాన కథాకమామీషును ప్రస్తావించ వలసి ఉంది. ప్రతిజాతికీ తనకంటూ ఒక ఆటాపాటా, భాష ఏర్పడ్డాయి. అవి సాహిత్య స్థాయికి ఎదిగి గీతాభినయ కళారీతులను సంతరించుకొన్నాయి. జానపదులు తమకు కలిగిన స్పందనలను, అనుభూతులను తమకు తోచిన రూపంలో నాటకీయంగా తమకోసం ప్రదర్శించుకొని తమ శ్రమైక జీవనంలో సౌందర్యాన్ని, వైవిధ్యాన్ని అనుభవించేవారు. ఈ కళారూప పరంపరలో శతాబ్దాల పూర్వం పుట్టిన యక్షగానం ఆంధ్ర జాతీయ రూపక ప్రక్రియగా రూపొందింది.

యక్షగానం అంటే యక్షుల పాట అని అర్థం. యక్షగానం, వీధినాటకం రెండూ ఒకే రూపక ప్రక్రియగా పరిణితి చెందాయి. కాలక్రమంలో ఆధ్యాత్మికాలు, అప్పగింత పాటలు, అలక పాటలు, అల్లోనేరేళ్లు, అష్టపదులు, ఉయ్యాల పాటలు, కీర్తనలు, గొబ్బిళ్లు, జోలపాట, తందాన పాట వంటివి చేరాయి. ప్రదర్శన ప్రారంభంలో సంప్రదాయ పాత్ర రంగస్థలం పైకి వచ్చి ప్రదర్శించే నాటకం గూర్చి ప్రేక్షకులకు వివరిస్తుంది. తరువాతి సన్నివేశంలో కథలోని ప్రధానపాత్ర సంప్రదాయ పాత్రలుంటాయి. వీరిద్దరి మధ్య సంవాదముంటుంది. రాజు తన గురించి పరిచయం చేసుకొంటాడు. పాత్ర

మొదటి చరణం అందుకోగానే వాద్యగాన బృందం కోరస్‌గా వ్యవహరిస్తాయి. యక్షగాన కథా వస్తువులన్నీ పౌరాణికాలే. పాత్ర వేషధారణ, సాహిత్యం, సంగీతం, నాట్యం అన్నీ నిబద్ధత కలిగినవే. యక్షగానం పల్లెపట్టుల్లో పుట్టింది. దీనికి ఛందోబద్ధత అనంతర కాలంలో ఏర్పడింది. భామాకలాపం బాణీకి ప్రచారం కలిగిన నాటినుండి యక్షగానంలో సాధారణంగా పాత్రలు తెరలో నుండి తమ ఉదంతాన్ని తామే చెప్పుకొని ప్రవేశిస్తాయి. సూత్రధారుని వెంట వంతలు పాటలందుకొని పాత్రవెనుక ప్రవేశిస్తారు. స్త్రీ పాత్రలను కూడా పురుషులు పోషించడం జరుగుతుంది. ఒక్కొక్క పర్యాయం సూత్రధారుడు పాత్రలను పరిచయం చేస్తూ రంగస్థలం పైకి ప్రవేశ పెట్టడంకూడా జరుగుతుంది. ఈ యక్షగానం అనంతరకాలంలో వీధిభాగవతంగా మార్పు చెందింది.

భక్త ప్రహ్లాద యక్షగానంలో సూత్రధారుడు హిరణ్యకశిపుని పాత్రను పరిచయం చేస్తూ ప్రవేశపెడతాడు.

రాజూ వెడలే సభకు - కదువేగమే - రాక్షస
రాజూ వెడలే సభకు
కోటి సూర్య దీప్తులు హసియింపగ
మేటి రవల కుండలములు మెరయగ "రాజూ"
శిరమున రత్న కిరీటము మెరయగా
కరమున తళతళ ఖడ్గము నమరగ
చూచువారు సెబాసన దానవ "రాజూ"

సకల సురాసురుడు, మనోభయంకరుడు. వీర పంచానన కేతనుడు, లీలావతీ మనోరంజనుడైన హిరణ్యకశిపుడు మంత్రి సామంత, దండ నాయకులను సమావేశ పరచి-

వినుడి వినుడి నా వీర ప్రతాపము
వివరించెద నిపుడే - వినుడి
బ్రహ్మదేవుని మన్నన లందితి
మరణ మెరుంగని వరముల బడసితి "విను"
నిల్చితి సర్వ జగంబులు గెల్చితి
గెల్చితి దిక్పతులా "విను"

నాదు సోదరుని నాశము జేసిన

హరిని రణంబున పరిమార్చెదనిక "విను"

రాక్షస దానవ వంశములకు ఆగర్భ శత్రువైన ఆ హరిని పరిమార్చి అనంతరం నా ప్రియసతి లీలావతిని చెరపట్టిన ఆ ఇంద్రుని పైకి దండ వెడలనున్నానని హిరణ్య కశిపుడు వివరించెను. సైన్యములను ఉసిగొల్పి, వెలిగుడారముల బండ్ల కెత్తించి ప్రయాణ భేరీ, రణభేరీల మోగించుమని ఆదేశించెను.

నేనే హిరణ్య కశిపునిరా - శ్రీ విష్ణుని బట్టి

నేరూపూమీరా ద్రుంచెదనురా

మానక సురలను మర్దన జేసెద

దానవ జనమన్ననల నందెదా "నేనే"

భగవంతూ డెచ్చటున్నాయిపుడు భయ

మేమీ నాకూ ఇక వానీ సంహరింతూ "నేనే"

దడవక నికనే భద్ర గిరీశుని

దయతో ద్రుంచెద నరినాగిరినీ "నేనే"

హిరణ్య కశిపుని ఆదేశంతో సర్వ సైన్యములూ యుద్ధానికి, సన్నద్ధమై కాలుదువ్వుతున్న సమయంలో లీలావతి భర్త వద్దకు వచ్చింది.

శరణూ పోతులూరి రాయ

శరణూ వీరభద్రారాయ "శరణూ"

శరణూ నీకే వరణయ్యా - ఓ పో

తూలూరయ్యా - మోక్షా

ద్వారము కనులా జూచెద "ఓ పోతూ"

సూక్ష్మమైనా తనువులోనా

సూర్యుడేడ ఉన్నాడమ్మా

సూర్యుడున్నా దారితెలియ - ఓ పో

తూలూరయ్యా చూడ

చూడ లేదూ కాయేనా "ఓ పోతూ"

వెడలీ వచ్చెను చూడరే లీలావతి సభకు

లాలనా ఏమమ్మా ఆ..
చెలియా.. ఏమమ్మా "వెడలే"
వెడలెనపుడు తన వెంబడి చీడెలు - అమ్మయ్యా
వెడలెనపుడు తన వెంబడి చీడెలు
కడువడి నడువగ "వెడలే"
లీలావతిని చూసిన హిరణ్యకశిపుడు
దీవించవే ముద్దుగుమ్మా - నన్ను
ధీరతంపవె పసిడి బొమ్మా
ఎందుదాగిన హరిని
ముందునే పరిమార్చి
ధూర్తుడా ఇంద్రుని
ధాత్రి పడగూల్చెద "దీవించ"
భర్త ఆలోచనను విన్న లీలావతి వారించుచూ
వలదు వలదు ప్రాణనాథా - దాని
విన్న నామది కెంతో బాధా
వలదు యా హరితోడా
వైరము మనకిపుడు
అరయ భగవంతుని
యవతారమట నతడు "వలదు"

అంటూ భర్త చేత యుద్ధ విరమణ చేయిస్తుంది. అనంతరం రంగస్థలం పైకి ప్రహ్లాదుని పాత్ర ప్రవేశిస్తుంది. ఆ భక్తాగ్రేసరుడు

భక్తి భావంబు లెరిగిన భాగవతుడు
ముక్తి మార్గాల నరసెడి ముద్దు సుతుడు
కోర్కెలను దీర్చు శ్రీహరి కీర్తనలతో
వచ్చి తెరవెళ్లి ప్రహ్లాదుడొచ్చె సభకు
హిరణ్యకశిపుడు తన కుమారుని చూచి
రావోయి సుగుణ జనహిత

రావోయి సుగర్భ జాత - రాజాభినుతా
రావోయి నాదు వర సుత
రావోయి ధాత్రి మిత్రా రారా నా పుత్రా
నీవే జాతీపతివీ సుగత్రా
నీ ముద్దు సుద్దులా విద్యాభివృద్ధులా
నీ పెద్ద పిన్నలా కీ పొద్దు వినిపింప "రావోయి"

అంటూ తన అంకసీమపై కూర్చోబెట్టుకొని లాలనగా పలుకుతాడు. అప్పుడు ప్రహ్లాదుడు

ఓ ఈశా లోకేశ - శ్రీలక్ష్మీ ప్రాణేశ హే మురారీ
సమ్మతితో నేడూ మమ్ముల కాపాడు హే మురారీ..

అంటూ హరిస్తోత్రం చేయగానే హిరణ్యకశిపుడు అసహనంతో

ముక్కోటి దేవతల కధిపతి నీ తండ్రి
ఎక్కడివాడూ నీ హరిగిరి నా తండ్రీ బాలకా"

అంటూ వారిస్తాడు. తన కుమారుని ఖండ మొండి పండితుడు చండ ప్రచండమైన చండా మార్కుల వద్ద విద్యాభ్యాసము కొరకు పంపిస్తాడు.

చండా మార్కుడు: ఓం నమో హిరణ్యాయ నమ: అనగానే ప్రహ్లాదుడు: ఓం నమో నారాయణాయ నమ: అని పలుకుతాడు. ఈ తీరును చూచిన హిరణ్యకశిపుడు ఆగ్రహించగా-

చెప్పిన చదువులు చదివితి
తప్పులు ఒప్పులు తెలియజెప్పెడి గురుడై
యొప్పెడు శ్రీహరి నాత్మలో
తప్పక చదివేటి చదువిది ఇప్పుడు తండ్రీ
అల వనమాలిని తలచిన
కలుగునే సంపదలు తండ్రీ తొలగును వెతలన్
జలజాక్షుని తలచని
ఖలులకు కలుగనే ముక్తి కలనైన గానీ
నీవిటూ బలుకా వలునాదుపూన

బలవంతుడాననీ భ్రమసి చెడకుము తండ్రీ

అంటూ హరి విశిష్టతను వివరిస్తాడు. ఆగ్రహోదగ్రుడైన హిరణ్యకశిపుడు-

యెందు డాగి నాడో యా హరి
వివరించుము రారా నాతో
ముందు వాని ద్రుంచి వేసెదా
దెందమందు నానంద మందెదా "యందు"

అంటూ హుంకరించాడు. సర్వోపగతుడైన చక్రి ఎందెందు చూచినా అందందే గలడని ప్రహ్లాదుడు చెప్పగా హిరణ్యకశిపుడు అందున్నాడా అంటూ స్థంభమును గదతో మోదెను. అప్పుడు

నారసింహుడు వెడలే స్థంభమూ నుండి
కోరి బ్రహ్మను వరములందిన
క్రూరుడా హిరణ్యకశిపు
ప్రొద్దు యర్రా బారువేళా
పొట్ట గోళ్లతో చీరిచంపా "నార"

'ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే' అనే మంగళ వాక్యంతో కథ ముగిస్తుంది. సరళమైన భాషతో నాజర్ ఈ యక్షగానాన్ని రచించాడు. 1950 లో కేంద్ర సమాచార శాఖా మంత్రి యస్.యస్.దివాకర్ విజయవాడ ఆకాశవాణి కేంద్రాన్ని సందర్శించిన సందర్భంగా స్థానికంగా ఉన్న జానపద కళారూపాన్ని చూడాలనే ఆకాంక్షను వ్యక్తం చేశారట. ఈ సందర్భంగా నాజర్ బృందం చేత భక్త ప్రహ్లాద యక్షగానాన్ని విజయవాడ ఆకాశవాణి కేంద్రం ఆవరణలో ఏర్పాటు చేశారు. ఈ ప్రదర్శన చూసి కేంద్ర మంత్రి ముగ్ధులయ్యారు. అనంతరం ఈ యక్షగానాన్ని విజయవాడ కేంద్రం ద్వారా ప్రసారం చేశారు. రేడియో కేంద్రం ద్వారా ఎంతో మంచి కార్యక్రమాన్ని విన్నామని వందలాది మంది ఉత్తరాల ద్వారా అభినందించారు. ఈ వీధిభాగవతంలో హిరణ్య కశిపుని పాత్రను నాజర్, ప్రహ్లాదునిగా రామకోటి, చండా మార్కునిగా కర్నాటి లక్ష్మీనరసయ్య, ఇతర పాత్రలను పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు, వీధిభాగవత కళాకారులైన యస్.రామారావు, దాసరి ప్రసాద్ పోషించారు.

# 16

# జాతి జీవితం - కళా పరిణామం

బుర్రకథకునిగా, కథా రచయితగా, నటునిగా, నాటక రచయితగా లబ్ధ ప్రతిష్టుడైన నాజర్ అనుభవసారం నుండి, విశాల అధ్యయన శీలత నుండి పుట్టిన గ్రంథం జాతి జీవితం కళాపరిణామం. బుర్రకథ గురించి నాట్యకళకు వ్యాసం వ్రాయమని శ్రీనివాస చక్రవర్తి నాజర్‌కు ఉత్తరం వ్రాశారు. తీసివేతలు లేకుండా వేస్తానంటే వ్రాస్తానని నాజర్ షరతు విధించాడు. అలాగేనని శ్రీనివాస చక్రవర్తి ఇచ్చిన హామీ మేరకు బుర్రకథ పరిణామ వికాసాలను, పుట్టు పూర్వోత్తరాలను గురించి సోదాహరణంగా వ్యాసాలు వ్రాశాడు. అవి రెండూ నాట్యకళలో ప్రచురింపబడ్డాయి. ఆంధ్రదర్శిని అనే గ్రంథంలో ప్రాచీన జానపద కళారూపానికి నాజర్ జీవం పోశాడు. ఇది నాజర్ యుగం అని శ్రీనివాస చక్రవర్తి పేర్కొన్నారు. ఈ రెండు అంశాల స్ఫూర్తితో జాతి జీవితం-కళాపరిణామం అనే గ్రంథాన్ని వ్రాయడానికి నాజర్ సంకల్పించాడు. కష్టజీవి కథను ఆపివేసిన తరువాత వేదాలు, ఉపనిషత్తులు, కావ్యాలు, రస, అభినయ ప్రకరణాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. ఈ పరిజ్ఞానంతో ఈ గ్రంథ రచనకు ఉపక్రమించాడు. ఈ గ్రంథంలో 40 విభాగాలున్నాయి. సృష్టి పరిణామ క్రమం నుండి బుర్రకథ వరకూ సాంస్కృతిక, సాహిత్య, పరిణామాన్ని సోదాహరణంగా సోపపత్తికంగా నిరూపించారు.

**ప్రకృతి ఆవిర్భావ పరిణామ క్రమాన్ని బుర్రకథలో పోల్చిన విధానం పాఠకులను ఆశ్చర్య చకితులను చేస్తుంది. బుర్రకథా గానం చేస్తున్నాడు కథకుడు. నాభిస్థానం నుండి నాదాన్ని వాయువు పైకి, పైపైకి మంద్ర, మధ్యమ, తారస్థాయిలలో ఊపిరితిత్తుల, రొమ్ముబలంతో కుత్తిక, కంఠం, కొండ నాలుక, సహకార పట్టుతో కపాల రంధ్రం ద్వారా బైటకు తోయుటలో కథకుని శరీరంలో అగ్నితత్వమైన వేడి పుట్టింది. ఆ**




నాజర్ ఉపయోగించిన తంబుర, గజ్జలు

వేడెక్కిన శరీరం నుండి చెమట నీరు శరీరంలోని లవణాలు, గాలిలో ధూళి కలిసి అరిపేరు దురదేర్పడును. అరిచేతిలో రుద్దితే తాలికలు, తాలికలు మట్టి రాలును. మట్టికి మారుపేరు భూమి, ఇలా పుట్టినవే పంచభూతాలు" అని పేర్కొన్నాడు. మరణానికి నాజర్ ఈ విధంగా నిర్వచనం చెప్పారు. మరణం అంటే ప్రకృతి నుండి జీవులుగా రూపు దిద్దుకొన్నట్టి, జీవులన్నిటిలో ఉన్న ధ్వని ధ్వనిలోనూ, గాలి గాలిలోనూ, నిప్పు నిప్పులోనూ, వేటిలో అవి పంచభూతాలలో కలియుటే మరణ లక్షణం. అనగా ఎల్లప్పుడు దేనినో, ఏ జీవినో కనడం, బ్రహ్మతత్వం వృద్ధి పొందించడం, అదే సమయంలో దేనినో క్షీణింపజేయడం, చంపడం, తనలో విలీనం చేసుకోవడం, పనిగా కలిగినదే వృత్తియై యుండునదే ప్రకృతి." ఈ విశ్లేషణ మూలంగా నాజర్ ఆలోచనా శక్తి సుస్పష్టమౌతుంది.

నటన అనేది స్వయం సిద్ధమూ, జన్మత:, సంక్రమించునది అని అంటారు. ఆ నటన ఆవిర్భవాన్ని గూర్చి నాజర్ చేసిన విశ్లేషణ గొప్పగా ఉంటుంది. "తాను పందిని చంపిన విధానాన్ని నరుడు అభినయించి చూపాడు. గుంపును నవ్వించాడు, కవ్వించాడు. సెభాష్ అన్నట్లు వారి అంగాంగ నటనలు గమనించి కులికాడు. ధైర్య సాహసాలను ఎరుకపరిచే రీతిలో నటించాడు." నిప్పు పుట్టిన విధానాన్ని, నిప్పుల కుంపటి చరిత్రను కళాకారులు దక్షయజ్ఞమనే మామా, అల్లుళ్ల తగాదాగా కల్పించి శివతాండవంగా ప్రదర్శించారని నాజర్ అభిప్రాయపడ్డారు. వేటకు వెళ్లిన సందర్భంగా వివిధ పరికరాల శబ్దాలనే స్థిరీకరించి వాయిద్యాలుగా ఏర్పాటు చేశారని నాజర్ విశ్లేషణ.

జనంలో క్రూరమృగాలంటే ఉన్న భయాన్నీ, పిరికితనాన్నీ తొలిగించడమే ఈ కళ యొక్క కర్తవ్యం. కాకిమూకల వలే, కొండముచ్చుల వలే, కలిసికట్టుగా ఉంటే ఎంతటి క్రూరమృగాన్ని అయినా సునాయాసంగా జయించగలం అనే నమ్మకాన్ని కలిగించడమే కళా ప్రదర్శనల ప్రయోజనం. అంతేకాదు పశు, పక్షి, మృగాల కన్నా మనం లఘు వేగాలను, తెలివి తేటలను, శక్తి యుక్తులను కలిగి ఉన్నామని జనం

**గ్రహించేటట్లు వాస్తవ సంఘటనలు నటించాలి. బ్రతుకు బాటల్లో చేసిన, ప్రస్తుతం చేస్తున్న జీవిత పోరాటాలను చూచిన ప్రజలకు రేపటి బ్రతుకు కళారూపం బాటలను తీర్చిదిద్దే గురువుగా ఉపకరించాలి. అలా ఉపకరించని కళ జాతి కళకాదు అది** ప్రేతకళ అని నాజర్ అభిప్రాయపడ్డారు. ప్రకృతి ప్రసాదాలు తింటూ కురువల పైనా గుహల్లోనూ వ్యాయామ కసరత్తులు చేస్తూ మానసిక శక్తి సామర్థ్యాలను పెంచుకొంటూ, ప్రకృతి ప్రమాదాలను తమకు అనుకూలంగా మార్చుకొంటూ చేస్తున్న పోరాటానికే ఆటలుగా, ఆయుధాలే వాయిద్యాలుగా వెదురు బద్దలతో, చర్మాలతో ఢక్క, డప్పు, డమరు, లయ, తాళయమక, గమకాల మధ్యన బతుకు బాటలా ఆడేకళాకారులే గరుడలని నాజర్ అభిప్రాయపడ్డారు. కానీ నేటి కాలంలో పగటి వేషాల పేరుతో వస్తున్న బోడెమ్మలు, గంట జంగాలు ప్రాచీనాలు కావు. అవి కల్పితాలు. నాటి గణంలో వాయిద్యాల నేర్పుతో, వేషధారణ కూర్పుతో తొలిసారిగా ఆడినవారే గరుడలు. మార్గగానానికి నాజర్ సరికొత్త భాష్యం చెప్పారు. నిత్య జీవనంతో జీవులకు మార్గాన్ని చూపించేదే మార్గ గానమని పేర్కొన్నారు. తమ కంఠనాదాలు, అక్షర పేర్లు, వాక్యాలు, ఆనంద ఆర్భాటాలూ, సుఖదు:ఖాలను ఉద్దేశిస్తూ ప్రజాప్రయోజనకరమైన అక్షర మాలికల ఆలాపనే కురవంజి అనే ఖడ్గగానంగా రూపుదిద్దుకొన్నదని వివరించారు. ఈ కురవంజి కళారూపంలో ఆట పాటపోలికనే ఎక్కువగా ఉంటాయి. ఆనాటి గణజనపు చిటికెడు అవసరాలు, పిడికెడు పరిస్థితులను వివరించే పాటలు, చారెడు అక్షరాలు కలిసి ఉండే కళారూపమే ఖడ్గగానం.

సాహిత్యంలోని ద్విపద మాలికల్లోని భాషను గూర్చి నాజర్ లోతైన పరిశీలన చేశారు. ద్విపదల్లోని భాష అటు ప్రాచీనమూ కాదు, ప్రజల వాడుక భాష కూడా కాదు. కలగాపులగంగా కన్పిస్తుంది. అయితే యుద్ధంలో పాల్గొనే వీరుని కత్తి విన్యాసాలు, పరాక్రమాలను ఆడుతూ పాడుతూ, వాటి అంగాంగ ఉపాంగాలను నటిస్తూ వచ్చిన తెలుగుజాతి కళారూపమైన దేశిగానమనే బసివి కథ కళాకారుల నాటకాల నుండి వినిపిస్తున్న మాలికలే వాస్తవం. అవే మంజరులు, ద్విపద, త్రిపద, చతుష్పద, పంచపదుల బహిరంగ పోలికలవి. పాల్కురికి సోమన, శ్రీనాథుడు, తంజావూరు నాయకరాజులకు మాతృకలని నాజర్ భావన. కనుక నేటి బసవికథే నాటి దేశగానమని ఆయన నమ్మిక. వ్యవసాయ విధానాలను వివరిస్తూ, ఆ వ్యవసాయ పనిముట్ల తయారీలో నైపుణ్య పరిజ్ఞానాన్ని బోధించిన అనుభవ కాలజ్ఞులను యక్షులని, అటువంటి యక్షుల అనుభవ

కాలజ్ఞానపు ఆటపాటల భావనే యక్షగానంగా రూపుదిద్దుకొందని నాజర్ ఆలోచనాలోచనం. ఆనాటి కాలంలో యక్షగానం పాడిన వ్యవసాయ శాస్త్రం, వైద్య శాస్త్రం, అర్ధశాస్త్రం, జీవశాస్త్రం వంటి జాతిజీవిత పునాది విద్యలను మనం ఇంగ్లీషు చదువుల వ్యామోహంలోపడి చంపు కొంటున్నామని నాజర్ ఆవేదన వ్యక్తం చేశారు. శ్రుతి, స్వర, స్థాయి కలిసిన గానం దేశిగానంనుండి యక్షగానం అభివృద్ధి చెందింది. యక్షగానం నుండి బుర్రకథ పుట్టిందని నాజర్ సోపపత్తికంగా నిరూపించారు.

**జీవుల అవసర ఆహార శ్రమ జనితమైన గానం, జాతి పరిణామక్రమంలో వృద్ధి పొందుతూ వచ్చిన గానం, జాతి సంస్కృతిని పెంపొందించిన గానం యక్షగానమని (బుర్రకథ)** నాజర్ చక్కని నిర్వచనం చెప్పారు. కలియుగారంభంలో గణగుంపులు గ్రామాంకురాలుగా ఎదిగాయని నాజర్ యోచన. బవని, పంబల, జముకుల, సిగ్గుల, డ్రమ్మర వంటి యక్షగాన కళాకారులు ( అనుభవ కాలజ్ఞానులు) పదపదార్ధ ప్రాధాన్యత చాటే గానాలతో వృత్తి పనిముట్టు వివరణను, వృత్తిదారులు, నవధాన్యాలు, నాలుక్కారలు, పాడిపంటలు ప్రాధాన్యతను తెలుసుకొంటున్నారు. కళాకారులకు, వృత్తి పనివారికీ భూస్వస్యులు (రైతులు) ఇచ్చే మేర గౌరవంతో హెచ్చుతగ్గులు లేక ఆనాటి గ్రామ ధర్మం మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లింది. అదే ఆనాటి నిజమైన జాతి జీవితం - కళా పరిణామంగా నాజర్ ఆ గ్రంథంలో అభివర్ణించారు.

కుమారసంభవం, కళాపూర్ణోదయం, మేఘసందేశాలు పచ్చి బూతు శృంగార కావ్యాలని నాజర్ ఈ గ్రంథంలో సోదాహరణంగా వివరించాడు. వేదాలు, ఉపనిషత్తులు, మనుధర్మ శాస్త్రాలు, పంచకావ్యాల పేరుతో తెలుగు ప్రజల కోసం కల్పించిన విషాద కట్టుకథలు ఎన్నో ఉన్నాయి. రజకులు, మాలమాదిగలు, మంగలి, బోయ, మేదర, జాలరి, చెంచుల వంటి చేతివృత్తుల వారిని ఊరికి దూరంగా ఉంచడానికి ఆర్యులు ఎత్తుగడ వేశారు. మూడు కాలాలు, ఆరు ఋతువులలో వ్యవసాయ విధాన రీతులను, భూసాగు లక్షణాలను పంటల అదును, పదునులను (వీరిని యక్షగాన నాయకులు, పద పదార్ధ విజ్ఞాన బోధకులు, యక్షులు అంటారు) తెలిసిన ఈ ఏడు కులస్తులను ఊరికి దూరంగా నెట్టివేశారు. ఆ మేరకు చట్టాలు చేశారు. ఈ కులాలతో ఉన్న జాతికళాకారులకు పంబల, బైనీడి, పిచ్చు గుంటలు, ఝుంకులు, ఒగ్గులు అనే పేర్లు పెట్టారు. జేగంట కొడుతూ, వీరణం వాయిస్తూ, దేవర పెట్టెతో భిక్షకులుగా, యానాది

భాగవతులుగా వీరు బ్రతుకసాగారు. ఆధిపత్య పోరులో ఆర్యులు విజయం సాధించారని నాజర్ అభిప్రాయ పడ్డారు.

బుర్రకథను సాధన చేయవలసిన విధానాన్ని ఈ గ్రంథంలో సవిస్తరంగా వివరించారు. హాస్యం, శృంగారం, వీరం, కరుణం, రౌద్రం, భయానకం, భీభత్సరసాలతో పాటు నాజర్ దు:ఖాన్ని కూడా ప్రత్యేక రసంగా పేర్కొనడం విశేషం. శాంతము, ఓర్పు, సహనము అనేవి రసాలు కాదని బానిస లక్షణాలని అభిప్రాయ పడ్డారు. ఈ రసాలను నాదాక్షర మాలికల్లో ఆలపించు రగడలు ఎనిమిది అని వివరించారు. 1) వృషభగతి 2) ద్విరదగతి 3) మధురగతి, 4) మంజుగతి, 5) మంజుగతిలో సగభాగములైన అర్థచంద్రికలు నాలుగు, నాదాలు 7. వాటి సంజ్ఞాక్షరాలు సరిగమపదని. శ్రుతి మధ్యమ, షడ్జమ అను స్థాయిలు 3. మందరం స,రి,గ,మ,ప,ద,ని, మధ్యమం స-రి-గ-మ-ప-ద-ని, తార స-రి-గ-మ-ప-ద-ని, 'స' కపాళం నుండి పలకాలి. ఇవి మొత్తం 22 నాదాలు. మూడు స్థాయిల్లో పలకాలి. ఏడు స్వరాక్షరాలనూ 22 నాదాల స్థాయిలో పలికించు వాగాంగములు ఆరు. 1. 1) కుత్తిక, 2) కంఠము 3) దంతాలూ 4) దౌడలు 5) అనునాసిక 6) కపాళము సాధన చేయవలసిన నాదాలను ఏడింటినీ వీటి 22 స్థాయిలను శ్రుతిపక్వంగా స్వరపక్వంగా అనగా చెవికి వినిపించునట్టి శ్రావ్యమైన ఏనాదాన్ని అయినా ఆధారం చేసుకొని శ్రుతిపక్వత సాధించవచ్చు. యక్షగానం, జానపద గేయాలలో ఆయా రసభావ సాయలను జోలపాట సాయ, ఏలపాట సాయ, నూర్పిళ్ల పాట సాయ దరువులుగా కన్పిస్తున్నాయని నాజర్ పేర్కొన్నారు.

తొలి తెలుగు కవి నన్నయ్య భారతరచన చేసే సమయంలో నారాయణ భట్టును తోడుగా తీసుకొని వెళ్లి జానపద కళాకారుల సాహిత్యాన్ని క్షుణ్ణంగా విన్నాడు. యక్షగానాది మధుర కవితలను, వారి నాలుకలపై లాస్యం చేసే మాలికలను విని వాటి లయ, తాళ, నడకలను బట్టి బుర్రకథ ఆధారంతోనే నన్నయ్య భారత రచన చేశారని నాజర్ అద్భుతంగా నిరూపించాడు. ఆదిపర్వం లోని ఒక చంపక మాల పద్యంలో ఉన్న మాలికలను సమన్వయించి చూపాడు.

చంపకమాల : పతివిహితాను రాగమున భార్గవపుత్రియయాతి చేత వం
చితయయి నాడు దానవికి జేసిన నెయ్యమెరిగి కోప దు:ఖితమై

మిగిలిన రెండు పాదములు పైపాదాల లాగే ఉంటాయి. పై రెండు పాదాలలోని

అక్షరాల లెఖ్ఖలను పరిశీలిస్తే ఎరుకలు, చెంచులు (సోది, గద్దె) పాడేటి ద్విదగ
మాలికలు ఉన్నాయి. ఉదాహరణకు ఎరుకుల చెంచు మాలిక-

ఇంతగల శరదనే నమ్మో - నేను
ఇల్లిడిసి పోలెదెతల్లీ - భళిభళి
నన్నయ్య పద్యం
పతి విహితాను రాగమున - భళిభళి
భార్గవ పుత్రి యయాతి ,,
చేత వంచిత యయినాడు ,,
దానవిక చేసినా నెయ్యమె ,,
ఎరిగి కోపాన దు:ఖితయై ,,

ఈ విధంగా నన్నయ పద్యం నడకలో బుర్రకథ సాయలను చూపాడు. నన్నయ
కవితా నడకలనే గాక ఆధునిక సాహిత్యంలోని తంజావూరు యక్షగానాల పేరుతో ఉ
కొన్ని వృషభగతి మాలికలను గూడా నాజర్ ఉదాహరణ పూర్వకంగా చూపాడు. వీ
యక్షగానాల పేరుతో వ్రాసిన కథా వస్తువులు ఆ గానానివి కావు. నాటికున్నవి బుర్రక
రగడలు మాత్రమే. గురజాడ, దేవులపల్లి, శ్రీశ్రీ, నందూరి సుబ్బారావు గేయాల
మధుర గతిని ఉదాహరణ పూర్వకంగా చూపారు.

గురజాడ అప్పారావు గేయాలలో మధురగతి 4-4 అక్షరాలు
గుమ్మెట రిధం : తక తకా తక తకా
ఆటల పాటల
పేటిక లారహ
కమ్మని మాటల
కొమ్మల లారా "తందానా"
దేవులపల్లి కృష్ణశాస్త్రి గేయాలలో మధురగతి
గుమ్మెట రిధం : తక తకా తక తకా
నవ్విపోదురు గాక
నాకేటి సిగ్గు "తందానా"

నందూరి గేయాలలో మధురగతి
గుమ్మెట రిధం : తక తకా తక తకా
ఆరిపెయ్యే - దివ్వె "తందానా"
వెలుగులో నీమీద ,,
నిలుపలేనే మనసు ,,

ఈ విధంగా ఆధునిక కవిత్వ నడకకు కూడా మాతృక, స్ఫూర్తి బుర్రకథలోని మాలికలు, లయ, తాళగతులేనని నాజర్ ఈ గ్రంథంలో నిరూపించాడు.

**మారుతున్న కాలంలో అన్ని విలువలూ మారి పోయాయని నాజర్ ఆవేదన వ్యక్తం చేశాడు. గ్రామ సీమల్లో నవధాన్యాలు లేవు, నాలుక్మారలు లేవు, శ్రమ జీవులకు పనులు లేవు, ధన స్వామ్యం, వ్యక్తి పెత్తనం పెరిగి పోయిందని, మానవ శ్రమ జనితమైన కళలు దుర్మార్గపు ఉత్పత్తులను గురించి చెప్పకుండా నోరు మూయించేందుకు నిర్బంధాలు, నిషేధాలను విధిస్తున్న దోపిడి రాజ్యం సాగుతుందని ఆక్రోశించారు. సాయుధ పోరాటం ద్వారా గానీ, అహింస ద్వారా గానీ ఒక్కడికోసం అందరూ, అందరీ కోసం ఒక్కడూ శ్రమించే రోజురావాలి. అందరూ సుఖించేదే నిజమైన జాతి జీవితం. ఈ సత్యాన్ని చాటి చెబుతూ ఆడిపాడినదే నిజమైన కళాపరిణామం. ఆనాడే ప్రపంచాన సార్ధకమౌతుంది 'మన జాతి జీవితం కళాపరిణామం'** అంటూ భరతవాక్యం పలికారు.

ప్రతిభకు పెద్దపెద్ద డిగ్రీలు కొలబద్దలుకావు. ఆయన ఆలోచనలో ఒక నైశిత్యం ఉంది. ఒక తీవ్రత ఉంది. ఒక స్వచ్ఛత ఉంది. అన్నింటికీ మించి స్పష్టత ఉంది. అనుభవ మేధోమథనం నుండి పుట్టిన అమృతం ఉంది. మొదట లోకాన్ని చదివాడు. తరువాత కోశాన్ని చదివాడు. ఆ శోధనలో నిజాయితీ ఉంది. తనదైన కోణంలో గతాన్ని చూశాడు. వర్తమానాన్ని పరిశోధించాడు. చరిత్రకు, కళలకు సరికొత్త భాష్యం చెప్పాడు. అందుకే నాజర్ ఆశయ ఆచరణల సమాహార స్వరూపమని జాతి జీవితం - కళాపరిణామ గ్రంథం నిరూపిస్తుంది.



# 17

# జానపద కళాచేతనం - బుర్రకథకే కేతనం

వీధిబడిలో ఓ పలకమీద దిద్దే అక్షరానికి తెలియదు తాను జీవన ప్రవంతికి అద్దం పట్టే పాటగా రూపుదిద్దుకోబోతున్నానని. స్కూలు వదిలాక అమ్మపెట్టిన తాయిలం తింటూ వీధుల్లో పరుగులు తీస్తున్నప్పుడు గొంతులో నుండి ఉబికి వచ్చిన లల్లాయి పదానికి తెలియదు ముందు ముందు నవరసభరితమైన పాటగా తాను ఆలపించబోతున్నానని... పేదరికంలో మగ్గిపోతున్న ఆ పసి వయసుకు తెలియదు ఝుంఝూనిల షడ్జధ్వానం లాగా అఖిలాంధ్ర ప్రేక్షకులను ఊపేయబోతున్నానని ..

ఆరవ ఏట పాఠశాల వార్షికోత్సవంలో ద్రోణపాత్ర వేసినప్పుడు పంతులుగారు మెచ్చుకొని ఇచ్చిన ఐదురూపాయిల నోటుకు కలానికే తెలియదు రాబోయే కాలంలో తమకు తోడుగా గండపెండేరాలు, పద్మశ్రీ పురస్కారాలు జట్టుకట్టబోతున్నాయని, బాల్యంలో శరీరాన్ని కప్పే ఈ చిరుగుల బట్టలకు తెలియదు తమను వెక్కిరిస్తూ పట్టు వస్త్రాలు, కాశ్మీర శాలువాలు ఉండబోతున్నాయని, ఇనుమును కాల్చినప్పుడే కావల్సిన ఆకృతిగా మారుతుంది. పేదరికంలో మగ్గినప్పుడే చీకటి వెలుగుల తారంగం యొక్క విశ్వరూప సాక్షాత్కారం లభిస్తుంది. ఎత్తుపల్లాలు.. రాళ్లూ.. ముళ్లూ.. ఉద్యమాలూ.. రహస్య జీవనాలూ.. వీపుపై లాఠీలు విరిగిన చప్పుళ్ల మధ్య జరిగిన మథనంలో ఓ కళా పూర్ణ పురుషుడు, ఒక వాగ్గేయకారుడు పుట్టాడు. ఆ జననంతోనే జానపదం పరవశించి పోయింది. పాట పులకరించి పోయింది. తంబూరాకు శ్రుతి చేసిన తీగ సుశ్రావ్యంగా మోగింది. కంచు గుమ్మెట ఖంగున పలికింది. ఆకలి సానపడితే అనుభవం

మెరుగుపెడితే బుర్రకథ అనే జానపద కళారూపానికీ నిదర్శనంగా.. నిర్వచనంగా ఒక అద్భుతమైన కళాకారుడు జాతిజీవన చరిత్రలో ఒక సువర్ణాధ్యాయాన్ని సృష్టించాడు. ఆ రూపం.. ఆ దీపం.. ఆ అక్షరం.. ఆ ఆయుధమే బుర్రకథ పితామహుడు పద్మశ్రీ షేక్ నాజర్.

నాజర్ కళ జానపద కళ. జానపదులను, జానపదాలను తన కళలో పాత్రలుగా, ఇతి వృత్తాలుగా జీవనాడిగా.. వారి సౌభాగ్యమే తన కళకు ప్రయోజనంగా మలిచాడు. కష్టించి పనిచేసి కనకపు పంటలను పండించే పేద ప్రజలను బలహీన వర్గాలవడాన్ని కూడ ఆయన సహించలేదు. "రెక్కలు ముక్కలు చేసుకొని పంటల్ని పండిస్తున్న వారిని ప్రభుత్వాలు, రాజకీయ పార్టీలు బలహీన వర్గాలుగా సంబోధించడం అమానుషం. గోచిలేని వాళ్లు.. గొడ్డు చాకిరి చేసేవాళ్లు అయినంత మాత్రాన బలహీనులు ఎలా అవుతారు." అని ప్రశ్నిస్తారు. వాడి.. వేడిగల తీవ్రమైన ఆలోచన ప్రగతి నిరోధక శక్తులను సూటిగా తర్జనితో ప్రశ్నించే ఆవేశం ఆయన వ్రాతలోను.. గళంలోనూ కదను తొక్కుతూ ఉంటుంది. అందుకే నాజర్ కథ, కథనం జనవాహినిని కదిలించే.. చైతన్య తరంగాలను సృష్టిస్తుంది. ఒక నాజర్ లాగా బుర్రకథల ద్వారా కదిలించి.. కరిగించి.. నవ్వించి.. ఏడిపించి ప్రజల అనుభూతులను తన అనుభూతులుగా.. తంబూర తంత్రులుగా మార్చి బ్రతుకుతూ.. బ్రతికించిన కళాకారులు అరుదుగా ఉంటారు. నాజర్ పాటలు వినని, తెలియని వారు ఆంధ్రదేశంలో లేరంటే అతిశయోక్తి లేదు.

సమస్యల రాకను అందరికన్నా ముందుగా పసిగట్టే ద్రష్టలు కవులు కళాకారులు. అలాగే సమస్య తాండవిస్తున్నప్పుడు దాని తీవ్రతను సూటిగా.. ఘాటుగా చెప్పగలిగే వాళ్లూ వీరే. బెంగాల్ ప్రాంతంలో కరువు రాక్షసి కరాళ నృత్యంలో ప్రజానీకం మృత్యుఖడ్గం అంచున ఉన్నప్పుడు, రాయలసీమ దుర్భిక్ష కోరల్లో ప్రజలు చిక్కి ఈసురోమని బ్రతుకుతున్నప్పుడు కవులు కలాలను, కళాకారులు గళాలను విప్పారు. ఈ తీవ్రతను అందరికన్నా పదునుగా చెప్పినవాడు నాజర్. అందుకే ఇతివృత్త స్వీకారంలో నాజర్ శైలి విభిన్నమైనది. పౌరాణికాలను స్పృశించినా, చారిత్రకాలను స్వీకరించినా అందులో సామాజిక స్పృహకు, మానవీయతకు, యదార్థతకు పెద్దపీట వేస్తాడు. పల్నాటి యుద్ధం కథను పలువురు కొంత చారిత్రకం కొంత కల్పనలను జోడించి వ్రాశారు. మానవతా వాదానికి, కమ్యూనిజానికి కట్టుబడిన నాజర్ పల్నాటి యుద్ధం బుర్రకథలో ఎవరూ




**నాజర్‌కు స్వాగతం పలుకుతున్న ఆగ్రా తెలుగు సంఘం**

స్పృశించని సరికొత్త కోణాన్ని ఆవిష్కరించారు. కథా కాలంనాటికి మాల, మాదిగ, చాకలి, మంగలి, ఎరుకల, యానాది, దొమ్మరి, బుడబుక్కల, కోయ, చెంచు, లంబాడీ వంటి పేద ప్రజానీకం బ్రతుకులు ఎంతో నికృష్టంగా ఉన్నాయి. వీరి ఉద్ధరణకు బ్రహ్మనాయుడు చాపకూటి సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. అణగారిన పేదలంతా సంఘటితమై ఉద్యమిస్తే తప్ప ఆ బ్రతుకుల్లో వెలుగు ప్రసరించదనే సిద్ధాంతాన్ని ఈ కథలో ప్రస్ఫుటంగా ప్రతిబింబించాడు.

బొబ్బిలి యుద్ధం కథలో ఇప్పటి వరకూ మనకు తెలిసిన కోణం విజయనగర ప్రభువైన విజయరామరాజు మనసులో ఉన్న అసూయ, ద్వేషాలే బొబ్బిలి రాజుల పతనం అనే విషయం. కానీ బొబ్బిలి యువరాజైన వెంగళరాయుని పందివేట, సాగునీటి కోసం రెండు రాజ్యాల మధ్య చెలరేగిన వివాదాలే కారణమని నాజర్ మరుగున పడిన చారిత్రక అంశాలను తనకథ ద్వారా బట్టబయలు చేశాడు. ఈ అంశాన్ని రెండు ప్రాంతాల ప్రజలు ఆమోదించి నాజర్‌కు బ్రహ్మరథం పట్టారు. జ్ఞానజ్యోతి క్రీస్తు కథ ద్వారా "పరలోక రాజ్యం" గురించి అద్భుతమైన వివేచన చేశాడు. కుహనా మతవాదుల స్వార్థ పరత్వాన్ని చీల్చిచెండాడాడు. పరలోక రాజ్యమంటే కనబడని ఏ మబ్బుల చాటునో ఉండదని కష్టాలలో ఉన్న సాటి మనిషిని ఆదరించడమే దైవత్వానికి నిర్వచనమనీ చెప్పాడు. తరతరాల మత మౌఢ్యంలో పడి ఉక్కిరిబిక్కిరౌతున్న పతితుల, తాడితుల, పీడితుల వర్గ చైతన్యానికి కృషి చేసిన వైతాళికునిగా క్రీస్తును తీర్చిదిద్దాడు. ఇలా ప్రతికథలోనూ సామాజిక స్పృహను అద్ది, మానవీయతను దిద్దాడు.

నాజర్‌కు పూర్వం ఉన్న కథకులు అందరూ కేవలం యక్షగాన బాణీలు, రీతులను ఉపయోగించి చెప్పేవారు. కానీ ప్రజల వాణి, అచ్చ తెలుగు ప్రజాకళల బాణీలను తొలిసారిగా ప్రవేశపెట్టిన ఘనత నాజర్‌కే దక్కుతుంది. ఇందుకోసం యాదవదాసులు, మాలదాసులు, వీధి భాగవతుల వద్దకు స్వయంగా వెళ్లి వారి గాన రీతులను అధ్యయనం చేశాడు. ఇతర రాష్ట్రాలకు చెందిన కరీంఖాన్, బిస్మిల్లాఖాన్, రాచప్ప, కిష్టప్ప, రాజారత్నం పిళ్లే వంటి విద్వాంసుల సంగీత రికార్డులను నిశితంగా పరిశీలించాడు. శాస్త్రీయ సంగీతంలోని మాధుర్యాలకు జానపద బాణీలను మేళవించాడు. అందుకే నాజర్ పాట అమందానందకందళిత హృదయారవిందంగా ఉంటుంది. ఒక సమ్మోహన శక్తితో మనసుకు తాడుకట్టి తీసుకొని వెళుతుంది.

బుర్రకథకు మాతృక యక్షగానం అనే విషయాన్ని సోపపత్తికంగా నిరూపించడంలో నాజర్ కృషి అసామాన్యం. యక్షగాన గాయకులను పదపదార్థ విజ్ఞాన ప్రబోధకులు అనే అర్థంలో పిలుస్తున్నారు. పదమంటే జనులు నివసించే భూమి, పదార్థమనగా వంటింటికి సంబంధించిన సరుకుగా నాజర్ అర్థం చేసుకొన్నాడు. అప్పకవి యక్షగానానికి చెప్పిన నిర్వచనంలో ఉన్న రగడలు, అర్ధ చంద్రికలు అన్నీ బుర్రకథలో ఉన్నాయి. తుది ఏడు లఘువులు తొలిగించి చదివిన ద్విపదకు వృషభగీతి పదయుగమని అన్నారు. వాటిని అర్ధ చంద్రికలు అని కూడా పిలిచారు. కావమ్మ కథ, బొబ్బిలి రాజుల కథ, సర్వాయి పాపడు కథ, ఇలా ఒక్కొక్క కథను ఒక్కొక్క రగడ నుండి రూపొందించారని నాజర్ భావించాడు. వినరా భారతవీరకుమారా విజయము మనదేరా" అనేది రగడ. దీనిలో సగభాగాన్ని చూస్తే అర్ధ చంద్రిక కన్పిస్తుంది. ఈ విధంగా బుర్రకథకు యక్షగానం మూలమని నిరూపించాడు.

బుర్రకథకు ఒక అర్థాన్ని, పరమార్థాన్నీ గుర్తింపును తెచ్చిన ఖ్యాతి నాజర్‌కు దక్కుతుంది. కథకుడు ధరించవలసిన దుస్తుల నుండి, తంబూర పట్టుకొనే విధానం వరకూ నాజర్ ఒక రూపకల్పన చేశాడు. తంబూర ఎడమ భుజాన పెట్టవద్దు. ఎందుకంటే తంబుర కుండే కుండ వంటి భాగం రొమ్ముకు ఆనుకొని ఉంటుంది. ఆ కిందనే గుండె ఉంటుంది. దానికి బరువు ఆనకూడదు. దమ్ముపట్టి పాడాలి కనుక కుడిభుజం పైనే తంబురను ధరించాలి. కథకుని వేషధారణకు కూడా ఒక ప్రత్యేకత ఉంది. లోన లంగోటి, పైన షర్వా, బిగుతైన పొడవు చేతుల లాల్చీ, పైన లంగా, తలకు తోక విడిచిన కోపు ఉండాలి. తలపాగా కాషాయం రంగు, ఆ పైన ఎరుపు రంగు బెల్టు,



**గుండెలను పిండే విషాదాన్ని పలికిస్తున్న నాజర్**

అందెలకు ఎర్రచేతి గుడ్డ ధరించాలి. వీర, శృంగారాది రసాలను అన్నీ ఒక్కడే పోషించాలి. కథలోని అన్ని పాత్రలను కథకుడే ధరించాలి. హాస్యవంతగాడు ఎడమచేతి వైపు, రాజకీయ వంతగాడు కుడివైపున ఉండాలని" నాజర్ సూత్రీకరించారు. జవసత్వాలుడిగి పోయిన బుర్రకథ కళారూపానికి జీవం పోసిన జానపద కళాస్రష్ట నాజర్. అట్టడుగు ప్రజానీకపు కన్నీళ్లకు కళారూపాల్లో ప్రాణప్రతిష్ట చేసిన ప్రజాకవి నాజర్. తన ఆటద్వారా పాటద్వారా ప్రజలను ఉర్రూతలూగించి చైతన్యవంతం చేసిన ప్రజానటుడు నాజర్. శక్తిమంతమైన ఆయుధం లాంటి బుర్రకథకు మూడక్షరాల ముద్దుపేరు, మారుపేరు నాజర్. అందుకే నాజర్ కథ చెప్పిన చోట ఉద్రేకం ఉర్రూతలూగేది. వాతావరణం దావాగ్ని పొగలను కక్కేది. రక్తం ఉడుకెత్తి ఉరకలు వేసేది. గంధకపు రాసులపై నిప్పు కణికలతో వ్రాసిన గీతాలు భగ్గున మండేవి.

బుర్రకథకునిగా గానం ఒక్కటుంటే చాలదు. అద్భుతమైన ఆంగికాభినయం ఉండాలి. శాస్త్రీయ, జానపద నృత్య విశేషాలలో ప్రావీణ్యం ఉండాలి. నాజర్ ఈ అంశాలపై ప్రత్యేక శ్రద్ధను కనపరిచాడు. యుద్ధ ఘట్టాలలో నాజర్ నటన పతాక స్థాయిలో ఉండేది. ప్రేక్షకులకు రోమాంచితాన్ని కలిగించేది. ప్రతిపాత్ర తీరును అధ్యయనం చేసి అభినయించేవాడు. నాజర్ బుర్రకథలకు భాష సహజమైన అలంకారం. అర్థంకాని భాషాభేషజాలు ఎక్కడా కనిపించవు. నిఘంటువులను ఆశ్రయించవలసిన అగత్యం

ఎక్కడా రాదు. చక్కని, చిక్కని వ్యవహారిక భాష ఎడనెడా సరసమధురంగా తల ఊపుతూ కన్పిస్తుంది. అచ్చమైన గ్రామీణ భాష పల్లెలంత స్వచ్ఛతను, పల్లె ప్రజలంత ఆప్యాయతను చిలకరిస్తుంది. అక్కడ కూడా మాండలిక భాష మాండోలిన్ వాయిద్య మధురిమలతో పరిమళిస్తుంది. జనం కథలను జనం భాషలో చెప్పి వారికి ఆత్మీయుడయ్యాడు. బుర్రకథ ప్రక్రియను ప్రతి పామరునికీ పరిచయం చేశాడు. శ్రీనాథుడు వ్రాసిన "చిన్నచిన్న రాళ్లు" పద్య బాణీలో వ్రాసిన పద్యమే నాజర్ భాషా వైచిత్రికి నిదర్శనంగా నిలుస్తుంది.

పచ్చిపులుసు కాంప్పచ్చుళ్లు పున్నీళ్లు
కూరలేని కూళ్లు కుక్క తిళ్లు
గోచిలేని వాళ్లు గొడ్డు చాకిరిగాళ్లు
పల్లె పల్లెలందు పేదవాళ్లు

మామూలు సాదాసీదా మాటలతో.. అంత్య ప్రాసలతో వ్యవస్థపై, రాజకీయాలపై విచ్చుకత్తులను విసిరారు. ప్రభుత్వం విధిస్తున్న పన్నులపై చుట్టపన్ను, అగ్గిపన్ను, చీపురు కట్ట పన్ను అంటూ వ్యంగ్యాస్త్రాలను సంధించాడు. ధనరక్కసి లీలలను వివరిస్తూ "ధనానికి దండం.. దినానికి దినగండం.. అదేమంటే మరణ దండం" అనే ఛలోక్తి విసిరారు. ప్రభుత్వం మద్యపానాన్ని ప్రజలకు అందుబాటులోకి తెచ్చిన వైనాన్ని విమర్శిస్తూ "ప్రభుత్వ సారా బోరుకొట్టు స్పిరిట్ కలిపి కొట్టు" తాగినోడు నెలబతికితే ఒట్టు అంటూ భుజాలు తడుముకొనేలా చేశాడు. రాజకీయ నాయకుల అక్రమార్జన గూర్చి వివరిస్తూ "బంధువుల పేర బస్ రూట్లు" "భార్యల పేర్ల ఇళ్ల ప్లాట్లు" "ఓట్లిచ్చిన మనకు అగచాట్లు" అంటూ విసుర్లు విసిరారు. మామూలు మాటల్లో ప్రయోగించిన యమకాలంకారాలూ నాజర్ కథల్లో ఉన్నాయి. "పోనాథా పోయెదవా.. పోయెదవా.. పో..యెదవా" అనేవి ఇందుకు ఉదాహరణలు. కుహనా ఆదర్శవాదులను నైజాన్ని గూర్చి "ప్రేమించి పెళ్లిచేసుకో నీ కట్నాలన్నీ గుట్టుగా తీసుకో" అంటూ రచ్చకీడ్చాడు. నాజర్‌కు తొలిశ్రోతలు, విమర్శకులు ఆయన తల్లి.. భార్య ఆదంబీ. వ్రాసిన దాన్ని ముందుగా వారికి వినిపిస్తే "కాస్త కారం ఎక్కువైంది అనో.. కాస్త ఉప్పు తక్కువైంది" అనో చెప్పేవారు. దీనిని బట్టి నాజర్ తిరిగి మార్పులూ.. చేర్పులూ చేసేవాడు.

నాజర్ కష్టాలలో పెరిగాడు. కష్టాలతో తిరిగాడు. ఆకలి బాధల ఆర్తనాదాలు ఆయనకు తెలుసు. ఎవరైనా కష్టంలో ఉంటే భరించే వారుకాదు. తనకు దూరపు బంధువైన చిన్నబ్బాయి చాలాకాలం నాజర్ వంతగా వ్యవహరించాడు. చిన్నబ్బాయి

చనిపోయిన రోజు తనకు బహుమతిగా వచ్చిన వెండి కప్పులను అమ్మి దహన క్రియల కోసం వినియోగించాడు.

నాజర్ ఆలోచనా విధానం విలక్షణంగా ఉంటుంది. మంచిగానీ.. చెడుగానీ తాను చెప్పినదాన్ని చేసేవాడు. చేసేదాన్ని చెప్పేవాడు. మొదట కమ్యూనిస్టు పార్టీలో క్రియాశీలకంగా పనిచేశాడు. ప్రజానాట్యమండలి గుంటూరు జిల్లా దళంలో, తరువాత రాష్ట్ర దళంలో పనిచేశాడు. ప్రజానాట్యమండలిపై నిషేధం విధించిన తరువాత కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలింది. మొదట లెఫ్ట్ పార్టీ వేదికపై కథలు చెప్పడం ప్రారంభించారు. దీనితో మితవాద వర్గం నాజర్ కథలను తమ వేదికపై పెట్టడం మానివేసింది. శ్రీకాకుళం ప్రాంతంలో నగ్జల్బరీ ఉద్యమం రాజుకొంది. ఆ గ్రూపును సమర్ధిస్తూ కథలు చెప్పడం ప్రారంభించాడు. దీనితో లెఫ్ట్ గ్రూప్ వారికి కూడా నాజర్ దూరమయ్యాడు. ప్రకాశం జిల్లా కంభంలో విప్లవ రచయితల సంఘం సభల్లో నాజర్ కథను విన్న తరువాత మీ రాజకీయ బోధనా విధానాలు బాగున్నాయని శ్రీశ్రీ ఆధ్వర్యంలో విరసం సభ్యునిగా చేర్చుకొన్నారు. **"విరసం కార్యకలాపాలలో పాల్గొన్న తరువాత అక్కడ ఏదో లోటు కనిపించింది. ఆ సంఘంలో ఎరుకలు లేరు. యానాదులు లేరు. నాకు వరుస కలిపే కళాకారులు కన్పించలేదు. కొంతకాలానికి నాజర్ నీ ధోరణి మార్చుకోవాలని నిఖిలేశ్వర్ నుండి ఒక ఉత్తరం వచ్చింది. అయ్యా మీ సంఘంలో నన్ను చేర్చుకొన్నప్పుడు మీరు విన్న కథ నాది. అది విని మీరు చేర్చుకొన్నారు. ఆ తరువాత నా కథలో ఎటువంటి మార్పు లేదు. నేను మార్చుకోవలసింది ఏమీలేదు. నేను మార్చుకోను. ఆనాడు చెప్పినా ఇదే చెప్పాను. ధనిక రైతులను కమ్యూనిస్టులనుకొని వాళ్లను నాయకులుగా చేసి కళాకారుడిగా పెద్ద తప్పు చేశానని అనుకొన్నాను. ఇప్పుడూ అదే అనుకొంటున్నాను. అట్టడుగు వారు కలిసి సంఘాలై నాయకులైన నాడే దేశానికి విముక్తి కానీ అలాంటి వాళ్లెవరూ మీలో కన్పించడం లేదని అన్నారు. నా నమ్మకం గొప్పది అన్నాను. నన్ను విరసం నుండి తొలగిస్తున్నట్లు సర్క్యులర్ వచ్చింది. అప్పటి నుండి కమ్యూనిస్ట్ పార్టీలు తమ వేదికలకు నన్ను పిలవడం మానివేశారని"** నాజర్ పింజారీ ఆత్మకథలో పేర్కొన్నారు.

ఒకరోజు పొద్దున్నే మూడురంగుల జండా కట్టిన టాక్సీ నాజర్ ఇంటిముందు ఆగింది. నాజర్ తల్లి వీధివాకిలి ఊడ్చి వంగి నడుంమీద చేయి ఆన్చి తలవంచి రెండడుగులు వేసి తేరిపార చూసింది. ఈ జండా కారు మన ఇంటి ముందు ఆగిందా

ఏమిటి అని నాజర్‌ను అడిగింది. బూర్జువా పార్టీని తిట్టిన మన పార్టీ నాయకులు ఎన్నికల్లో స్వతంత్ర పార్టీని బలపరుస్తున్నారు. నేను బ్రహ్మానందరెడ్డిని బలపరుస్తూ బుర్రకథ చెప్పబోతున్నానని నాజర్ తల్లితో చెప్పాడు. **"నాయనా దిన పస్తులున్నావ్. అడుక్కొని విద్యనేర్చుకొని, లాఠీ దెబ్బలు తిని, పడరాని పాట్లు పడి జైలుకెళ్లావ్, కనిపిస్తే కాలుస్తా మన్నారు. తంబూరా వేలు నరికేస్తామన్నారు ఎన్నో గండాలు గడిచాయి. గడ్డపారలే గాలికి పోయాయన్నట్లు గడపాము. ఒక్క అమ్మకి అయ్యకి పుట్టాడు నాజర్ అని అనుకొంటున్నారు జనం. వాళ్లు చేసిన పనిమనం చెయ్యాలా. మరోసారి ఆలోచించుకో"** అంది కారులో వచ్చిన వ్యక్తితో తాను రాలేనని నాజర్ చెప్పారు. **"ఇంట్లో చెల్లని వెధవా"** అంటూ ఆ వ్యక్తి తిట్టుకొంటూ వెళ్లాడు.

ఒక సభలో ముందు శ్రీశ్రీ ఉపన్యాసం తరువాత నాజర్ బుర్రకథ ఏర్పాటు చేశారు. శ్రీశ్రీ ఉపన్యసిస్తూ ఉండగా ఉపన్యాసం వద్దు నాజర్ కావాలని ప్రేక్షకులు అల్లరి చేశారు.

రాష్ట్రపతి భవన్‌లో పద్మశ్రీ పురస్కారం అందుకొన్న తరువాత గుంటూరు వస్తున్నప్పుడు **"ఆదంబీ ఈ పద్మశ్రీలూ, సన్మానాలూ జనం వేసే ఒక్క ఈలకు సమానం కాదు"** అన్నారు. యన్.టి.రామారావు ఎన్నికల ప్రచారానికి గుంటూరు వచ్చినప్పుడు నాజర్ కుటుంబ సభ్యులందరూ ఆయన్ని కలిసి మేము మీ అభిమానులమని చెప్పారు. అప్పుడు యన్.టి.ఆర్. నేను నాజర్ గారి అభిమానినమ్మా అంటూ వారికి సకల మర్యాదలు చేశారు.

జోలెపట్టి భిక్షాటన చేస్తూ విద్య నేర్చుకొన్నాడు. బుర్రకథకు పర్యాయపదంగా నిలిచారు. డాక్టర్ గాంధ్ల వెంకట్రావు ఆధ్వర్యంలో ఒంగోలులో నిర్వహించిన డాక్టర్ గరికపాటి రాజారావు వర్ధంతి సభలో నాజర్‌ను ఘనంగా సన్మానించారు. ఆ సభలో **సోది, యానాది, ఎరుకల, మాదిగ, చిందు, జక్కలి వంటి ప్రాచీన జాతి కళా వంశీయులారా, నాపై మీరుంచిన అమూల్యమైన ప్రజల యొక్క వేషభాషలు, రగడల పట్లు, శ్రుతిలయ సాయలు, గానాలు, నాట్యనడకలు, హావభావ నటనలు, దరువులు వంటి బుర్రకథ సంప్రదాయ కృషిలో నాశక్తికి మించిన కృషిచేసినందుకు గుర్తులుగా ప్రజలు, ప్రభుత్వాలు, ప్రసాదించిన బహుమతులు నా కృషికీ, కష్టానికీ ఫలితాలు మీకు మారుగా నేను స్వీకరించానని సవినయంగా మనవి చేసుకొంటున్నాను. తెలుగు జానపద కళాత్మక హృదయులారా బుర్రకథ నా ఇంట పుట్టిన కథగాదు. నా గురువులు, షహనాయి,**

**నౌబత్ వాయిద్య కళాకారులు, మీ నుండి స్వీకరించిన జాతిజ్ఞాన కళారూపాన్ని, నా శక్తికి మించి సాకి పెద్దచేసి ఉన్నతవేదిక లెక్కించి బంగారు సింహతలాటాలు, గండ పెండేరాలూ, కేయూర రత్నమణిహారాలు ధరింపజేశారు. మంత్రుల చేత సన్మానాలు చేయించారు. పద్మశ్రీలు ఇప్పించారు. మీరు నా కందించిన కళకు న్యాయం చేకూర్చాననుకొంటున్నాను. నేను వచ్చిన పని అయినది. ఇంక నిశ్చింతగా నిద్రపోతానని** అంటూ ముగించాడు.

సినీనటి జమునకు నటనలోనూ, సినీ సంగీత దర్శకుడు చక్రవర్తికి సంగీతంలోనూ నాజర్ శిక్షణనిచ్చాడు. వరంగల్లులో బుర్రకథ చెప్పిన తరువాత ప్రజాకవి కాళోజి నారాయణరావు ఎర్రరంగులో ఉన్న బంగారు నక్షత్రాన్ని తలపాగాకు అమర్చాడు. ఆ నక్షత్రాన్ని కథలు చెప్పనంతవరకూ తలపాగాకే ఉంచేవాడు.

నాజర్ మరణానంతరం ఆయన అభిమానులు, శిష్యులు స్వగ్రామమైన పొన్నెకల్లులో శిలావిగ్రహాన్ని ఏర్పాటు చేశారు. గుంటూరులో నాజర్ అభిమానులు త్వరలో విగ్రహం ఏర్పాటుకు కృషి చేస్తున్నారు. నాజర్ అవసానదశలో ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో **"ఔత్సాహిక బుర్రకథకులు ప్రజానీకంతో కలసిపోయి బ్రతకాలి. కథలు చెబుతూ ప్రజాసేవ చేయాలి. సమాజంలోని రుగ్మతలపై బుర్రకథలను వ్రాయాలి. అప్పుడే ప్రజలు బ్రహ్మరథం పడతారు. ప్రభుత్వం నుండి దేనినో ఆశిస్తే లాభం లేదు. ప్రజా సమస్యలపై పోరాడే కథలు వ్రాస్తే ప్రజలే కళాపోషకులౌతారు"** అని పేర్కొన్నాడు.

ప్రజలను చైతన్యవంతం చేసేది ప్రజాకళ. బుర్రకథ ద్వారా వినోదాన్ని, విజ్ఞానాన్ని సమపాళ్లలో మేళవించి ఆ ప్రజాకథకు ఒక అనంతత్వాన్ని కలిగించిన నాజర్ చిరస్మరణీయుడు. ప్రజా చైతన్యానికి బుర్రకథను అద్భుతమైన సాధనంగా ఆయుధంగా మలిచిన నాజర్‌తో ఆ కథ ఆగి పోకూడదని ఎందరో ఔత్సాహికులు ఆయన దారిలో నడుస్తున్నారు. మరెందరో ఔత్సాహికులకు ఈ కళలో శిక్షణ ఇవ్వాలి. ఈ బుర్రకథ చైతన్యస్రవంతి కావాలి. అందుకు అటు ప్రభుత్వం ఇటు ప్రజలు స్పందించాలి. అదే ఒక జాతిని, ఒక తరాన్ని ఉర్రూతలూగించిన ప్రజా కళాకారునికి నివాళి.



# 18

# నాజర్ జీవితములో కొన్ని ఘట్టాలు



తంబురను శృతి చేస్తున్న నాజర్




పద్మశ్రీ నాజర్ నెలకొల్పిన బుర్రకథ పాఠశాలలో సాధన చేస్తున్న కళాకారులు



నాజర్ బుర్రకథ బృందం సన్మానకర్తలతో...




నాజర్ గారికి దండకడియం అలంకరణ



ప్రార్థన చేస్తున్న నాజర్ దంపతులు

# 19

# ఆధార గ్రంథాలు


1. ఆంధ్ర నాటకరంగ చరిత్ర - డా॥ మిక్కిలినేని. ప్రచురణ 2005.
2. జాతిజీవితం - కళా పరిణామం - షేక్ నాజర్, నాజర్ కళాక్షేత్రం, గుంటూరు, 1997
3. తెలుగు జానపద గేయ గాథలు- ఆచార్య నాయని కృష్ణకుమారి.
4. తెలుగు విజ్ఞాన సర్వస్వం - 3వ సంపుటి (తెలుగు సంస్కృతి)
5. పింజారి - డాక్టర్ అంగడాల వెంకట రమణమూర్తి, ఉప్పులూరు, 2001.

## ప్రత్యేక సంచికలు

1. చైతన్య స్రవంతి - తానా జానపద కళోత్సవాల ప్రత్యేక సంచిక, హైదరాబాద్, 2006.
2. ప్రజాసాహితి ప్రజా కళల ప్రత్యేక సంచిక - విజయవాడ, సెప్టెంబర్ 2001

## బుర్రకథలు (ముద్రితాలు)

1. నేటి రాయలసీమ, స్వరాజ్య పబ్లికేషన్స్, విజయవాడ, 1984.
2. పల్నాటి యుద్ధం, స్వరాజ్య పబ్లికేషన్స్, విజయవాడ, 1984.
3. బొబ్బిలి యుద్ధం, స్వరాజ్య పబ్లికేషన్స్, విజయవాడ, 1984.
4. శ్రీరామరాజు చరిత్ర, స్వరాజ్య పబ్లికేషన్స్, విజయవాడ, 1984.
5. సుంకర బుర్రకథలు, సుంకర శతజయంతి కమిటీ, విజయవాడ, 2009.

## నాటకం

1. ఆసామి – షేక్ నాజర్ నగారా ప్రచురణలు, విజయవాడ.

## పత్రికలు

1. ఈనాడు
2. ఉదయం
3. ఆంధ్రజ్యోతి
4. ఆంధ్రభూమి
5. నలుపు
6. నాట్యకళ

## అముద్రితాలు

<u>బుర్రకథలు</u>

అభిమన్యు యుద్ధం – షేక్ నాజర్
జ్ఞానజ్యోతి క్రీస్తు ,,
వీధిభాగవతం ,,
భక్తప్రహ్లాద ,,

## ఇంటర్వ్యూలు

1. కర్నాటి లక్ష్మీనరసయ్య
2. మాచినేని వెంకటేశ్వరరావు
3. డాక్టర్ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి
4. షేక్ ఆదంబీ (నాజర్ సతీమణి)
5. షేక్ బాబూజీ (నాజర్ చిన్నకుమారుడు)
6. షేక్ సాయిబాబు (నాజర్ పెద్దకుమారుడు)

## అముద్రిత వ్యాసాలు

1. ఇది నాకథ (నాజర్ స్వయంగా వ్రాసుకొన్న సుదీర్ఘ ఆత్మకథ వ్యాసం)

# సి.పి. బ్రౌన్ అకాడమీ

104, నిర్మల్ టవర్స్, మెగాసిటీ నెం. 200. ద్వారకాపురి కాలనీ.
పంజాగుట్ట, హైదరాబాద్-500 082.

## మా ప్రచురణలు

| Telugu Learning Kit [A set of 8 books in English and Telugu with Audio CD (10 hours)] | Rs. 495 | |
|---|---|---|
| పుస్తకము | పేజీలు | వెల రూ॥లలో |
| • తెలుగు వర్ణమాల | 52 | 60 |
| • తెలుగు వర్ణమాల (వర్క్‌బుక్) | 132 | 60 |
| • తెలుగు శబ్దమాల | 88 | 60 |
| • వాక్య నిర్మాణం | 76 | 60 |
| • తెలుగులో మాట్లాడుకుందాం | 83 | 60 |
| • సుమతీ శతకము | 60 | 60 |
| • వేమన శతకము | 70 | 60 |
| • సామెతలు | 40 | 60 |

## ఇతర ప్రచురణలు

| పుస్తకము | రచయిత | పేజీలు | వెల రూ॥లలో |
|---|---|---|---|
| • అదుసుమల్లి శ్రీనివాసరావు జీవిత చరిత్ర | డా॥ వెలగా వెంకటప్పయ్య | 132 | 95 |
| • దుర్గాబాయి దేశ్‌ముఖ్ జీవిత చరిత్ర | ఇంద్రగంటి జానకీబాల | 91 | 90 |
| • వావిళ్ల రామస్వామి శాస్త్రి జీవిత చరిత్ర | వజ్ఝల వేంకట సుబ్రహ్మణ్యశర్మ | 112 | 90 |
| • మనుసంభవము (కావ్యం—ఇంగ్లీష్‌లో) | ప్రొ. ఎస్.ఎస్. ప్రభాకరరావు | 108 | 120 |
| • తెలుగు పరిశోధన వ్యాసమంజరి | డా॥ వి. నిత్యానందరావు | 267 | 175 |
| • ఆముక్తమాల్యద పరిచయం | శ్రీ మల్లాది హనుమంతరావు | 149 | 95 |
| • వసుచరిత్రము పరిచయం | డా॥ కిళాంబి జ్యోతిర్మయి | 99 | 95 |
| • సి.పి. బ్రౌన్ అకాడమీ బహుమతి కథలు-2008 | 20 కథల సంకలనం | 217 | 150 |

## సాహితీ స్రవంతి త్రైమాసిక పత్రిక

*గౌరవ సంపాదకులు:* **డా॥ ఆవుల మంజులత**

*సలహామండలి సభ్యులు:*

ఆచార్య చేకూరి రామారావు

ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

డా॥ అక్కిరాజు రమాపతిరావు

ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి

ఆచార్య జొన్నలగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

శ్రీ మల్లాది హనుమంతరావు

### సాహితీ స్రవంతి
**ఏప్రిల్ - జూన్ 2009**
**సంపుటి: 1 - సంచిక: 1**

- శ్రీ వాణీ గిరిజా:
  - కోవెల సంపత్కుమారాచార్య
- నేనూ - ఆకాశం (కవిత)
  - సి. నారాయణరెడ్డి
- కథ - కథానిక
  - కాశీపట్నం రామారావు
- అమెరికాలో తెలుగు కథ
  - మాచిరాజు సావిత్రి
- ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారితో ముఖాముఖి
- ఆంధ్ర మహాభారత రచనా ప్రణాళిక
  - లకంసాని చక్రధరరావు
- భండారు అచ్చమాంబ: తొలి తెలుగు కథా రచయిత్రి
  - కొండవీటి సత్యవతి

•••

### సాహితీ స్రవంతి
**జులై - సెప్టెంబర్ 2009**
**సంపుటి: 1 - సంచిక: 2**

- ఆముక్త మాల్యద-ఆదర్శ ప్రభుత్వం
  - ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
- ఒకే పద్యంలో విద్యా వ్యవస్థ
  - డా॥ గరికిపాటి నరసింహారావు
- బిరుదురాజు రామరాజుగారితో ముఖాముఖి
  - ఆవుల మంజులత
- 'మమకారం' కథ (తెలుగు)
  - త్రిపురనేని గోపీచంద్
- తెలుగు సాహిత్యం-ముస్లిముల సేవ
  - ఆచార్య కె. రుక్నుద్దీన్
- దళిత కవిత్వం-ఒక యుగచైతన్యం
  - ఆచార్య ననుమాసస్వామి
- మలేసియాలో తెలుగు భాష, చరిత్ర, సంస్కృతులు
  - మదిని సోమనాయుడు

•••

**విడి ప్రతి: రూ॥ 20 సంవత్సర చందా: రూ॥ 80**

*ప్రతులకు,* చందా చెక్/డిడి/మనియార్డర్ రూపంలో 'అల్ఫా ఫౌండేషన్' హైదరాబాద్ పేరు మీద ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**సి.పి. బ్రౌన్ అకాడమీ**

104, నిర్మల్ టవర్స్, మెగాసిటీ నెం. 200. ద్వారకాపురి కాలనీ, పంజాగుట్ట, హైదరాబాద్-500 082.

ఫోన్ : 040-23423188 వెబ్‌సైట్ : www.cpbrownacademy.org

ఇ-మెయిల్ : info@cpbrownacademy.org




డా॥ కందిమళ్ల సాంబశివరావు

ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్

తెలుగు రీడర్,

డి.ఆర్.యన్.యస్.సి.వి.యస్. కళాశాల,

చిలకలూరిపేట - 522616.


తెలుగునాట బుర్రకథ కళారూపానికి ఒక గుర్తింపును, గౌరవాన్ని తెచ్చిన స్రష్ట.. ద్రష్ట.. నాజర్. ఆయన చండం చండం తీవ్ర తీవ్రంగా కథను చెబుతున్నంతసేపు ప్రేక్షకులు దానిలో లీనం కావడాన్ని చూస్తే కళకు ప్రజకూ మధ్య తెరలు తొలిగిపోయినట్లు స్పష్టంగా తెలుస్తుంది. కళలు అంతఃపురాల జిలుగు పరదాలను చీల్చుకొని ప్రజలకు అంకితమైన స్థితికి అద్దం పడుతుంది. జనం మెచ్చిన.. నచ్చిన కవుల కలానికీ, గాయకుల గళానికీ మరణం లేదు. ప్రజల చేత.. ప్రజల వలన.. ప్రజల కొరకు కవిత చెప్పేవారు.. గళం విప్పేవారు అజరామరులు. ఈ నమ్మిక.. నిబద్ధతతోనే నాజర్ కలం పట్టి.. గళం విప్పిన నాటి నుండి కన్నుమూసే వరకు బుర్ర కథలు వ్రాశారు.. పాడారు.. ఆడారు..


ISBN 978-81-908030-7-6




Rs:90






**సి.పి. బ్రౌన్ అకాడమీ**

**104, నిర్మల్ టవర్స్, మెగాసిటి నం. 200, ద్వారకాపురి కాలనీ,**

**పంజాగుట్ట, హైదరాబాద్ - 500 082**

www.cpbrownacademy.org


162

